ఓం
శ్రీ గురుభ్యోనమః

శ్రీ శివరామదీక్షిత అచలఋషి సిద్ధాంతము

# శ్రీ నిజగురు పూజావిధానము

## భావార్థ సంగ్రహము



శ్రీకృష్ణోద్ధవార్జున సంవాదంబను జ్ఞానాతీత బోధిని

గ్రంథ సేకరణ - బావార్థకులు
శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి
శ్రీ సాందీపాశ్రమం, గొల్లగూడెం.

## శ్రీ శ్రీధరస్వాములవారి ప్రియశిష్యులు

**శ్రీ మద్రామడ్గు శివరామదీక్షితుల వారు**

పరిపూర్ణబోధ పొందిన తర్వాత అచల సాంప్రదాయ
పద్ధతిగ రాజయోగ దర్మంగ ఉన్నప్పటి పోటో



**శ్రీ మద్రామడ్గు శివరామదీక్షితుల వారు**

పరిపూర్ణబోధ తెలుసుకోకముందు యజ్ఞకర్తగా, భోక్తగా
అద్వైతసిద్ధిగా, యోగిగా ఉన్నటువంటి పోటో

శ్రీమత్ కంబాలూరి అప్పబ్రహ్మం వారి ప్రియశిష్యులు




శ్రీమత్ పరశురామ సీతారామస్వామి

శ్రీపరశురామ సీతారాములవారి ప్రియశిష్యులు



శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారు

శ్రీ మద్భాగవత కృష్ణదేశికేంద్రుల వారి ప్రియశిష్యులు



శ్రీ ఫీల్ఖాణ లక్ష్మణ దేశికేంద్రుల వారు

శ్రీమద్భాగవత కృష్ణ ప్రభువుల వారి ప్రియశిష్యులు




శ్రీమత్ ఫీల్ఖాణ శంకరప్రభువుల వారు

శ్రీ కరుణానంద నాగుల రామలింగార్యుల వారి ప్రియశిష్యులు



శ్రీ నిర్భయానంద చింతకింది బుచ్చయార్యుల వారు

శ్రీ కరుణానంద నాగుల రామలింగార్యుల వారి ప్రియశిష్యులు



శ్రీ సచ్చిదానంద చింతకింది సాయనార్యుల వారు

శ్రీ సచ్చిదానంద చింతకింది సాయనార్యుల
వారి ప్రియశిష్యులు



శ్రీ సమరసానంద మోతె కృష్ణయ్య గారు

శ్రీ సమరసానంద మోతె కృష్ణయార్యుల ప్రియశిష్యులు

శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి

ఓం
శ్రీ గురుభ్యోనమః

గురుర్బ్రహ్మా గురుర్విష్ణు: గురుర్దేవో మహేశ్వర: !
గురుస్సాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీగురవేనమ: !!

# శ్రీ నిజగురు పూజావిధాన భావార్థ సంగ్రహము

## మరియు శ్రీకృష్ణోద్ధవార్జున సంవాదంబను జ్ఞానాతీతబోధిని


సేకరణ - భావార్థకులు :

**శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**

**సాందీపాశ్రమం, గొల్లగూడెం.**

ఓం
శ్రీ గురుభ్యోనమః
శ్రీ క్రిష్ణ పరబ్రహ్మణే నమః

ప్రథమ ముద్రణ : 21-3-2010
ప్రతులు : 1000

**డి.టి.పి. & కవర్ డిజైనింగ్ :**

**శ్రీక్రిష్ణ గ్రాఫిక్స్**

*శ్రీ సాందీపాశ్రమం,*
*గ్రా॥ గొల్లగూడెం, మం॥ చేవెళ్ళ,*
*జి॥ రంగారెడ్డి-501503.*
*సెల్ : 99662 71579.*

ముద్రణ :

**కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**

*40-ఎపిహెచ్‌బి, విద్యానగర్*
*హైదరాబాద్ - 500 044*
*ఫోన్ : 27618261*

మూల్యం : రూ॥ **40/-**



శ్రీగురుభ్యోనమః **మున్నుడి** శ్రీసద్గురువేనమః

శ్రీమత్ శ్రీశివరామదీక్షిత సిద్ధాంత అచల బంధువులార మీకు వందనములు చేయుచు తెలియజేయు వివరము శ్రీనిజగురుపూజావిదానము మన మూలపురుషులు బాగవత శ్రీకృష్ణప్రభువులవారు శ్లోకములు రచించగ వారి తర్వాత పెద్దలు యెంతోమంది కందార్ధములు, మిశ్రకందార్ధములు, గీతార్ధదర్వులు, పాటచరణములతో వ్రాసినారు. కాని అన్ని చదువలేము అందరూ రచించినవి అమృతదారలుగానె యున్నవి. కాని నాగుల వెంకటేశం అనబడు నేను యేమి చదువుకున్నవాడిని కాదు. పెద్దలదయా, ఆశిర్వాదముల చేత పై పూజావిదానములు చదివి వాటి మర్మములు కొంతవరకు తెలుసుకొని అక్కడక్కడ పూజసమయములలో బావార్ధము చెప్పేవాడిని దాని విన్నటువంటి పెద్దలు కొందరు భక్తులు మీరు చెప్పినవిదంగా గ్రంధము తయారుచేసితే బాగుండునుయని చాలమంది పెద్దలన్నారు కాని నాకు వీలుపడక తీరికలేక చేయలేకపోయినాను.

ది: 1-1-2010 జనవరి 1వ తేది చటాకాయలంకలో శ్రీఅచలానంద కపిలమహాముని వార్శికపూజలో పూజ్యులు శ్రీవివేకానంద బండారు సుబ్బరాయుస్వాములవారి సమక్షములో శ్రీకరుణానంద తుమ్మల ఉమామహేశ్వరరావుగారు నన్ను పూజావిదానము బావార్ధము చెప్పాలి అంటే కొంతవరకు చెప్పడమయినది. వారు ఆనందముతో యీవిదంగ పుస్తకం చేసితె బాగుండునుయని సూచించగ నేను యీపనికి పూనుకున్నాను కాని పూజావిదానము బావార్ధము అంటే సుమారు నాల్గు అయిదువందల పేజీల పుస్తకమవుతాది యెవరు అంతా డబ్బుపెట్టి ప్రింటు చేయగలరని కొద్దిలో ముగింపు చేయుడం జరిగింది అన్యదాబావించవద్దు. ఇందులో ముఖ్య మైనటువంటిది అందరికి అందుబాటులోయున్న శ్రీసదానంద మంత సాయనార్యుల వారు రచించిన పాట చరణములు 2-3 మాత్రమే తీసుకోవడం అయినది కారణము అది పరాపూజ నిర్గుణ నిరాకార స్వరూపపూజ. అది సాధారణ భక్తులకు నాస్తికమయ్యి చెడిపోవుచున్నారు. అందులకు అది తీసుకోలేదు. యిక ప్రదానంగ తీసుకున్నది మంచి నేర్పుగలది. శ్రీనిత్యానంద

వ్రాసినారు. 'శ్రీరామావశిష్ఠ సుభోధిని' అనే గ్రంథము నుండి తీసుకున్న ఉపమానము చాల చక్కగా వుంది. వీరి జీవితమును గురుసేవకే అంకితము చేసినారు కాబట్టి వీరికి సద్గురువు నిరంతరము అండగా వుండాలని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
శ్రీ అద్వయానంద పాద సేవకుడు
శ్రీ గుణరూప రహితానంద బండారి హనుమంతార్యులు
బళ్ళారి, కర్ణాటక. సే.స. రాష్ట్ర అధ్యక్షులు

ఓం
శ్రీసద్గురుభ్యోనమః

# విన్నపం

పూజ్యనీయులు అచల పరిపూర్ణులు శ్రీ దయానంద నాగుల వెంకటేశార్యుల వారికి నిర్మలానంద కానూరి సూర్యనారాయణ ద్వాదశి గురువందనములు చేస్తూ వ్రాయుమనవి. తమరు చెప్పిన ప్రకారముగా శ్రీకృష్ణ ఉద్ధవార్జున సంవాదంబను గ్రంథము అచ్చు వేయించడము నా సోధరులకు మా శిష్యులకు తెలియజేసితిని కాని యెవ్వరికి ఆర్థిక స్థోమత లేనందున అచ్చు వేయించడము కాదనిరి. అందుకు తమరే ఏదో విధముగా ప్రింటు చేయగలరు. మా గురువుగారి రచనలు పదిమందికి తెలియజేయగలిగినందులకు నాగురు కరుణచే మీకు విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు
శ్రీ నిర్మలానంద కానూరి సూర్యనారాయణ గారు
విజయనగరం.

# వందనము

సద్గురుస్వరూపులైన పాఠకులకు నమస్కారములు

ఎండకు ఎండని వారును అచలగురు సాంప్రదాయములో శ్రీ దయానంద నాగుల వెంకటేశం స్వామి గారి గురించి తెలియనివారు లేరు అనుటలో అతిశయోక్తిలేదు. ఎందుకనగా వీరు శ్రీశివరామ దీక్షిత సాంప్రదాయ సిద్ధాంతమును బాల్యమునుంచియే అనేకమంది సాంప్రదయపెద్దల సాంగత్యముతో పూర్తిగా విచారించి అందలి మర్మధర్మములను తెలుసుకొని అనేక రాష్ట్రములు తిరిగి శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అఖిలభారత ఉపాధ్యక్షులుగా ఉంటూ అచలబోధను ప్రచారణ కావిస్తున్నటువంటి నిజగురుసేవకుడు. తనకు మాత్రమే గురుదేవుడు ప్రసాదించిన కంఠముతో సాంప్రదాయములో మేలుకొలుపులు, గురుపూజావిదానము, తత్వాలు, కందార్థదర్వులు పాడి రికార్డుచేసి సాంప్రదాయకులందరూ నిరంతరము వింటూ గురువాక్యమును మరవకుండా మేల్కొల్పి సాంప్రదాయేతరులను ఆకర్శించిన నిజగురుప్రబోధ వ్యాపకుడు. తనలో ఒక ప్రత్యేకమైన కొనియాడదగిన సద్గుణము తాను ప్రతిసం॥ బేధాబి ప్రాయములకు తావివ్వక పరులు నేను అనెడి భావము లేకుండా సాంప్రదాయక పెద్దలనందరిని అనేక ప్రాంతములనుంచి పిలిపించి తనశక్తికి మించి గురుపూజా కార్యక్రమమును జరుపుతూ అనేక మందిని ప్రోత్సహించి తనమార్గ దర్శకములో ఎన్నో గురుపూజా కార్యక్రమములను నిర్వహిస్తూ అచలగురు సాంప్రదాయకుల మద్య అన్యోన్య సహకారమును ఏకాభిప్రాయమును వివిధ శాఖలమద్య సదభిప్రాయమును పెంపొందింపజేయుచు గురువు అనగా ఎంత ఓర్పు, నేర్పు, సహనము, సేవ, ప్రేమ, దయ అనగ ఆచార, విచార, ప్రచార, ప్రసంగములతో ఎలా ఉండాలో తన ద్వారా ఇతరులు నేర్చుకోవలసినటువంటిది ఎంతో ఉన్నది.

ఈ పుస్తకము చదివిన వారికి శ్రీ దయానంద నాగుల వెంకటేశం గారి విశాల హృదయము గురుభక్తి ఏమిటో తెలియగలదు. శ్రీశివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయంలో శ్రీపూర్ణానంద సరస్వతి పండిత లైను అప్పలాచార్యులు శ్రీ కృష్ణ ఉద్ధవ అర్జున సంవాదంబను జ్ఞానాతీతబోదిని అను చిన్నగ్రంథమును

రచించగా ఆ పుస్తకమును చదివిన మన దయానంద వెంకటేశం నాయస గారు అందులో ఆత్మబోధను పూర్వపక్షము చేచి పరిపూర్ణబోధను సిద్ధాంతము చేయు పద్ధతికి ఆకర్శితులై నేటిసమాజములో ఆత్మబోధయే గొప్పదని తర్వాత తెలుసుకోవలసినది లేదని చాలామంది భగవద్గీతను చదివి అందలి భావమునకు తృప్తిపడియున్నారని అటువంటి వీరు ఈ గ్రంథమును చదివిన అది కేవలం శ్రీకృష్ణపరమాత్మ అర్జునుని మమకారమును పోగొట్టుటకు మాత్రమే చెప్పబడినది కాని సర్వభ్రాంతులను పోగొట్టి జనన మరణములను తొలగించునది కాదని కావున ఆత్మబోధను తెలుసుకొన్నవారు దానికంటే గొప్పదైన పరిపూర్ణబోధను అర్జునుని వలె తప్పక తెలుసుకోవలెననే పరోపకార బుద్ధితో ఈ పుస్తకమును ముద్రించి ముముక్షువులకు అందించుట గొప్ప విశేషము. ముఖ్యముగా మన సాంప్రదాయకులకు కూడా ఈ పుస్తకము ఎంతో అవసరము. భగవద్గీతా సారమును విన్న అర్జునుడు అందలి విషయానుసారముగా జీవితం గడుపుచుండగా ఉద్ధవుడు వచ్చి అర్జునుడు చేయు జపతపములను చేచి వీటి వలన ప్రయోజనములేదని ఈ విద్యతోనే వేదవిద్య పూర్తికాదని అర్జునునికి చెప్పి శ్రీకృష్ణపరమాత్మ ద్వారా పరిపూర్ణవిద్యను తెలుసుకోమని చెప్పగా అర్జునుడు తానుముందు శ్రీకృష్ణపరమాత్మ ద్వారా తెలుసుకొన్న ఆత్మబోధను శృతి స్మృతులద్వారా ఆత్మసత్యమైనదని, సర్వవ్యాపకమని, ఎండకు ఎండదని, వానకు తడవదని, గాలికి ఇంకిపోదని, అస్త్రశస్త్రములకు హతము గాదని కాన ఆత్మయే గొప్పదని చెప్పగా ఉద్ధవుడు అర్జునా ఆత్మ శరీరమును విడిచి ఉండుచోటు ఏదని ఆత్మశరీరము లేక పోతే ఏపని చేయలేదని కాన నీవు ఈఆత్మ స్వరూప స్వభావ స్వలక్షణ స్వస్థానములు విచారించి అంతట గల పరిపూర్ణమును తెలుసుకోవాలని చెప్పగా అర్జునుడు సూక్ష్మబుద్ధిగలవాడు కాన వెంటనే తన అన్న ధర్మరాజు అనుమతి తీసుకొని శ్రీకృష్ణపరమాత్మ దగ్గరికి వెళ్ళడం అప్పుడు కృష్ణపరమాత్మ అర్జునుని యోగక్షేమాలను విచారించుచుండ ఉద్ధవుడు రావడం అర్జునుని కోర్కెను ఉద్ధవుడు బలపరుస్తూ సర్వవిధాల అర్హుడైన అర్జునునికి పరిపూర్ణబోధను కృష్ణపరమాత్మ తెల్పుపద్ధతి చాలా సులభశైలిలో యున్నది. ప్రతిఒక్కరు ఈ పుస్తకమును చదివి తమతమ గురువాక్యమునకు ఇందలి

భోధను సమన్వయ పరచుకొందురని కోరువారము.

సాంప్రదాయ ప్రబోధను పూర్తిగా తెలుసుకొన్న తర్వాత నిజగురుపూజా విధానమును ఎలా చేయాలో మన సాంప్రదాయములో చాలామంది పెద్దలు శ్లోకాలుగా, పద్యాలుగా, కందార్థదరువులుగా, మిత్రకందార్థములుగా ఇలా ఎన్నో విధాలుగా తమతమ గురుభక్తిని తెల్పినారు. అందరూ సాంప్రదాయబోధలోని మర్మధర్మాలను తెలుసుకొన్నవారు కాబట్టి అందరూ ఒకే భావన స్ఫురించే విధముగా రచించినారు. వీటన్నిటిని బాగా పరిశీలించి ఆయా ప్రాంతములకెళ్ళి ఆయాశాఖల పూజావిధానములను చేసేమన శ్రీ దయానంద నాగుల వెంకటేశం స్వామిగారు అన్నిటిని క్రోడీకరించి అందలి భావములను సమన్వయపరుస్తూ అందరూ నిజగురుపూజావిధానము ఎలా భావములో చేయాలో తెల్పినపద్ధతి చాలా చక్కగాయున్నది. నేడు ప్రపంచములో ప్రతి ఒక్కరు ఏదో ఒకదేవుని పూజచేయుచున్నారు. కానీ వీరందరు చేయు పూజకు మన నిజగురుపూజకు ఎలా వ్యత్యాసమున్నదో నిజమైన పూజ అనగా తాను లేకపోవడమేనని తెల్పువిధానము చక్కగా యున్నది. మనం చాలా చోట్ల మన శ్రీదయానంద నాగుల వెంకటేశం స్వామిగారు పూజచేస్తూ భావము చెప్పుచూ మనపూజా విధానమునందలి భావమును పామరులు కూడా తెల్సుకొని పూజావిధానము ఎలా చేయాలో తెల్పుటను వింటున్నాము. అంతటా గల గురుదేవుని ఎలా ఆహ్వానించి ఎలా ధ్యానముచేసి తన హృదయమును సింహాసనముగా సర్వం అనిత్యమని పాదములను కడిగి తన అహం రహితం చేయునది హస్తమని కర్మలను చంచలబుద్ధిని పోగొట్టునది ఆచమనీయమని, ఆత్మశుద్ధియే పంచామృతమని, సర్వభేదములను పోగొట్టునదే శుద్ధోదకస్నానమని, శుద్ధ జ్ఞానమే వస్త్రమని, సకల సద్గుణములే యజ్ఞోపవీతమని షడూర్ములను పోగొట్టుకోవడమే శ్రీగంధమని, సత్యమైన పరిపూర్ణమును ఎరుగుటయే అథ అంగ, అథపత్రపూజలని, గురువు సాక్షాత్ పరబ్రహ్మమని గురునకు శతనామావళి చెప్పడం వాసనత్రయ, ఈషనత్రయ మొ॥నవి వదలిపెట్టడం దూపమని దేహమనే ప్రాణదర్మములు వదలి ఆత్మధర్మమును తెల్సుకోవడం నైవేధ్యం అని సర్వబేధాలు పోగొట్టుకోవడమే పానీయం అని, సద్గురుబోదనెరిగి సద్గురువును

పూజించుటే ఫలం అని 'నన్ను' విడచుటే తాంబూలం అని, సర్వమును తనతో కలిపి ఇవ్వడమే దక్షిణ అని గురుసేవతో తరించడమే కర్పూరం అని, భ్రాంతిని తొలగించి సర్వత్రా ఉన్న పరిపూర్ణమును చూపించిన గురుదేవునికి దివ్యసువర్ణ మంత్ర పుష్పం అని సర్వకాలములయందు మీ వాక్యమునే స్మరించుట ప్రదక్షిణ అని జననమరణ ప్రవాహమునణచిన గురునకు చేయు పూజయేు సర్వోపచారపూజాన్ సమర్పణ అని సూక్ష్మంగా తెలిపినారు. అందరూ ఆత్మబోధను, పరిపూర్ణబోధను ఎరిగి పరిపూర్ణముతో ఎరుకయే కాలమందున లేదని కేవలం తోచినవస్తువని ఎరిగి ఎలా నిజగురువాక్యానుసారము జీవించాలో మనము ఈపుస్తకముద్వారా తెలుసుకొనే వీలు కల్పించిన మన శ్రీదయానంద నాగుల వెంకటేశం స్వామిగారి దివ్య మూర్తిత్వమునకు సాష్టాంగ దండములు తెల్పుతూ, భవిష్యత్తులో ఇటువంటి గురుసేవా కార్యక్రమములు అనేకము చేయడానికి ఆ సద్గురుదేవుని కరుణాకటాక్ష వీక్షణములు కలగాలని కోరుతూ....

గురుపద సేవకుడు

**శ్రీ పరిపూర్ణానంద గౌడుచెర్వు బ్రహ్మానందరెడ్డి**

దిగువతూపల్లి, పి.కొత్తపల్లి (పోస్ట్), యన్.పి.కుంట (మం॥),

అనంతపురం జిల్లా - 515521

సెల్: 9912211366.

# అభినందన సంతోషమాలిక

అచల సిద్ధాంత తత్వపరిశోధన పరిపూర్ణులైన అశరీర సద్గురు సార్వభౌములందరికిని మరియు పాఠక మహాశయులకు నావందనములు. శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య కేంద్ర ఉపాధ్యక్షులు శ్రీశ్రీశ్రీ దయానంద నాగుల వెంకటేశం సద్గురుమూర్తి ఎందరో మహాత్ములు ఈ అచల సాంప్రదాయంలో లోకకళ్యాణార్థమై ఎన్నో గ్రంథాలు వ్రాసి జననమరణమనె భవసాగరాన్ని దాటింపజేసిన వారిలో వీరు ఒక మణిరత్నమై జన్మించినారు. వీరి సేవలు అందుకుంటున్న అచల భక్తులు అందరు కూడ ధన్యాత్ములని ఆశిస్తున్నాను. శ్రీదయానంద నాగుల వెంకటేశం నాయన గారు నాకు సుమారు 1994 సం॥ లో పరిచయమేర్పడడం అదృష్టంగ బావిస్తున్నాను. అదిమొదలు నేటివరకు ఆయనతో పలు ప్రాంతాలు పలు రాష్ట్రములు ఎంతో మంది గురువులు భక్తులు ఆశ్రమాలు పరిచయమయినవి. వారికృప వారిదయ వారిప్రేమను చూరగొన్న సాంప్రదాయులు వారిని కొనియాడుతు ఉంటే మాకు యెంతో ఆనందమయినది.

ఎందుకనగా వారు జన్మించినది మామూలు కుటుంబములోనైన ఇంత ప్రయోజకులుగా అభివృద్ధి జెందడం వారి పూర్వజన్మ సుకృతంగా బావించవచ్చు. వారు ఈ బోధలో ఎన్నోవిధాలుగా అభివృద్ధి పొందిన సత్‌పురుషులు. తనజన్మతో వచ్చినది సంగీతకల ఈ సంగీత కలకు విషజంతువైన నాగసర్పము తన ప్రాణమును లెక్కచేయక పడగ ఎత్తి అడుతుంది. అడవి జంతువులు సహితం నిలబడి ఆలించి వింటావి. భూమి మీద పుట్టిన ఎన్నోరకములైన చెట్లు సంగీతమునకు ఊగిపోతావి. కఠిన శిలలు మెత్తబడి పోతావి. ఇలాంటి సంగీతంలో వారు ఆరితేరి ఎన్నో గురుపూజా కార్యక్రమాలు విజయవంతం చేయడమే కాకుండా ప్రాపంచికులు కూడా మైమరచే విధంగా తత్వవిచారణ చేసే ఆనంద సాగరంలో మునిగి పోతారు. ఈరోజు ఈ అచల బోధ వ్యాప్తి కావడం మన పాలిటి కల్పతరువు శ్రీశ్రీశ్రీ భాగవత కృష్ణదేశికులు బోధను కందార్థ రూపంలో చేయడం ఒక వరం అని అందరికి తెలిసిన విషయమే. శ్రీదయానంధ నాగుల వెంకటేశం నాయన గారు సంగీతమే కాకుండా గురుపూజా కార్యక్రమాలు రూపొందించడములో దిట్టరి. మరియు కార్యక్రమము తమ ఆధ్వర్యములో యున్నదంటే మేలుకొలుపుల నుండి మహామంగళారతుల వరకు ఒక నిమిషం పొరపాటు లేకుండా పేపరులో యున్న రీతిగా నడిపించే మహానీయుడు. ఇంకా సిద్ధాంత పరులలో ఎన్నో సమస్యలు వచ్చి విడిపోయిన వారి సమస్యలు పరిష్కరించి కార్యక్రమాలు చేయించే సత్తా కలిగిన

వారు. ఇవే కాకుండా పలు ప్రాంతాలలో ఎన్నో ఆశ్రమాలు కట్టించిన పేరు వారికే దక్కింది. ఆంధ్రప్రదేశ్‌లో కాకుండా అనేక రాష్ట్రాలలో ఆశ్రమ ప్రారంభోత్సవములు చేసిన గౌరవం వారికే దక్కింది. మరియు ఇంకో విషయం ఏమనగా భారత భాగవత రామాయణంలో ముల్లోకాలు తిరుగుతూ ధర్మాన్ని కాపాడి అధర్మాన్ని వంచించిన వారు నారదమహర్షి అదిమనకు తెలుసు. ఆ పాత్రను అనుసరించి ఈ రోజు ఈ అచలబోధలో వారులేని కార్యక్రమములు ఉండవు. లేకుంటే ఇంత రసవత్తరంగా ఉండదు. శ్రీదయానంద నాగుల వెంకటేశం స్వామి వారి అనుభవములో ఇది వరకు ఎన్నో గ్రంథాలు భక్తులకు ప్రింటు చేయించి అందించారు. ఇప్పుడు ఈ పుస్తకము ఎందరో మహాత్ములు రాసిన పూజావిధానాలను ఒక్కదగ్గర చేర్చి వారి వారి అనుభవాలను అందరికి అందించే కొరకు చక్కటి బావార్థము వ్రాసి అందులో కందము, గీతము, దర్వులతో కూడిన పూజావిధానములో తెలుసుకొనుటకు మనకు గొప్ప మేలు చేసినారు. వారికి నా ధన్యవాదాలు.

అహర్నిషములు గురుసేవలో యుండి వారి ఆశ్రమాన్ని వార్శికపూజలు ఎంతో వైభవంగా నడుపుచు అందరిని ఆకర్శింపజేయుచున్నా వారికి నా అభినందనలు. మరియు వారి ఆశ్రమము మూడు పువ్వులు ఆరు కాయలుగా దినదినాభివృద్ధిగా సాగాలని మరియు వారి ధర్మపత్ని లక్ష్మమ్మ గారు మహాపుణ్యాత్మురాలు నిరంతరము గురువాక్యమునే నమ్మి గురుసేవలనే ఉన్నటువంటి మాత కాబట్టి ఆ తల్లి యెల్లప్పుడు ఆయురారోగ్యాలతో యుండి పెద్దలశేవ చేయాలని మరియు వారి కుమారులు శంకరగురు ప్రసాద్, శివకుమార్ కోడలు ఆరాధన దేవి, శిష్య ప్రశిష్యులు బోధలో ఎంతో ఎదిగి వారంత వారు కావాలని సద్గురు దేవుని ప్రార్థిస్తున్నాను.

సాంప్రదాయ గురుభక్త బంధువులు ఈ గ్రంథమును చదివి ఆచరించుతు ఆచరింపజేయగలరని మనవి. మరియు శ్రీ క్రిష్ణోద్ధవార్జున సంవాదంబను గ్రంథము అచలసిద్ధాంతమునకు ఎంతో అవసరమైనది కావున అద్వైతములో ఉన్నత తీర్పు, అచలబోధలో ఉన్న తీర్పు తెలుసుకోవడానికి చాల సులభమైన గ్రంథము చదివి గ్రహించగలరు. నమస్కారములు......

ఇట్లు

శ్రేయోభిలాషి

**శ్రీ నిష్కలానంద బండి చక్రపాణి**

గ్రా॥ రంగయ్యపల్లి, మం॥ రేగొండ, జిల్లా॥ వరంగల్.

కొండోజు సీతయార్యులవారిది శ్రీభూమానంద జోస్యుల జనయ్య గారిది, శ్రీదుర్గానంద సరస్వతి పంచదశి స్వాములవారిది శ్రీసదానంద వెంగళ కుమారాఖ్యులవారిది శ్రీపోలోజు వీరాచార్యులవారిది శ్రీవాడపల్లి ఆగదాసులవారిది తీసుకొని తక్కువ బావార్థముతో తయారు చేయడమయినది విశేషార్థమయితే చాలపెద్ద గ్రంధమవుతాది అని మాములుగా వ్రాయడ మయినది. విజ్ఞులు గ్రహించెదరు.

అయ్యలార ఈగ్రంధములోనే ఒకబాగముగా శ్రీపండిత పూర్ణానంద లైను అప్పలచార్యులవారు రచించిన శ్రీక్రిష్ణోద్ధవార్జున సంవాదంబను జ్ఞానాతీతబోదిని గ్రంధమును ప్రింటుచేయడము జరిగినది ఇది చాల గొప్పనైన గ్రంధము భగవద్గీతను మంచి విమర్శనాత్మకంగ రచించినారు చదివి గ్రహించగలరు. మరి ఒక విషయము మన పెద్దలు రచించిన కొన్ని వైరాగ్య తత్వకీర్తనలు యింతవరకు ప్రింటులేనివి యీ గ్రంధములో వేసినాను మరియు నాకు పరమేష్టి గురుసమానులు శ్రీనిర్గుణానంద కొండోజు బ్రహ్మానందము నాయనగారి మీద ప్రేమచేత రచించిన పాటలు అచ్చువేయడమైనది. యింకా నాగురుమూర్తి పరిపూర్ణబోధ సూచన జేసినంక బోధ దృఢపడి రచించిన పాటలు కొన్ని యిందులో చేర్చినాము. చదివి సంతసించి తప్పులుంటే ఒప్పులుగ జేసుకొని సమరసబావముతో మామదికందిస్తారని ప్రార్థిస్తుయున్నాను.

యీగ్రంధమునకు ఆర్థికసహాయము అందించిన దాతలకు చూడగానే అభిప్రాయములు, ప్రశంషములు వ్రాసిన పెద్దలకు నావందనములు తెలియజేయుచున్నాను. అందరిని సద్గురుమూర్తి రక్షించుగాక...

ఇట్లు
శ్రీగురుపధసేవకుడు
**శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**
శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవసమాఖ్య
**అఖిలభారత ఉపాధ్యక్షులు**
శ్రీసాందీప ఆశ్రమం, గొల్లగూడెం.

# గ్రంథ పరిచయము

శ్రీమద్రామడుగు శ్రీశివరామదీక్షిత అచలగురు పరంపర గురువులకు గురుభక్తులకు విన్నపములు చేస్తూ వ్రాయునది శ్రీ పూర్ణానంద సరస్వతి పండితలైను అప్పలాచార్యులు శ్రీ కృష్ణ ఉద్ధవ అర్జున సంవాదంబను జ్ఞానాతీతబోధిని అను ఈ చిన్నగ్రంథమును రచించినారు. ఈ గ్రంథమునందు ఆత్మబోధకు అచల పరిపూర్ణబోధకు ఉండేటి వ్యత్యాసమును చక్కగా ప్రబోధించినారు. యుద్ధరంగమునందు అర్జునునకు బోధించునటువంటి భగవద్గీత ధర్మములను క్రిష్ణపరమాత్మ పూర్తి పొందినటువంటి పరిపూర్ణ బోధకు ప్రాథమిక దశలో అర్జునుని లాంటి అధికారునకు బోధించదగిన వేదోపనిషత్తుల సారమగు ఆత్మబోధకు అతీతపరిపూర్ణ బోధకు ఉన్నటువంటి తారాతమ్యమును చక్కగా ప్రబోధించినారు. ఉద్ధవులు అస్తినాపురమునకు రావడము ఈయన వచ్చినప్పుడే అర్జునుడు భగవద్గీతాధర్మములను అనుష్ఠిస్తూ ఉండడము ఈ దృశ్యమును చూచినటువంటి ఉద్ధవులు పరిహాసంగా నవ్వడం అది చూచి అర్జునునకు అంతర్యములో సందేహము కలిగి ఎందుకు ఉద్ధవానన్ను పరిహాసముగా నవ్వితివి నేను ఏమైనా శ్రీక్రిష్ణపరమాత్మ ప్రభోధించినటువంటి భగవద్గీతా ధర్మములకు ఏమైనా వ్యతిరేకముగా నడుస్తున్నానా? వేదోక్త విదానముగా ఆచరించునటువంటి నన్నుచూచి పరిహాసముగా ఎందుకు నవ్వితివి అని అర్జునుడు ప్రశ్నించగా ఉద్ధవులు శ్రీకృష్ణపరమాత్మకు అంతరంగభక్తుడు చతుర్విధ శిశ్రూషలు చేసి నాలుగు దర్మాలు చక్కగా తెలుసుకున్నటువంటివారు అనగా సాంఖ్య, తారక, అమనస్క, పరిపూర్ణబోధను తెల్పు నిమిత్తమై ఉద్ధవులు సంకల్పించి అర్జునా నీవు ఆచరించునటువంటి ఈ వేదోపనిషత్తు ధర్మములన్ని నిజమైన పరిపూర్ణ దైవమును తెలిసి ఆచరించునటువంటివి కావు. శ్రీ కృష్ణదేవునికి శిష్యునివై ఉన్నటువంటి నీకు పరిపూర్ణ బోధధర్మము తెలియకపోవడము మంచిది కాదు. నీవు ఏది సత్యమని ఆచరిస్తున్నావో శృతిస్మృతులచేత అదే నిజమని వాదిస్తున్నావో అవి అన్నికూడా పరిపూర్ణబోధ తెలిసిన వారి దగ్గర పూర్వపక్షములే కాని నిజమైన సిద్ధాంతము కాదు. ఈ మాట ఉద్ధవులు అనగానే అర్జునుడు భగవద్గీతలో ఉన్నటువంటి అనేక శృతులను ప్రమాణముగా చేసి

ఉద్దవులతో వాదము చేసెను. కాని ఉద్దవులు ఆత్మబోధను అచలపరిపూర్ణ బోధను బాగా తెలిసినవారు కనుక అర్జునుడు చెప్పినటువంటి యోగ, భక్తి జ్ఞాన మార్గములను పురుషోత్తమ ప్రాప్తిని పూర్వపక్షము చేసి అర్జునా శ్రీ కృష్ణదేవునకు ముఖ్య శిష్యుడవు, భక్తునివి, బంధువు ఇన్ని ఉండి కృష్ణుని యొక్క ఆంతర్యమును పూర్తిగా తెలుసుకోవడం నీ ధర్మం. క్రిష్ణపరమాత్మ సాక్షాత్ మహావిష్ణువు అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు సమస్త ధర్మాలు తెలిసినటువంటి గురుదేవుడు. అటువంటి మహానుభావుని బావయని బందువని, బౌతిక దృష్టితో చూడకుండా గురువు సాక్షాత్ పరబ్రహ్మముగా భావించి పరిపూర్ణ బోధను తెలుసుకొని ఈ ఎరుకభ్రాంతులు సర్వము పరిత్యజించి పరిపూర్ణుడవై ఉండవలసిన ధర్మము నీకున్నది. కనుకనే వెంటనే ద్వారకానగరము వెళ్ళి శ్రీకృష్ణగురుదేవులను సేవించి కృతార్థుడవు కమ్మని ఉద్దవులు చెప్పి ద్వారకానగరమునకు ప్రయాణమై పోయెను. ఉద్దవుడు వెళ్ళగానే అర్జునుడు తీవ్ర మోక్షాపేక్షాపరుడై అన్నధర్మరాజు దగ్గరికి వెళ్ళి తనకు కలిగినటువంటి సందేహాలు అన్ని తెలిపి నేను ద్వారకానగరం వెళ్ళి శ్రీకృష్ణ పరమాత్మ దగ్గర ఈ పరమ రహస్యం తెలుసుకొని వచ్చేదానికి అనుమతిని కోరుచూ అనుమతి తీసుకొని ద్వారకానగరము బయలుదేరి వెళ్ళి ద్వారకకు ప్రవేశించి తనరాకను ద్వారపాలకులకు తెలియజేసి శ్రీకృష్ణమందిరమునకు ప్రవేశిస్తాడు. ప్రవేశించి శ్రీ కృష్ణపరమాత్మకు సాష్టాంగ దండ ప్రణామములు చేచి వినయవిధేయతలతో గురుస్తోత్రము చేయగా అర్జునుని ఈ యొక్క నమస్కార క్రియలను చూచి క్రిష్ణపరమాత్మ కౌగిలించుకుని ఉచితాసనముమీద ఆశీనుడవు కమ్మని పలికెను. అంతలో ఉద్దవులు వారు అర్జునుడు కృష్ణ పరమాత్మ సన్నిదికి వచ్చి ఉంటాడని భావించి అంతలోనే ఉద్దవుడు మందిరానికి ప్రవేశిస్తాడు. ఇక్కడినుండి ముగ్గురు కూర్చొని ఆధ్యాత్మిక విచారణను ప్రారంభిస్తారు.

అప్పుడు అర్జునుడు క్రిష్ణపరమాత్మ చెప్పినటువంటి గీతాధర్మాలను విన్నవించి ఇదికాక పరిపూర్ణబోధ ఒకటి ఉన్నదని ఆ పరిపూర్ణబోధ తెలియకపోతే జనన మరణములు తొలగవని అట్టి పూర్ణబోధ తెలియకపోతే జన్మము వ్యర్థమని

ఆ పరిపూర్ణబోధ మీరే చక్కగా ప్రబోధించగలరని ఉద్దవులు చెప్పగా మీ సన్నిదికి వచ్చిన నన్ను అనాధరణ చేయకుండా ఈ బోధ గ్రహిస్తాడో లేదోననే సందేహము పడకుండా పరమ దయతో ఈ పూర్ణబోధను అనుగ్రహించండి. అని మళ్ళీ పాదములపైబడి సాష్టాంగ నమస్కారములు చేసెను. లేచి ముకులిత అంజలితో దీనవదనముతో ప్రార్థించగా అప్పుడు శ్రీకృష్ణపరమాత్మ ఉద్దవులను చూచి ఉద్దవా అర్జునుడు పూర్ణబోధకు అధికారి అయినప్లేనా, ఈబోధకు తగినపాత్రుడు. కాని వారికి చెప్పితే చవిటినేల వేసిన విత్తనమువలె నిష్ప్రయోజనము అగును. నీ ప్రేరణచే పుట్టినబుద్ధి అర్జునునకు స్థిరముగా నిలచునా అని అడుగగానే ఉద్దవులు దేవదేవా నీకు తెలియని మర్మములు ఉన్నవా నీ అనుగ్రహము అయితే మూగవాడు మాటలాడగలడు, కుంటివాడు కొండలెక్కగలడు, మీదయాదృష్టి పడినవారికి వివిధమైన లోపములు ఉండవు. అర్జునుని తీవ్రతను చూచి ఈయన పూర్ణబోధకు తగిన అధికారి అని నీకు పూర్తి విశ్వాసము ఉన్నది అని ఉద్దవులు చెప్పగానే శ్రీకృష్ణపరమాత్మ వేదోపనిషత్తుల భావములను భగవద్గీతరూపముగా ప్రబోధించినటువంటి క్రిష్ణపరమాత్మ దాన్ని పూర్వపక్షము చేస్తూ ఆత్మాతీతమగు పరిపూర్ణబోధను అనంతోపనిషత్తు ప్రతిపాదితమైన పరిపూర్ణ పరబయలును సూచనచేసి పరిపూర్ణ స్థిరత్వాన్ని దృడముచేసి సర్వసార పూర్ణోపనిషత్తు భావములను నిరూపిస్తూ ఎరుకను నిరసిస్తూ శ్రీకృష్ణ పరమాత్మ నోటినుండి వెలుబడేటువంటి ఈ నిజప్రబోధ వింటూ అర్జునుడు పులకాంకిత శరీరుడై యెన్నడూ నేను ఇటువంటి బోధను వినలేదు అని అర్జునుడు ఆశ్చర్యపరుడై పూర్ణబోధ తెలుసుకొనుట గ్రంథము యొక్క విశేషము. కాని శ్రీకృష్ణపరమాత్మకు ఆత్మబోధను తెలుసుకొన్నటువంటి అర్జునుడు పూర్ణబోదను తెలుసుకొన్నటువంటి ఉద్దవుడు వీరియొక్క కలయికవల్ల ఆత్మబోధ నుంచి పూర్ణబోధకు మార్పు చెందినటువంటి అర్జునుని లక్షణములు ఆ ఇద్దరని సమన్వయపరచి ఈ కృష్ణపరమాత్మ ఈ ప్రబోధను చేయడము ఈ పద్ధతి ఈ నవీన కాలములో అభిమాన రహితముగా పూర్ణబోధను తెలుసుకోవాలనే వారికి ఈ గ్రంథము ఎంతో ఉపకరిస్తాది ఇటువంటి గ్రంథమును ఈ గ్రంథ ఆవశ్యకతను రంగారెడ్డి జిల్లా గొల్లగూడెం వాస్తవ్యులు. శ్రీకృష్ణసాందీప ఆశ్రమ

వ్యవస్థాపకులు శ్రీ దయానంద నాగుల వెంకటేశం గారు గుర్తించి ఈ గ్రంథమును ఇక మనసాంప్రదాయముల్లో శ్రీమద్భాగవత కృష్ణప్రభువులు రచించినటువంటి సంస్కృతపూజా విధానమునకు శ్రీజ్యోష్యుల జనని జగన్నాథం గారు వ్రాసిన గీతార్థములు, వాడపల్లి ఆగదాసు స్వాములు వ్రాసినటువంటి గీతార్థములు, శ్రీ పోలోజు వీరాచారి వ్రాసినటువంటి గీతార్థాలు, శ్రీపంచదశి దుర్గానందస్వాములు వ్రాసినటువంటి మిత్రకందార్థాలు, శ్రీకొండోజు సీతయార్యులు రచించినటువంటి కందార్థాలు, శ్రీ సదానంద వెంగళ కుమారాఖ్యులవారు రచించిన గీతార్థాలు వీరందరూ ఒకదేశము రాష్ట్రము జిల్లావారు కాకపోయినా వీరికి కలయికలు లేకపోయినా వీరు రచించిన పూజావిధానము కొంచెం ఇంచుమించు భావము ఒకే విధానముగాయున్నది. మా గురువు రచించినటు వంటిదే గొప్పదని మిగతా గురువులు రచించినటువంటివి బాగలేవనే భక్తుల అపోహలన్ని తొలగి గురుసేవ చేసినటువంటి మహాత్ములు వ్రాసినటువంటివి అన్ని ఒకే తీరుగా ఉంటాయని అందరూ గ్రహించి కృతార్థులగునకు గాను వీరందరి అభిప్రాయములతో అందరి పూజావిదానములతో ఈ గ్రంథము రచింపబడినది. కనుక ఇది ఎంతో విజ్ఞతతో మధ్యమధ్యలో ఈ భావములను సమన్వయంచేస్తూ శ్రీ దయానంద నాగుల వెంకటేశం గారు ఏకాగ్రచిత్తులై చక్కని రచన గావించినారు. ఈ పూజా విధానమును, శ్రీకృష్ణఉద్ధవార్జున సంవాదము గ్రంథమును కలిపి సంయుక్తముగా ఈ గ్రంథము అచ్చువేయించి పాఠకులకు అందించినటువంటి శ్రీ దయానంద నాగుల వెంకటేశంగారు ఎంతో అభినందనీయులు, ఇటువంటి లోకోపకార గ్రంథములను మరి ఎన్నోరచించి గురుకృపకు పాత్రులు కావాలని అటువంటి శక్తి సామర్థ్యములను సద్గురుదేవుడు కలుగజేయాలని గురుదేవులను కోరుకుంటూ సెలవు.

ఇట్లు

**శ్రీ వివేకానంద బండారు సుబ్బరాయ స్వాములు**

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య జాతీయ అధ్యక్షులు

ధర్మవరము.

శ్రీగురుభ్యోనమః                                    శ్రీసద్గురువేనమః

# కృతజ్ఞతలు

శ్రీమత్ బృహద్వాశిష్ట సిద్ధాంత శ్రీమద్రామదుగు శివరామ దీక్షిత గురుపీఠ పారంపర్యులైన సద్గురుపుంగవుల దివ్యచరణములకు నమస్కరిస్తు తెలియజేయు కృతజ్ఞాతాభివందనములు. ఈగ్రంథమునకు సేకరణకర్తయైన శ్రీమదచల రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అఖిల భారత ఉపాధ్యక్షులు శ్రీ దయానంద నాగుల వెంకటేశం స్వామి సాందీప ఆశ్రమము, గొల్లగూడెం గ్రామము, రంగారెడ్డి జిల్లా వాస్తవ్యులు మాకు సాంప్రదాయ మార్గదర్శక ప్రబోధకులుగా పరిచయమై, అనుభవజ్ఞులైన సాంప్రదాయ గురువులను పరిచయము చేయించడమే కాకుండ యెందరితోనో దర్మమర్మములు తెలియజేయించిరి. నిరంతరము గురుదీక్షతత్పరులై గురుభక్తిని అనుసరించి తనకున్న సమయములో యెక్కువ కాలం గురుపూజా కార్యక్రమములకే వినియోగించువారు. పారమార్థిక దర్మములు వాక్కు రూపముగా వచించడమే కాకుండ త్రికరణ శుద్ధిగా తాను ఆచరిస్తూ, యితరులకు ఆచరింపజేయుటకు తగు విదమైన కృషి వళులై ఆచార్య బిరుదు వహించారు. గురుపూజ విధానము చదవడము, విదివిధానముగ వాటి బావార్థములను తెలియజేయడములో వారికి వారే సాటి. మదురమైన గానము సశాస్త్రీయమైన బావములు, సమయస్ఫూర్తి, ప్రవర్తన గల మహాత్ములు. అన్నింటికన్నా గొప్ప విలువైనది కాలము. కావున కాలము యొక్క విలువని కనుగొని కాలమును వృదాచేయకుండ సత్ కార్యక్రమములో తనవంతు దర్మమును నిర్వర్తించు కోవలయునని బోధిస్తూ తనయొక్క పర్యాటన మన ఆంధ్ర రాష్ట్రమే కాకుండా యెన్నో రాష్ట్ర ప్రాంతములు పర్యటించి, ఆధ్యాత్మిక వేదాంత సభలలో అధ్యక్షులుగా ఉండి ఆ ప్రాంతీయులకు మనో భావములకు తగినట్లు ప్రాపంచిక, పారమార్థికదర్మములు అందజేస్తూ వందలమంది గురుభక్తుల యొక్క కోరికమేరకు నాయన మీయొక్క అనుభవనీయమైన బావములు గ్రంధరూపముగ అందిస్తే యెంతో బాగుండును అని కోరుకునగా దయార్ధహృదయులై "గురుపూజ బావార్థములు మరియు శ్రీకృష్ణోద్ధవార్జున సంవాదము అను జ్ఞానాతీతబోదిని" గ్రంథము ముద్రణ చేయించుటకు పూనుకొనిరి. గురువనే పదమును యెన్నో రీతుల బావించుకొని

## జెండాపాట-1

నిమిషకవి తోట వెంకటస్వామి -రచన

1. జండాను పైకెత్తుమన్నా - అచలఝుండా క్రిందానిలచి దండమిడుమన్నా ॥జెండా॥
2. అన్ని వేల్పులకన్న మిన్నా - దీని కన్నవేరొండు లేదన్న మాయన్నా ॥జండా॥
3. వేదాంతసారమోయన్నా - మాయ వాదరహితంబైన బోధగనుమన్నా ॥జండా॥
4. మోక్షమే బట్టబయలన్నా - అందు సాక్షితత్వములేని సొంజ్ఞనే సున్నా ॥జండా॥
5. బ్రహ్మవిష్ణు మహేశులన్నా -పరబ్రహ్మ తత్వంబిదే బయలు గనిరన్నా॥జండా॥
6. శివరామ దీక్షితులజండా -ఇది భవనాశ స్థితిలేని పరిపూర్ణ జండా ॥జండా॥

**అచల బంధువులారా!** ఒక ఉత్తమోత్తమైన సాంప్రదాయములో మాయ చిక్కులు పెట్టి పలానవారు వస్తే మేమురాము, మేమొస్తే వారు రావొద్దు అను బేదాలు ఒకే సాంప్రదాయం ఒకే బోదా అయిన మనము యీవిధంగా ఉంటే యెలా అని శ్రీసదానంద యిలపకుర్తి వెంకటరామచంద్రారావు గారు ఈజెండా పాటను రచించినారు..

## జెండాపాట-2

**పల్లవి:** ఎత్తండి సద్గురుని జెండా । మినుముట్ట నెత్తండి సద్గురుని జెండా ॥

**అనుపల్లవి:** దేశదేశాలలో దివ్యదీధితులొప్ప ।
ఆచంద్ర తారార్క మనవిపై విలసిల్ల ॥ఎత్తండి॥

1. సకలదేశాలలో సర్వకాలాలలో । సర్వజాతులవారి సమదృష్టి వీక్షించి
స్త్రీ పురుషులందరిని దీవించి శరణిచ్చి । శాశ్వితంబుగ
వారిజన్మరహితము జేయు ॥ఎత్తండి॥

2. యుగయుగాలుగ జన్మవాగురులలో జిక్కి ।
జన్మకర్మలుదాట సాధనేదోయనుచు
వ్యర్థ సాధనలలో వ్యధలనొందేవారి ।
భ్రాంతి రహితము జేయు పరిపూర్ణబోధంచు ॥ఎత్తండి॥

3. వేద వేదాంతాల విజ్ఞాన లక్ష్యంబు
అచలఋషి పుంగవుల నాదర్శమని యంచు
వాంగ్మనశ్చక్షువుల పరిధిదాటి తెలియ
పరిపూర్ణ గురుకృపపాత్రులకె సాధ్యమని ॥ఎత్తండి॥

4. కామ్యేచ్ఛజేసేటి కర్మ మార్గముకాదు
రోగముల గొనితెచ్చు యోగమార్గము కాదు
సంఘము కుబరువైన సన్యాసమూకాదు
ఘనమైన రాజమార్గము మాదియనిచాటి ॥ఎత్తండి॥

5. ఇహపరసౌఖ్యంబు లెల్లరకు చేకూర్చు
అన్యోన్య సహకార మభివృద్ధి పరచంగ
విశ్వతోముఖశాంతి వెల్లివిరియించంగ
అచల ప్రబోధయే అతి సూటి మార్గమని ॥ఎత్తండి॥

6. ఈ రాజమార్గాన యీ ధ్వజచ్ఛాయలో
కలసిమెలసి మనము కదలిపోవాలోయి
ఘనమైన యీత్రోవ గనిలోకులెల్లరు
భళిషబాశని మ్రొక్కి వచ్చిచేరాలోయి ॥ఎత్తండి॥

7. గురుభక్తి గురుసేవ గురునిష్ట చెడకుండ
త్రికరణశుద్ధికి దెబ్బ తగులకుండ
భుక్తిముక్తి క్రియల పూర్ణయోగముబూని
లోకసేవకు దీక్షగైకోని జైయనుచు ॥ఎత్తండి॥

8. దీక్షిత సిద్ధాంతదేవ మార్గములోన
పొన్నాల వంశాబ్ధి పూర్ణచంద్రుండైన
రాజయోగీంద్రుల పూజించి కృపగాంచి
రామచంద్రునివలె రాజయోగముబూని ॥ఎత్తండి॥

---------0---------

# అనుష్ఠాన గురు ధ్యాన శ్లోకములు

శ్లో॥ గురుర్బ్రహ్మా । గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మా । తస్మైశ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ మన్నాథా శ్రీ జగన్నాథా । మద్గురు శ్రీ జగద్గురో ।
మమాత్మ సర్వభూతాత్మ । తస్మై శ్రీ గురవేనమః ॥

శ్లో॥ అఖండమండలాకారం । వ్యాప్తం యేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం । యత్కించిత్స చరాచరం ।
త్వంపదం దర్శితం యేన । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం । త్రైలోక్యం సచరాచరం
అసిత్వం దర్సితం యేన । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ చైతన్యం శాశ్వితం శాంతం । వ్యోమాతీతం నిరంజనం ।
నాదబిందు కళాతీతం । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయ ।
చక్షురున్మిలీతం యేన । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ గుకారంచ, గుణాతీతో । రూపాతీత రుకారకః ।
గుణరూప విహీనత్వం । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ గురుణాం అర్చయేనిత్యం । గురుపాదాభి వందితం ।
గురుణాం అగ్రజం శ్రేష్టం । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ ధ్యాన మూలం గురోర్మూర్తి । పూజా మూలం గురోర్పదం ।
మంత్రమూలం గురోర్వాక్యం । ముక్తిమూలం గురోర్ కృపః ॥

శ్లో॥ త్వం, పితా త్వంచ మే మాత । త్వం బందు త్వంచ దేవత ।
సంసార ప్రీతి భంగాయ । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ కాయం కాశీ కురుక్షేత్రం । జాహ్నవీచరణోదకం ।
గురుర్విశ్వేశ్వరః సాక్షాత్ । తస్మైశ్రీ గురవేనమః ॥

శ్లో॥ నిరంతరం సర్వ సందేహో । ఏకీకృత్యాసుదర్శనం ।
రహస్యయే దర్శయతి । భజామి గురు మీశ్వరమ్ ॥

## (శ్రీ మదశరీర నిజగురు పరంపరా ధ్యానము)

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మ విద్య సాంప్రదాయ కర్తృభ్యో ।
వంశ ఋషిభ్యో । మహద్భ్యో । నమో గురుభ్యః ॥

శ్లో॥ సర్వోప ప్లవ రహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో ।
బ్రహ్మైవాహ మస్మి । అహం పదార్థరహితః ॥

శ్లో॥ శ్రీ బ్రహ్మ విద్యా గురు విష్ణు సూర్యం శ్రీయాజ్ఞవల్క్యం జనకం శుకంచ ।
సాందీప మీశం కృష్ణంచ అర్జునం ఉద్ధవ గురున్మే గురు పాదుకాంతం ॥

శ్లో॥ అచలావ దూత యోగీంద్రం । బ్రహ్మానంద సుబోదకం ।
అమలానందస్య సద్యోగి । బావానంద గురుం భజే ॥

శ్లో॥ పూర్ణానంద గురోర్శిష్యం । దత్తానందసు నిర్మలం ।
రామావదూతానం యోగి । సుబ్రమణ్య గురుం భజే ॥

శ్లో॥ వేమన మార్నూర్ నంబికం । తిరు వెంకటదేశికం ।
యతీతంచ గురుర్దేవో । తిరుప్పాణి గురుం భజే ॥

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధాకారణ మవ్యయం ।
భావాతీత మహం వందే । సుఖ జ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారు జనమందారం । వందే హంత న్నిరంతరం ।
రామదుగు వంశజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితం ॥

శ్లో॥ యస్య బోధో దయాసర్వం । బ్రహ్మై వేద్య వగమ్యతే ।
శివరామే విధిఖ్యాతం । తద్దైవత ముపాస్మహే ॥

శ్లో॥ కామాధి రిపు హంతారం । కారుణ్యామృత సాగరం ।
కంభాలూరప్పరావాభి ధానం । ధ్యానం వంద్యేమద్గురుం ॥

శ్లో॥ శ్రీమత్పరశురామ నరసింహ్మాయోగినాం పరమశాంత
రసపూర్ణబోగినాం పరతరాత్మసువిచారకామినం పరమాచల దేశికంభజే ॥

శ్లో॥ శ్రీ మత్పరశు రామాన్వయాబ్ధి । చంద్ర మనోరమం ।
నిత్యానందం మహాం వందే । సీతారామ గురుం పరమ్ ॥

శ్లో॥ శ్రీమత్కారుణికం మహాగుణనిధింపూర్ణ ప్రభాభాసురం నిర్ద్వంద్వం
నిరపేక్షకామమమలం నిస్సంగమాద్యం విభుం నిత్యానందమయం
నిరీహమతులం నిర్ముక్తకర్మాధికం శ్రీకృష్ణాఖ్యగురుం భజేహమనిషం
శ్రీచిత్తసంతోషణం ॥

శ్లో॥ నిత్యంసాంద్రకృపారసంవిదిత భావాభావమత్యున్నతం
ద్వంద్వాతీతమమత్పరం పరమకల్యాణాత్మ తత్వంవిదుం
బ్రహ్మానందమయం సుభోధనిలయం స్వానందభావంసదా
శ్రీమద్భాగవతాన్వయాబ్ధివిలసత్ శ్రీకృష్ణచంద్రంభజే ॥

శ్లో॥ శ్రీవత్సగోత్రకళశాంబుదీ పూర్ణచంద్రం శ్రీకృష్ణపాదకమలామృతపాణబృంగం
శ్రీఫీల్ఖానవంశాంబుదీరేవజాతం శ్రీలక్ష్మణార్యం మనసాస్వగురుంభజే ॥

శ్లో॥ వేదవేదాంత పారిణాం భక్తాభీష్టపలప్రదం సర్వాతీత
మనీర్వాచ్యం శంకరేంద్రం నమామ్యహం ॥

శ్లో॥ శ్రీసనాతనగోత్ర కళశాంబుదీ పూర్ణచంద్రం శ్రీలక్ష్మణగురుపాదకమలామృత
పాణబృంగం శ్రీవిశ్వకర్మకులదీపికా శాంతదయాసముద్రం
శ్రీసీతయార్యమనసాస్వగురుం భజామ్యహం ॥

శ్లో॥ పరిపూర్ణ బావసిద్దాంతం సన్మార్గంచప్రవర్తనం
శ్రీకొండోజు సీతయార్యం గురుంభజే ॥

శ్లో॥ శ్రీసీతయార్య పాదసేవ దురందరం గుహ్యాద్గుహ్య
పరమగుహ్యాలభ్యం శ్రీకరుణానంద నాగుల రామలింగార్యం గురుంభజే ॥

శ్లో॥ నిత్యసన్మార్గపూర్ణతు నిర్మలాయ నిరంజనాయ కేవలాత్మ స్వరూపాయ
సద్గురుసచ్చిదానంద సాయనార్యం గురుంభజే ॥

శ్లో॥ శ్రీసాయనార్య పాదసేవఅమృతరసాయనం పీభన్మత్తమనోబృంగం
శ్రీసమరసానంద మోతె కృష్ణయార్యం గురుంభజే ॥

శ్లో॥ ద్వైతాద్వైతరహితంచః పరిపూర్ణబోధబావసిద్ధాంతం
సకలసాదూజన అనుభవగ్రోలితం శ్రీలక్ష్మీసమేత దయానంద నాగుల
వెంకటేశార్యం గురుంభజే ॥

శ్రీబుచ్చయార్యుల వారి పరంపరం

శ్లో॥ భావాభావసిద్ధాంతము నిర్భయానంద దీక్షితం
రామలింగగురోర్శిష్యం బుచ్చయార్యం గురుంభజే ॥

శ్లో॥ బుచ్చయార్య గురోర్శిష్యం మాయకాయ జఠరజనిత సుపుత్రం
నిర్గుణానంద దీక్షితానాం శ్రీనారాయణార్యం గురుంభజే ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం । కృష్ణ సాందీప మధ్యమాం ।
శ్రీ మహావిష్ణు పర్యంతాం । వందే గురు పరం పరాం ॥

## లఘుపూజా

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం । తత్వమశ్యాది లక్ష్యం ॥
యేకం నిత్యం విమలమచలం । సర్వధీసాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణ రహితం । సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ ధ్యానమావాహనం సింహా । సనం పాద్యం తదైవచ ।
అర్ఘ్యం మాచమ నీయంచ । స్నానం పంచామృతైస్సహాః ॥

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞ సూత్రం విభూషణం ।
విలేపనం అక్షతాంచ । పుష్పం స్వర్ణ వినిర్మితం ॥

శ్లో॥ దూపం దీపంచ నైవేద్యం । పానీయం ఫలమేవచ ।
తాంభూలం దక్షిణార్థిక్యం । మంత్రపుష్పం ప్రదక్షణం ॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మాయతుబ్యం నివేదయేత్ ।
కృపయా గృహ్యాతాం స్వామిన్ । న్యూనాధిక్యం నచింతయా ॥

శ్లో॥ లఘుపూజవిదిం భాగవత శ్రీకృష్ణ ద్విజన్మన రజితంస్తోత్రం
వక్రూణమిదం మోక్షకరంపదం ॥

# పంచపూజలు

శ్లో॥ లం పృదివాత్మనే గంధ తన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః । పృధివ్యాత్మకం గంధం సమర్పయామి

శ్లో॥ హం ఆకాశాత్మనే శబ్ద తన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః । ఆకాశాత్మకం పుష్పం సమర్పయామి

శ్లో॥ యం వాయ్వాత్మనే స్పర్శ తన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః । వాయ్వాత్మకం దూపం సమర్పయామి

శ్లో॥ రం తేజాత్మనే రూపతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః । తేజాత్మకం దీపం సమర్పయామి

శ్లో॥ వం అంబాత్మనే రసతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః అంబాత్మకం నైవేద్యం సమర్పయామి

శ్లో॥ సం సర్వాత్మనే సర్వతన్మాత్ర ప్రకృత్యానందాత్మనే
శ్రీ గురుదేవాయ నమః । సర్వాత్మకాన్ సర్వోపచారాన్ సమర్పయామి



శ్రీ గురుభ్యోనమః

శ్రీమదశరీర నిజగురు సాం(ప్రదాయక శివరామ దీక్షిత అచలపీఠ పరంపర గురువులార, గురుపుత్రులార, సోదర-సోధరీమణులారా ఈ ప్రపంచములో యెన్నో దేవతపూజలు, యెన్నో దైవపూజలు, ఎన్నో అర్చనలు యింకా యజ్ఞయాగములు చేసే పూజలు అనంతముగా యున్నవి. కాని ఈ సృష్టిలో అచలగురువులు చేయుపూజ చాలా గొప్పది. అదేమిటనగా పూజ అంటే (0) సున్న అని అర్థము. చూడండి ఎన్నో లక్షలరూపాయల లెక్క చేసిన చివరికి సున్నకుసున్న సరింపూజ 0/0 అని తేలుతాది, తేలిపోవాలి కూడా, అయినప్పుడే లెక్క అయిపోయినట్లు, పూర్తి అయినట్లు. కాబట్టి మనం కూడ పూజ జేసినామంటే మనం పూజ కావాలి. అందుకే పెద్దలు శ్రీమంతసాయనార్య ప్రభు చెపుతాడు - పూజితంబగు గురుపదంబుల పూజవస్తువులెంచి చూడగ పూజలని పూజించగను ఆపూజలోనే పూజబడినే పూజాజేయగబూనితి అన్నారు. పూజలో యే వస్తువులు అర్పించితే మనయిల్లు బాగుపడుతాది, మన ఒళ్ళుబాగుపడుతాది అది తెలిసి అర్పించే విధానము గురుపరమాత్మను వేడుకొనుచు తనకున్న బాదలు చెప్పుకొనుచు స్వామి, గురుదేవ ఓపరాత్పర, పరందామ నాశరీర ఆవరణంలో యెన్నో దుష్టశక్తులు, దుర్మార్గపు నీచులు ఉండి నీసన్నిదికి యెన్నో జన్మలనుండి రానివ్వక అడ్డుతగిలి కంచుకోటను కట్టి బందించివేసినారు. యిప్పటికినీ కరుణాకటాక్షమున తమవద్దకు వచ్చి చేరినాను. మీకు సర్వము అర్పించుతూ పూజ చేయుచున్నాను. తండ్రి నన్ను మన్నించి నేచేయు పూజలు స్వీకరించండి కాని, నాకు మంచి తిథి మంచివారము, మాసము, చెప్పండి అని అడుగగా గురువుగారు ఓయి శిష్యరత్నమా! ఇంకా నీవు తిథులలో, మాసములలో, వారములలో సంశయము పెట్టుకున్నావా చెబుతాను విను. అని మహాసంకల్పార్థాన్ని తెలియజేస్తాడు. అంటే మామూలుగా మనము ఏదైనా ఒక శుభకార్యం చేసేటప్పుడు సంవత్సరము మాసము, అయనము, ఋతువు, తిథి, నక్షత్రము, వారము, పెట్టుకొని నాకు మంచి సంవత్సరము కావాలి, మంచి మాసము కావాలి, మంచి తిథి, వారము కావాలి అనగా శ్రావణమాసమే కావాలి, కార్తీక మాసమే కావాలి, మాఘమాసమే కావాలి, దశమియే బాగుంటుంది, పంచమియే బాగుంటుంది, లక్ష్మీవారం బాగుంటుంది అని ఈ వారములు ఈ

తిథులు మంచి మాసములు దొరుకక సమయము వృథాగా పోగొట్టుకొని కాలము వ్యర్థము చేసుకొని వాయిదలు వేసుకొని పాడైపోవుచున్నారు. కాబట్టి అచలఋషులు శ్రీశివరామదీక్షిత కాలం నుండి నిజమును బయటికి లాగి అందరికి కనువిప్పు చేసి సమయమును అందించినారు అది గొప్ప విషయము. పైన జెప్పిన విధముగా కార్తీకమాసము, శ్రావణమాసము, ధశమి, ఏకాదశి, త్రయోదశి, సప్తమి, పంచమి, లక్ష్మీవారము, భానువారము, గురువారము ఇటువంటివి పెట్టుకొని అనుకున్నవాళ్ళు రాలేక ఎందుకంటే లౌకికమైన కార్యములు ఆయా తిథులందు అనంతముగా యుంటావి. పెండ్లిళ్ళు, పేరంటాల్లు, గృహప్రవేశాలు, శంఖుస్థాపనలు, వ్రతాలు, యజ్ఞాలు యెన్నియో ఉంటాయి. అందువలన అనుకున్న ఆత్మబంధువులు గాని, శరీర బంధువులు గాని గురుభక్తులు గాని రాలేక బాధపడుతుంటాము. అందుకుగాన నాగుల వెంకటేశం అనబడు నాకు పదమూడు సంవత్సరములు ప్రభోధ జేసిన శ్రీభూమానంద లేని జొన్నాడ హరిక్రిష్ణార్యులు అనేవారు నాయన- నీవు యెప్పుడు సద్గురుకార్యము చేయాలన్న నీవ్యవహార పనులు చేయాలన్న పెద్దలు భక్తులు బంధువులు అందరు రావాలంటే అందరికి అవసరములేని మాసము, తిథి, వారము చూసి పెట్టుకుంటే అందరు వస్తారు. కార్యము జయప్రదంగా జరుగుతాది అని మన పెద్దలు భాగవత కృష్ణప్రభువులు వ్రాసిన మహాసంకల్పము వివరించారు చూద్దాం.

## మహా సంకల్పము

ఓశిష్యా పరమభక్తా నాయన

**పంచదశి మహామంత్రార్థంతర్గతః జగసృష్టీమద్యే అశరీర గురుపద శాంతిస్నాన మహంకరిష్యే శ్రీఖండాఖండ విరహితాయ మద్గురు పాదసన్నిదౌ శ్రీనిజగురు దర్శన స్పర్శన కరుణా కటాక్ష వీక్షణ సిద్ధ్యర్థం శ్రీనిజగురు లఘుపరాపూజ మంత్రానుష్టాన విధానమహంకరిష్యే అస్మిన్ గురుపద శాంతి స్నానసమయే మద్బ్రహ్మసృష్ట్యారభ్యాం బ్రహ్మానందనామ సంవత్సరే తూర్యాతీత అవ్యక్తన్నామ ఋతౌ జ్ఞానాజ్ఞానాశూన్యమాసే కేవలాత్మపక్షే జన్మాంతర మర్మపుణ్యతిథౌ నిష్కళవాసరే ప్రకృతి ద్వయదోషరహిత నక్షత్రే స్వస్వావరణ గోత్రస్య శ్రీమద్గురు శ్రీభాగవత కృష్ణదేశికేంద్ర రాజయోగి**





*నామదేయస్య అవినాశ ఛందాయ అభవోదేవాయ అమృతభీజాయ భ్రమా బ్రహ్మైవాహమస్మి అహంపదార్ధరాహిత్య అప్రమేయ శక్త్యాయ మమవ్యవహారిక స్వప్నోద్యోగానాం బాల్య యౌవన, కౌమార వార్ధిక్యకాలే విద్యావిద్య కర్మజన్మ వాసన రహితాయం నిస్తరంగ నిజగురు పదశాంతిస్థాన సిద్యర్థం షోడషోపచార పూజావిధానమహం కరిష్యే ॥*

అనగ పంచదశి మంత్రములో అంతర్గతమై యున్న నిగూడ రహస్యము అదేమనగా కలలో తోచిన జగసృష్టిలో ఇదినిజమని ఇది అభద్ధమని తెలుసుకున్నటువంటి జ్ఞానికి బ్రహ్మానందమనే సంవత్సరము జ్ఞానజ్ఞాన శూన్యమనే మాసం కేవలాత్మయనె పక్షము జన్మాంతర మర్మపుణ్యతిథి. జన్మజన్మాంతరములో ఉన్నటువంటి మర్మము తెలుసుకోవడమే పుణ్యతిథి. నిష్కళవాసరే నిర్మలంగ, నిష్కళంక, నిశ్చలంగ ఉండడమే వారం, ప్రకృతి ద్వయదోషములు రహితము జేసుకున్నరోజే మంచినక్షత్రము, కలలో వచ్చే ఆవరణము యేది ఉన్నదో అదే నా ఆవరణ గోత్రము, యిట్టి సంవత్సరం మాసము తిథి,వారం, నక్షత్రం యెంటువంటివో గ్రహించి మనము గురుకార్యములు కాని వ్యవహార కార్యములు గాని జేయాలి నిజగురు దర్శన స్పర్శన కలిగినటువంటి వారు ఈవిధంగా మెలగాలి. కాబట్టి ఇట్టి నిజగురుభక్తుడు సద్గురుపూజ చేయుచున్నాడు.

శ్రీ సదానంద వెంగళ కుమారాఖ్యులవారు అంటాడు.-

*గీ॥ దర్వు॥ దేశికుండైనశివరామ దీక్షితులను అభినుతించి శ్రీకంబలూరప్పరావు సేవకుడు సీతరాము శిష్యుడైన భాగవతకృష్ణమూర్తిని భావమందూ వేడిలక్ష్మణులా శ్రీపగడాల వెంకటేశ్వరులా వీడక శ్రీనేతి వెంకటేశుల గొని యాడిప్రాసితినీ గీతార్థముల్ జనులారా వేడిలక్ష్మణులా ॥*

*2. వేడి లక్ష్మణులా శ్రీకొండోజు సీతాయార్యులా వీడక శ్రీనాగుల రమలింగయ్యాను గొలిచి నిడి పూజ శ్రీసాయనార్య క్రిష్ణయ్యకూ వేడిలక్ష్మణులా శ్రీకొండోజు సీతాయార్యులా ॥*

*గీ॥ పుడమిపైనొక్కసుజ్ఞాన పురుషుడైన నరుడా ఘోరసంసార నటనలకును*

బాధపడలేక తనపూర్వ పుణ్యతతిచే పరమగురుమూర్తి కడకేగి పలికెవిటుల ॥ద॥ అయ్యా యికవినుమా తప్పాకనన్ను చయ్యానను(బ్రోవుమా కయ్యాలమారెరుక దయ్యాముపలెబట్టి యెయ్యేడవిడువక యేగిరిస్తున్నది గురుడ అయ్యా యికవినుమా తప్పాకనన్ను చయ్యానా(బ్రోవుమా ॥

శ్రీ దుర్గానంద సరస్వతీ స్వాములవారు-

కం॥ యీ ధర పరిపూర్ణుండగు బోధసుధామృతమునిచ్చు బుధవర్యునకున్ వాదము భేదము మాన్పెడి నాదగు గురు(ప్రభువుకిలనూ నయమొప్పగానూ పూజింతూనూ సోదరులాతోనూ ఆదిఅంత్యములేనీ అచలాపరిపూర్ణమునూ నీదగు సత్కృపచే నేదెలియ దలచీతి ॥మి॥ నాదుపాదును కూకుటేరుతో మోదముతో పెకలించి నీదయ చూపినిరతము ఆదరించీ పేదతనమును బాపు జేయుము నయమొప్పగానూ పూజింతూనూ సోదరులాతోనూ ॥

పోలోజు వీరాచార్యుల వారు-

గీ॥ వసుధలోపుణ్యుడొకడుగురు వరునిజేరి నాల్గువిధముల శు(శ్రూషలాచరించి దేశికుని కరుణచేత నుపదేశమొంది పూర్ణబోధనువడసి సంపూర్ణుడయ్యె ॥ద॥ యెంతోమోదంబునా పూజింపబహి రంతారంగంబునా సంతాతముగ గురుని చరణ కమలంబూల మంతానముననిలిపి మనోవాక్కాపుశుద్ధి యెంతోమోదంబునా పూజింపబహి రంతారంగంబునా ॥

శ్రీఆగదాసుల వారంటారు-

గీ॥ అవనిలో పుణ్యపురుషుండు అచలగురుని వద్దికేతెంచి(మొక్కి సేవలును నాల్గుజేసి గురుమూర్తిచే నుపదేశమొంది పూర్ణబోధను వినిపని బూనితానూ ॥ద॥ అమితానందంబుతో పూజా జేయా నార్యుడనె(ప్రేమతో సుమతి జెప్పరబోధ జూతు నీవేర్పనగ విమలుండాశిష్యుడు వినజెప్పసాగెనూ అమితానందంబుతో పూజా జేయా నార్యుడనె(ప్రేమతో ॥

ప్రథమంగ- శ్లో॥ హృత్పుండరీక మధ్యస్థము సకలామ్నాయ సంస్థుతము
ద్యాయామ్యహం సధాభక్త్యా సకలాభీష్ట దాయకం ॥

మనము ధ్యానమనగనె కొందరు ఇష్టదేవుళ్ళను ద్యానిస్తారు. ప్రపంచకులు గురుపుత్రులు తమతమ గురువులను మా గురుదేవులు ఫలాన హైద్రాబాదులో యున్నటువంటి శ్రీరామయార్యులవారిని ధ్యానించుతున్నాను అని ధ్యానించుతాము కాని, శ్రీమద్ భాగవతకృష్ణ దేశికప్రభువులవారు పూజ విధానము వ్రాసేటప్పుడు ధ్యానము చేసేటప్పుడు అఖండ సచ్చిదానంద స్వరూపమైనట్టి సద్గురు మూర్తిని బ్రహ్మాండవ్యాపితమై పిండాండములో తనకున్న స్థానాన్ని తెలియజేయుచు ధ్యానించినాడు. ఇది నిజగురుపూజ. నాయనలారా ఈ శరీరంలో గురుదేవుడు యెక్కడవుంటాడు అన్నది, గురుగీతలో పరమేశ్వరుడు చెప్తాడు,

*శ్లో॥ ఊర్ధ్వమ్నాయ గురోర్పదం త్రిభువనోంకారాఖ్య సింహాసనం*
*సిద్ధాచార సమస్త వేదపరితం షట్చ్రక్రసంచారిణం అద్వైతస్ఫురదగ్ని*
*మేకమమలం పూర్ణప్రభాశోభితం శాంతం శ్రీగురుపంకజం*
*భజమనశ్చైతన్య చంద్రోదయం ॥*

అని తెల్పిరి. శ్రీసద్గురుమూర్తి ఊర్ధ్వపాదస్థానమై, ఆయన సింహాసనము త్రిభువనోంకారాఖ్యం, కూర్చునేస్థానము, హామ్నాయములు అనగా వేధములు, సిద్ధులు, ఆచార్యులు, వేదములు ఆయనను పరిస్తున్నాయి. ఆయన సంచారము షట్చ్రక్రముల యందు, ఆయన స్థితి అద్వైతస్థితి, ఆయన శోభ పూర్ణమైనటువంటిది అనగా అంతటా యున్నటు వంటిది, శాంతము అనే పంకజమున ఆయన ఉంటాడు. ఇందుకు ఇంకా తేటతెల్లముగా పరిపూర్ణబోధ సిద్ధాన్తశిరోమణిః గ్రంథమునందు పూర్వభాగములో నిర్భయవిజ్ఞానప్రకరణమునందు శ్రీ పండితారాధ్య పండిత శివానందస్వాముల వారు చెపుతారు. వినాశకుడనే బ్రాహ్మణుడు రాజుగారికి చెప్పే సంవాదం. సద్గురుస్థానము ఎక్కడ అనేది స్పష్టంగా చెపుతాడు. నేను పశ్చిమచక్ర నివాసుడను సుధావార్థిలో వహ్నిజ్వాలలవలె జ్యోతిరూపం మహాకాశమునందు బ్రహ్మాండ కోశమునందు, బుద్బుధమునందు భూతముతో అణచియున్నాను. ఉదకమధ్యమునందు ఇనశశి వహ్నిమండలముతో గూడి కర్ణికయందు నారాయణాఖ్య విగ్రహుండనై

నటించు హిరణ్మయుండనై యుండుదును. ఇది పరమగుహ్యమైన యథార్థము అని తెల్పినారు. ఇంకా- రాకమచర్ల వెంకటదాసులవారు గురుస్థవ కీర్తనలో చాలాచక్కగా తెల్పినారు.

*గురుదేవతానందమూర్తీ భక్తకోటి మానస చక్రవర్తీ ॥ప॥ పరయోగిజీవన పరహితకారణ నిరతిశయన సర్వదురితనివారణ ॥గు॥ హరిహర బ్రహ్మాదిరూపా పరమోదార సుగుణ ప్రదాతా సరస వేదాంతార్థ షట్చక్ర సంచార గురుతరనిరత త్రికూటసంచారక ॥గు॥ బిందునాదాది వినోదా బ్రహ్మానంద సంతత సుప్రసాదా యిందుహిరణ్మయ మందిర త్రైగుణ్య సందేహ వర్జిత సరస జనార్ధన ॥గు॥ పండీత బృంద విహారా త్రిమండల లక్ష్యవిచారా కుండలిగర్భ హృత్పుండరీకవాస దండితేజోమయ మండలవ్యాపక ॥గు॥ జీవాభిమానవిదూరా భక్తచింతితఫలదా గంభీరా దేవదేవ సర్వదీనా దయాపర శేవకావన రాకమచర్ల శ్రీహరివీర ॥గు॥*

మా పరమేష్టిగురువులకు గురువులు సత్యానందులు సత్యవాక్కు పరిపాలకులు, సత్యవ్రతాచార సంపన్నుడైన శ్రీనిత్యానంద కొండోజు సీతయార్యులవారు ధ్యానం ఏవిధంగా చేసినారో వారు రచించిన పూజావిధానములో సాక్షాత్తు సద్గురుమూర్తి స్వరూపస్థితి శ్రీసీతయార్యులవారు ఎంతచక్కగా తెలియజేసారో అంటే వారికి వారేసాటి. ఎంత అమోఘమో, ఎంత అద్భుతమో మొట్టమొదటి కందార్థము విందాము....

కం॥ నిరుపమ నిర్గుణ నిశ్చలపరిపూర్ణ అనంతనిత్య పంచాతీత పరమపద కేవలాత్మ దురహంకృతి హరణసర్వ ॥దర్వు॥ దోషావిదూరా సద్గురువే సర్వేషా రావేరా కరుణాతో భక్తులను కడతేర్చి రక్షించె దొరవాని మా హృదయవిరిలోన నమ్మితీ దోషావిదూరా సద్గురువే సర్వేషా రావేరా ॥

శ్రీ సదానంద వెంగళ కుమారాఖ్యులవారు అంటాడు.-

గీ॥ దర్వు॥ యెరుకయనియెటి తెరగప్పి ఇంతవరకు నీస్వస్వరూపంబు నేజూడజాలకుంటి స్తోత్రమునుజేతునాయదాశక్తికోలది తప్పులున్ననుమన్నించు దాతవనియు ॥ద॥ ధ్యానమూజేసేదా నాలోనమిమ్మూ పూనిపూజించెదా నేనుమేనెరుకాలు దేన్నందున్నవోజూపి దానినీదొలగించు దయజేసి మాతండ్రీ

**ధ్యానమూజేసెదా నాలోనమిమ్మూ పూనిపూజించెదా ॥**

సద్గురుదేవా మీ నిజస్వరూపమును తెలుసుకొనలేక మిమ్ముల బ్రహ్మదేవుడని, విష్ణుదేవుడని, మహేశ్వరుడని భావించి ఇన్నాళ్ళు అజ్ఞానమనే యెరుక తెరగప్పి పూజించితిని. కాని, తమ కరుణవలన తమరి బోధవలన తమ నిజస్వారూపమును చూచితిని, తెలుసుకొంటిని. గురువే సాక్షాత్తు పరబ్రహ్మమని అర్థమైనది గురుదేవా ఇంతవరకు మిమ్ముల సృష్టినిచేసే బ్రహ్మదేవుడవని పోషించే విష్ణుదేవుడవని లయింపచేసే పరమేశ్వరుడని తలంచితిని. గురుదేవా ఇప్పుడు ఈ నిజస్వరూపమునకు పూజ చేయుచున్నాను. తప్పులున్నను మన్నించుమని వేడి ధ్యానము చేస్తాడు. అయ్యలారా! సాదారణంగా భక్తుడు గురువునాశ్రయించి ఉపదేశంపొందినంక గురువునందు అధిక ప్రేమకలిగి ఆ గురుదేవుని సృష్టిలో ముప్పదిమూడు 33 కోట్ల దేవతలలో గొప్పవారు ఎవరయ్యా అంటే త్రిమూర్తులు-వారు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. ఇంతకంటే గొప్పవారు ఇంకా ఎవ్వరూ లేరని ఈ గురుపరమాత్మను వారికి సమానంగా పోల్చి గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః అని పిలుపు చేయుచు స్మరియిస్తూ, ధ్యానిస్తూ, పూజిస్తూ ఉంటాడు. కొన్ని సంవత్సరములు అయినంక గురుసేవపండి గురుకరుణ కలిగి చర్మచక్షువులు పోయి జ్ఞానచక్షువులు తెరువబడి సద్గురుమూర్తి నిజస్వరూపము గోచరమౌతాది. అప్పుడు శిష్యుడు ఆహా తండ్రీ గురుదేవా నేనెంత పొరబడితిని, మీరు పుట్టించే బ్రహ్మదేవుడవని, పోషించే విష్ణుదేవుడవని, లయం చేసే మహేశ్వరుడవని ప్రార్థించితిని. కాదుకాదు మీరు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపులు ఇంతకంటే ఎక్కువలేదని తస్మైశ్రీగురువేనమః అని అంటాడు. ఇక్కడ నిరాకారముగా అఖండ చైతన్యంగా సృష్టికి అధిష్టాన చేతన బ్రహ్మముగా భావించి నిరాకారములో సాకారమును ధ్యానం చేస్తాడు. దీనికి ముందుగా శ్రీజోష్యుల జనని గారుతాను రచించిన పూజా విధానంలో గీతార్థ దర్పులలో ఈ విధంగా తెలియజేస్తాడు.

**గీ॥ దర్వు॥ సృష్టి భావంబు దాల్చుటన్ ద్రష్టవీవు విశ్వరూపంబు పోషింప విష్ణుడీవె సర్వనాశన కరుడౌట సర్వుడంద్రు గుణత్రయంబుల్ మీరి**

సద్గురుడవైతివి ॥ కోరిదండంబు బెట్టెదా నిరాకార సాకార గురుడవేదేదా పారావారముగా దోచు నిరాకారంబు యెరుక తీరీనిభోదజేసి మారాణంబును జేయ ॥కోరిదండబు॥

గీ॥ దర్వు॥ పిండ బ్రహ్మాండములమీరు పెద్దవీవు అండపిండాండములలోని యణువు నీవే యెన్ననీరూపమే మిన్న చిన్నయాట నేనునిన్నెట్లు గొల్తు ప్రధానపురుష ॥ద॥ ధ్యానాము నేనెజేసేదా ప్రధాన ధ్యాన జ్ఞానాజ్ఞానముల మీరేదా జ్ఞానాజ్ఞాన ప్రజ్ఞాన జ్ఞానావిజ్ఞానములకు జ్ఞానీవైనట్టి నిన్ను మానాసమున గొలువా ధ్యానాము నేనెజేసెదా ప్రధానధ్యానా జ్ఞానాజ్ఞానముల మీరెదా ॥

ఇతి శ్రీమద్గురునకు ధ్యాయామి ధ్యానం సమర్పయామి.

శ్లో॥ అగచ్చానంత దేవేశ బోగమోక్ష ప్రదాయక
నాకేశముఖలోకేశ వందితాంఘ్రి ద్వయాంబుజః ॥

ఓ గురుదేవా! మీరు వచ్చి మిమ్ములాశ్రయించిన సద్భక్తులకు భోగమును, మోక్షమును అనగా- ఇహమునకు సరిపడే సంపదలు, పరమునకు సరిపడే సంపదలిచ్చే ప్రధాతవు. మీరు సామాన్యులు కారు, నాకేష ముఖలోకేశ త్రిమూర్తులతోని వందనములుపొందే మహానుబావులు. మీకు ఆహ్వానమంటాడు కృష్ణప్రభువులు. శ్రీదుర్గానంద సరస్వతి పంచదశి స్వామి ఈ విధంగా అంటాడు-

మి॥ కం॥ కలనాదు వునికియనినే దెలియక నే నున్నయపుడె దేవుడ వీవై దెలియంజేయగ వస్తిరి కలమేల్కొల్పిన గురుడూ ॥ద॥ కరుణాత్మునిపుడూ అవాహనము జేసెదనిపుడూ సావాధానముగానూ సమరస హృదయుండూ నావాయై యీజన్మాసాగారమావలకు ॥మి॥ కేవలాత్మ స్వరూపమై బవాంభుదీనీ దేవ దేవ ప్రభావభావ భావ స్వభావరహితుడు కరుణాత్మునిపూడూ ఆవాహనము జేసెదనిపుడూ ॥

స్వామి నేనెవరో దేవుడెవరో అని చింతించుచున్న తరుణములో దేవదేవుడవైన మీరు వచ్చి నా ఉనికి నాకు దెల్పి జన్మసాగరమును

దాటింపచేసిన కరుణామూర్తులు అని ఆహ్వానము చేస్తాడు.

అదే విధముగా శ్రీ జననిగారు

గీ॥ ద॥ క్షరుడవనరాదు నీవు నక్షరుడుగాదు హరుడవనరాదు నీవు కింకరుడు గాదు పరుడవనకాదు నీవు నపరుడుగాదు గురుడయని బిల్తు నిన్నునో గుర్తురహిత ॥ద॥ ఆవాహనమునూ జేసెదా మోహవర్జిత సావాసమునకు రావయ్యా యూహాపోహలు లేక కోహంకస్త్వంబనరాక భాహాటముగ నున్న భావంబు జూపనిటకు ఆవాహనమునూ జేసెదా మోహవర్జిత సావాసమునకు రావయ్యా ॥

స్వామి క్షర పురుషులుగారు అక్షరపురుషులు కారు, పిండరూపులు గారు, బ్రహ్మాండరూపులు గావు, హరుడువు కావు, కింకరుడవు కావు, పరుడవు కావు, అపరుడవు కావు, గుర్తురహితమైన గురుదేవా ఓమోహరహిత నా పిలుపు ఆలకించి రావయ్యా

శ్రీమద్గురునకు ఆహ్వానం సమర్పయామి.

శ్లో॥ రత్నసింహాసనం వందే సంఘృహాణ సమర్పితం
చంద్రమండల సంకాశ సంశితానన పంకజః ॥

ఆర్యులారా సింహాసనం అనగానే సద్గురుమూర్తికి మంచి మంచి ఇనుము, ఇత్తడి, స్టీలు గలటువంటి రాజకుర్చీలు తెచ్చి ఇవియే వెండివి, బంగారివి కుర్చీలు వేసినాము కూర్చోండి స్వామి అంటారు. ఇంకా కొందరు మాటకారి భక్తులు టేకు, వేప, మద్ది నానారకముల కర్రలతో సింహాసనములు చేయించి గురువుకు వేస్తారు. కాని, శ్రీసీతయార్యులవారు ఎటువంటి సింహాసనము వేస్తారో చూడండి,

కం॥ సదమలదేశిక యికనా హృదయంబను పీఠమందు ఉత్సాహముతో కదలక కూర్చొనియుండుము సదయుతయిదెరత్నసింహా ॥ద॥ సనము గురుదేవా నివసించు సద్గుణమహాత్మావా కదలనిమెదలని కామశూన్యుడవు ఇంపొదవ మీకర్పించి పూజించెదను సింహాసనము గురుదేవా నివసించు సద్గుణమహాత్మావా ॥

గురుదేవా! మీకు స్థానము యిచ్చినాను. చక్కగా ఆసీనులుకండి, కదలక మెదలక నిశ్చలస్థితిగా నా హృదయమునందు కూర్చోండి అంటాడు.

శ్రీవెంగళ కుమారాఖ్యులు అంటారు

**గీ॥ ద॥ భ్రాంతులొకపెట్టు జతగూడి పలువిధముల గెరలుచున్న విమినుముట్టి గానుయిపుడు విషయభోగంబులాపేక్ష వీడదీసి స్థిరునిగాజేయు ముదమున సిద్ధపురుషా ॥దర్వు॥ అయ్యావేగంబునా వేంచేయురత్న సింహాసానంబునా చయ్యానమీస్మరణా జేయుచుండెటివాడ నయ్యానకుడతేర్చు నధికప్రేమతో స్వామీ అయ్యావేగంబునా వేంచేయురత్న సింహాసానంబునా ॥**

సద్గురుదేవా! నానావిధమైన భ్రాంతులు భ్రమలు లేనిప్రేమలు ఎన్నో సంకల్ప వికల్పములు నా హృదయములో జొచ్చి బాధపెట్టి విషయభోగాలవైపు మరల్చుచున్నవి. తొందరగా రండి అతివేగముగా వచ్చి నా హృదయములో కూర్చోండి. మీరు కూర్చొని వుంటె ఈమనస్సు ఎటువెళ్ళదు అని ఆహ్వానిస్తాడు. ఇంకా శ్రీదుర్గానంద సరస్వతీ స్వాములవారు అతీతంగా, ఆశ్చర్యంగా అంటారు

**మి॥ క॥ జ్ఞానాజ్ఞానా ప్రజ్ఞానము మానితముగ పీఠమూను మరి యేర్పరిస్తిన్ మేనందంతఃకరణము నేనుందీసమర్చినాడ నేనాల్గు కోళ్ళన్ దయజేసి నాస్వామీ కూర్చుండన్ గుణములెల్ల గూర్చి మణిసింహాసనంబూను పనిబూని బిగియిస్తి అహమస్మి రెండింట్ని ॥మి॥ యేనుగులుగా జేసి వాటిని దునుముటకు తమచరణ ద్వయమును సింగములుగా జేసినాడని ఘనముకొంచెముగాని సద్గురు నేనాల్గు కోళ్ళన్ దయజేసి నాస్వామీ కూర్చుండన్ ॥**

స్వామీ ! జ్ఞానము అజ్ఞానము ప్రజ్ఞానము మూడింటిని పీఠముగా చేసినాను. వాటికి నామేనులోయున్న అంతఃకరణములు నాల్గు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను నాల్గును కోళ్ళుగా చేసి అమర్చినాను కూర్చోండి. గుణములెల్ల కూర్చి సింహాసనమునకు మణిగా అమర్చినాను. అహం అస్మియను రెండింటిని ఏనుగులా చేసినాను. వాటిని దునుమాడుటకు తమ చరణద్వయమును సింహములుగా చేసినాను. నాలోన ఇట్టివన్ని లేకుండా దునుమాడండి.

**శ్రీమద్గురునకు అనేకమణిమయ రత్నఖచిత సింహాసనం సమర్పయామి.**

**శ్లో॥ పాద్యం గృహాణబోస్వామిన్ మయానీతం శుభప్రదం**
**కృష్ణవేణి జలంభక్త్యా తీర్థపాద జగద్గురో ॥**

ఆత్మబంధువలారా! శ్రీ భాగవత కృష్ణదేశికులవారు పూజావిధానము వ్రాసేటపుడు కలశపూజ వ్రాయలేదు. కాని అందులోనివన్నీ వారి శ్లోకాలల్లో చెపుతారు వారిగొప్పతనము అది. ఈ శ్లోకములో కృష్ణవేణి నదినుండి జలము తెచ్చినానయ్య తమపాదములు కడుగుతాను అంటాడు.

దీనికి శ్రీవెంగళ కుమారాఖ్యులు

***గీ॥ ద॥ కలిమిలేములెప్పుడు శాశ్వతములు గావు నీటిపైబుగ్గతనువిది నిల్వబోదు నఖిలమునుమాయ నిత్యమైనట్టి పరము దెలియగోరినవాడను దెలుపుమహాత్మా ॥ద॥ పాదములుకడిగెదా నాబాదలు పోదోలుమనీవేడెదా వేదాంతార్థతీత వేత్తలునాలోన బేధవాదములుడిగే బోధజేయుమి తండ్రి పాదములు కడిగెదా నాబాదలు పోదోలుమనీ వేడెదా ॥***

స్వామీ! దనము ధాన్యము సంపదలు శాశ్వతము కాదు. మరి తనువు నీటిబుడగ లాంటిది. నిలువదు ఎక్కడజూచిన మాయం వెంటబడి తరుముచున్నది. అంతా మాయనే. ఇవి లేనిది నిత్యమైనది పరమైనది సత్యమైనది తెలియగోరి మీ పాదములు కడుగుచున్నాను అంటాడు. అదేవిధముగా

శ్రీజనని గారు

***గీ॥ ద॥ పదములను బట్టకున్ననే పదవిలేదు పదములను బట్టి బిగబట్టి మదిని నిలిపి పదిలముగ పూజయొనరించ పథముగుదురు వదలకుండగ గురుపదాల్మదిని నమ్మి ॥ద॥ పాదాములాను గడిగేదా భవలయపథ బాదాల విడనాడెదా మోదముతోను ప్రభుని పాదాములాను గడగి వీడేదా మోదఖేదా సాదానలన్నింటిని ॥పాదా॥***

అయ్యా ఎంతవారలైనా హరిహరాదులైనా గురుపాదములు బట్టకపోతే పరమార్థము తెలియజేయలేరు. కాబట్టి తమపాదములను కడిగి బాధలు బాసెదను. జన్మజన్మాంతరముల నుండివుండిన నానాబాధలు బాసేటి కొరకు

ఒక్కసారి గురుని పాధాలు కడిగితే బాధలన్ని పోయి బోద నెరిగినాను.

**శ్రీమద్గురునకు పాదయోపాధ్యం సమర్పయామి.**

**శ్లో॥ అర్ఘ్యం దాసామ్యహం భక్త్యా తవపాణితలే విభో**
**గోదావరి జలం హేమ కలశస్థం సువాసినం ॥**

ఇక్కడ కృష్ణప్రభువులవారు గోదావరినదినీ తెస్తారు. స్వామీ! గోదావరి జలములు తెచ్చినాను. మీ హస్తములు కడిగెదాను అంటాడు.

శ్రీ సీతయార్యులవారు -

**కం॥ చింతలెడబాపి తంతుల వింతలు సర్వంబు త్వరలో విడద్రోచియునా మంతనము నందు వెరువక సంతసహస్తముల కర్ఘ్య జలములొసగెదను గైకొనుము నా మలినంబుబోను సంతతావొుకరీతి సర్వంబునందు అనంతమైయున్నట్టి ఆర్యమీకిదె అర్ఘ్యజలములొసగెదను గైకొనుము నా మలినంబుబోనూ ॥**

సద్గురుదేవా! మీ దయ యెంతగొప్పది తంద్రీ దాన్యంబు లేకున్న ధాన్యంబుతో చింతదాన్యంబు గలిగిన ధరకుచింత యెుద్దులేకున్న వ్యవసాయమునకు చింత పంటభూమియుంటె పెంటచింత చదువునేర్చినమీద చెరుపు అక్షరచింత చదువురాకయున్న చాలచింత భార్య లేకున్నను వీర్యంబుతో చింత సతియున్నను వెనుక సుతులచింత గృహంబులేకున్న గృహముతో చింత గృహముగలిగిన వెనుక కుర్చీలకు చింత యింకా యెన్నో చింతల నుండి తప్పించే తమ హస్తములు కడిగి ఆశీర్వాదము పొందుతాను.

మరియు శ్రీజననీగారంటారు-

**గీ॥ ద॥ అభయమిచ్చేటి యాచార్యహస్తమిదని అహము రహితమ్ముజేసేటి హస్తమిదని అభవ పదవినిజేకూర్చు హస్తమిదని అఖిలభవబంధముల బాపు హస్తమిదని ॥ద॥ హస్తాములాను గడిగేదా యాచార్యశేఖర అర్ఘ్యంబులందించేదా హస్తమస్తక సంప్ర శస్త్రాములను గూర్చి నాస్తికరువలియను ప్రశస్తిగూర్చుట కొరకూ....... ॥హస్తా॥**

◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆•◆

గురుదేవుని హస్తము యేమి పనిచేస్తాది అంటే ఒక్కసారి వారి హస్తము మన మస్తకముమీద సోకిన పై విధముగా పనులు జరుగుతావి.

## శ్రీమద్గురునకు హస్తయో అర్ఘ్యం సమర్పయామి

**శ్లో॥ ఆచమ్యాతం మయాదత్తం యేగురో యమునాజలం**
**త్వదర్థం కృపయాభావ బవబాధనికృంతనా ॥**

శ్రీ కృష్ణప్రభువులవారు యమునానది జలం తెచ్చినాను ఆచమనం చేయండి అంటాడు.

శ్రీ వెంగళ కుమారాఖ్యులు-

**గీ॥ ద॥ సంచితాగామికర్మలనమయజేసి చావుపుట్టుకలొందేటి యెరుక తీవ్రమనచి పరమసుజ్ఞాన తేజంబు ప్రబలునటుల జేసిముదమునపోషింపు జనకయిపుడు ॥ద॥ ఆచమానియ్యమూ జేయండివేగ నాచార్యబాగనూ యచల చలములరెంటి మార్గముల్ లెస్సగ దాచకతెలపండి దయజేసి గురుస్వామి ఆచమానియ్యమూ జేయండివేగ నాచార్యబాగనూ ॥**

ఓజనకా! ఆగామిసంచిత ప్రారబ్ధ కర్మలు పోగొట్టి చావుపుట్టుకలు కలిగించే యెరుకను అణచివేసి పరమసుజ్ఞానమనే తేజంబు ప్రభలజేసి బ్రహ్మాండలీనంబు పోషింప జేయగలరని ఆచమనీయం ఇస్తాను అంటాడు.

శ్రీజననిగారు-

**గీ॥ మందమతియగు నాబుద్ధి గోవిందయనదు అందుయిందునుయెందును సందులేక ముందు వెనుకల లేకుండ పొందుపరచి యర్పణముజేతు గురువర్యు అంకితముగ ॥ద॥ ఆచామానాము జేయుమా ప్రభువర్యవేగ నీచంపు యెరుక దీయుమా వాచామావాచమైన లేశంపు యెరుకమాపి సాక్షాత్తపరోక్షమైన సాక్ష్యాతీతుని జూప ఆచామానాము జేయుమా ప్రభువర్యవేగ నీచంపు యెరుక దీయుమా ॥**

అయ్యా! మందమతి యైనట్టి నాబుద్ధి ఒకరోజుకూడా నీనామస్మరణ జేయదు, మంచివాళ్ళను కలువదు, మంచివస్తువులను చూడదు, ఈచంచల

బుద్ధినాకొద్దు తండ్రీ మీకుదీనిని ఆచమనీయంగా సమర్పిస్తాను. యిందుకు లేనిలేని వాచాలత గలిగిన ఈయెరుకను లేకుండగ జేసి నాకు పరోక్షంబైన ఆ పరమాత్మను జూపండి తండ్రీ.

శ్రీమద్గురునకు ఆచమనీయం సమర్పయామి

**శ్లో॥ శర్కరాదధిమద్వాజ క్షీరమిశ్రమిదం విభో**
**పంచామృతం మయాదత్తం స్నానం కురుజగత్పతే ॥**

ఇచ్చట మామూలుగా పాలు, పెరుగు, నెయ్యి, శర్కర, తేనె వీటిని పంచామృతంబుగా వాడుతాము. కాని అచలఋషులు ఏది నిజమైన పంచామృతంగా ఇస్తారు శ్రీ దుర్గానందులవారంటారు

**మి॥ క॥ తనువులు మూటిలోపలను అణువైమరి వెలయుచున్న ఆపోజ్యోతిన్ ఘనమగు టెంకాయ జలమును వొనరుగ జ్ఞానేంద్రియములూ వోర్పుగబోధన్ క్షీరదధిమధు ఘృతములతోడన్ పనిబూని పంచామృతముజేస్తీ శర్కరతో స్నానముజేసి నన్నానందింపజేయు ॥మి॥ నేననూ నహమెందులేకనూ గానబడు జగద్భ్రాంతి ధృంచిన దీనజన పరిపాలనా నాగోలవిని నన్నేలుకొనుమా వోర్పుగబోధన్ క్షీరదధిమధు ఘృతములతోడన్ ॥**

ఓస్వామీ! స్థూల, సూక్ష్మ, కారణ శరీరములో అణుమాత్రమై వెలయుచున్న ఆపోజ్యోతిని నారికేళ జలముగా జ్ఞానేంద్రియములు పాలు,పెరుగు, నెయ్యి, శర్కర, తేనెలుగా తెచ్చి పంచామృతముగా ఇస్తాను. నేననే అహంలేక జగద్భ్రాంతి ధృంచి నాగోలమాన్పు అంటాడు.
మరియు శ్రీ పోలోజు వీరాచార్యులవారు-

**గీ॥ ద॥ నారికేళంబుయను భ్రాంతి నరయగొట్టి యందులోజలంక్షీరదధియందు ఘృతము బోధరసశర్కరనెడి సద్బుద్ధిగలిపి ఇదియె పంచామృతస్నాన విపుడుజేయ ॥ద॥ వలయునిదిగో తండ్రీ పంచామృతములస్నానము జేయండీ ఫలమేమి లేనట్టి భ్రమవిశ్వమునుజూడ కలవంటి జగమునిక్కముగాదు యనిదెలుప వలయునిదిగో తండ్రీ పంచామృతములస్నానము జేయండీ ॥**

స్వామీ! భ్రాంతి అనే నారికేళము అందులో జలము క్షీర, ధధిఘృతము భాధయను రసము శర్కర సద్బుద్ధి తేనె వీటిని పంచామృతము ఇస్తాను తంత్రీ ఇంకా విశేషంగా శ్రీ జననిగారు-

**గీ॥ దేహమింద్రియ జీవుల దివ్యముగను హంసయాత్మల శుద్ధించహంబువీడ స్వస్తి తారకసాంఖ్యా,మనస్కవేద తత్వవిధితెల్పి పంచామృతత్వమొసగ ॥ద॥ పంచామృత స్నానమిచ్చేదా వంచానలేక పంచానుచేరియుండెదా సంచిత కర్మలన్నీ ముంచి బయలుండజూపి ప్రపంచా భ్రాంతీని మాపి కించానుడుల్ల మీకు పంచామృత స్నానమిచ్చేదా వంచానలేక పంచానుచేరియుండెదా ॥**

ఓ గురుదేవా దేహము ఇంద్రియములు జీవులు హంస ఆత్మ శుద్ధిజేసి అహంకార మమకారములు విడిచి స్వస్తికారోహణ సాంఖ్య, తారక, అమనస్క, తత్వవిధి దెల్పితిరో దానిని తమకు పంచామృతంగా సమర్పిస్తాను. వంచనలేక తమపంచన యుంటాను అంటాడు.

శ్రీమద్గురునకు పంచామృతస్నానం సమర్పయామి

**శ్లో॥ తప్తకాంచనకుంభస్థం కించిదూష్ణం సువాసితం**
**మయానీతం జహ్నుకన్యా జలస్నానం కురుప్రభో ॥**

శ్రీకృష్ణప్రభువులవారు యెంతమేలు జేసినారో జహ్నుకన్యా గంగాజలము తెచ్చి కించిదూష్ణ స్వామి గోరువెచ్చటి నీరు తెచ్చినాను అభ్యంగ స్నానము చేయిస్తానంటాడు. ఈనాడు శిష్యులు గురువులుఇంటికి వస్తే కాళ్ళు కడగాలంటేనే సిగ్గు పడతారు కాని, కృష్ణప్రభువులవారు గోరువెచ్చని నీరు తెచ్చినాను స్నానము చేయిస్తాను కురు అంటే చేయండి ప్రభూ.

మరియు పరమపావన మూర్తియైన శ్రీనిత్యానంద కొండోజు సీతయార్య ప్రభువులు ఏవిధంగా స్నానం చేయిస్తారో చూడండి.

**కం॥ మలముల మానియునా సంకులముల జిమ్మెసికామక్రోదములణచి తెలివనె శుద్ధజ్ఞానము జలమిదె శుద్ధోదకంబు ॥ద॥ చరణా కమలములన్ గడుగుటకూనీ దరిదెస్తివేగన్ యిల ఆనందా బాష్పాములతోడ నాదుకన్నుల**

**యందు యరుదెంచు జలమే శుద్ధోదకము చరణా కమలములన్ గడుగుటకునీ దరిదెస్తివేగన్ ॥**

తండ్రీ! గురుదేవా అణవమలము మాయామలం, కార్మికమలము 3 సంకులములు అనగా సంకుచితగుణములు నాదిపెద్దకులము, నీది చిన్నకులము, అనే వాదనలు జిమ్మేసి ఎగరగొట్టి కామ, క్రోద, లోభ, మోహ, మధ, మత్స్యరమనే అరిషడ్వర్గముల అణచివేసి తెలివనే శుద్ధజ్ఞానమునే జలముగా తెచ్చినాను. నీచరణ కమలములు కడుగుతాను. స్నానము చేయించుతాను తండ్రీ తమ అమూల్యమైన బోధ వింటుంటే పరమానందముతో నాకన్నులయందు ఆనందబాష్పములు రాలుచున్నవి వాటిని కూడా మీకు స్నానము చేయిస్తాను అంటారు శ్రీసీతయార్యులవారి భావము స్థితి, గురువుమీద వున్న ప్రేమ అనురాగము, ఎంతగొప్పదో విజ్ఞులు ఆలోచించాలి. నిజంగా సాధకుడైన భక్తునికి సీతయార్యులు చూపిన ఈ పూజ చాలా తోడ్పాటుగలది. నేర్పుగలపూజ ఇంతమంచిగా ఇంకెవరిదీ వుండదు కూడా.

శ్రీమద్గురునకు శుద్ధోదకస్నానం సమర్పయామి

**శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం త్వదర్థంస్వర్ణతంతున**
**నిర్మితం నిర్మలం స్వామిన్ నిత్యకళ్యాణపావన ॥**

శ్రీ సీతయార్యులవారు-

**కం॥ శెలుగభక్తులకున్ సౌశీలుడవై బోధదెల్పు శ్రీగురుదేవా మేలగు స్వర్ణము తంతుల చేలంబర్పింతువేన ॥ద॥ చేకొనుమయ్యా సందేహముల బోకార్పుమయ్యా నాలోన యున్నట్టి హరిషడ్వర్గములాను వాలాయంబుగానూ వదలీయుంటిని చాలు చేకొనుమయ్యా సందేహముల బోకార్పుమయ్యా ॥**

స్వామీ గురుదేవా! నాలోన యున్నటువంటి అరిషడ్వర్గములను వదలడమే మీకు వస్త్రముగా సమర్పిస్తాను.

శ్రీ జననిగారంటారు-

**గీ॥ ద॥ జీవుడొక్కండికొక్కడు శివుడటంచు దేహమొక్కటివేరు యీ**

**దేహియంచు పిండమొక్కటివేరు బ్రహ్మాండమంచు రెండు రెండుగ దోచుచుండేటి భ్రాంతి ॥ద॥ వస్త్రాయుగ్మాము నొసగేదా శస్త్రాస్త్రమూలా చీల్బాబడ నిదితెలిపెదా చిత్రావిచిత్రములౌ జగము దానందుదోచి చిత్రాముగనుబోవు చిత్తుసత్తూ సమ్మిళితా వస్త్రాయుగ్మాము నొసగేదా శస్త్రాస్త్రమూలా చీల్బాబడ నిదితెలిపెదా ॥**

ఓ గురుదేవా! జీవుడు వేరు శివుడు వేరు దేహము వేరు దేహి వేరు పిండము వేరు బ్రహ్మాండము వేరు అని ద్వంద్వ భావముగా బేద బావముగా వేరుజేసె ఏబ్రాంతి యున్నదో అది మీకు వస్త్రముగా సమర్పిస్తాను.

**శ్రీమద్గురునకు అలంకారణార్థం వస్త్రయుగ్మం సమర్పయామి**

**శ్లో॥ కార్పాసతంతునా శుభ్రం రచితం తేర్పితం మయ**
**సంగృహాణమిదంయజ్ఞ సూత్రంపాత్రందయానిదే ॥**

ఇక్కడ శ్రీ సీతయార్యులవారు- ఏది గాయిత్రిగా వేయుచున్నారో చూద్దాము.

**కం॥ యీడపింగళిసుషుమ్నా నాళంబున యెపుడుహంస నాడుచునుండే మేలిమి తారకమనియెడు ఈ లోయజపంబుగాయి ॥ద॥ త్రిదెమీకు జంధ్యం వేసితిగొనునా మదికి ఆనందం పాలాక్షామరవినుత పరమపావన దేవా నాలోనా భజియించి నర్పించితిని గాయిత్రిదె మీకు జంద్యం వేసితి గొనునామదికి ఆనందం ॥**

హే గురుదేవా! నీకు దారంపోగుల తెచ్చి మూడు పోగులు తొమ్మిది పోగులు 27 పోగులు అనగా వరసలు తెచ్చి జంద్యము వేయలేను. స్వామీ తమరు చూపించిన నాలోయున్న నారకమును తెలిపే తారకమును అనగా సోహం అను హంసను ఇరువదినాలుగు 24 గంటలకు 21,600 ఇరువదియొక్క వేయిఆరునూర్లు ఆడేటి నాలో యున్నటువంటి దేవతా మూర్తులకు జపములు చేసి సంతోషపెట్టి అదీగాక యెన్నో విధముల మయిలబట్టి (కార్బన్) అనుమసిబట్టి మబ్బుగప్పి యున్న మనసును శుద్ధిజేసె పరమహంసను అజపగాయత్రిగా నడిచే హంసను నీకు జంద్యముగా వేయుచున్నాను గైకొనండి.

ఇదేవిదంగా శ్రీ పోలోజువీరాచార్యులవారు అంటారు

గీ॥ సప్తచక్రంబులకు మీదగుప్తమయ్యినడుచు హంసోహమను సూత్రమందు మూడు మాత్రుకలనొక్కటిగనుగాయిత్రికొరకు బ్రహ్మముడి పెట్టి తిదిమూల భ్రాంతియనెటి ॥ధ॥ జంద్యాము దరియింపుమా నేనీవానే సంద్యా బ్రమ దీర్పుమా వంద్యాసూనుని భ్రాంతి వలెదోచుయెరుకాలో సంధ్యాలెన్నియో దోచు స్వానుభవమే భ్రాంతి జంద్యాము దరియింపుమా నేనీవానే సంద్యా బ్రమ దీర్పుమా ॥

ఓస్వామీ! ఆధార, స్వాదిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారముయను ఏడు చక్రములకు రహస్యంగా యుండి లిప్తకాలములో మూడు మాతృకలుగా నొక్కటి గాయిత్రికొరకు బ్రహ్మముడిపెట్టి దీనిమూలభ్రాంతి అన్నారు. దీనినే జంద్యముగా వేసి నేను నీవు అనే సంద్యాభ్రమదీర్చడమే వంద్యాసూనునివలె తోచిన ఈసృష్ఠి ఈజగము, ఈభ్రమ, దీర్పుతారని జంద్యము వేయుచున్నాను.

శ్రీమద్గురునకు యజ్ఞోపవీతం సమర్పయామి

శ్లో॥ కిరీటం కుండలంరత్న కంకణాదినితేమయ
సంగృహ్యతాంభూషణాని అర్పితాని నిరంజన ॥

శ్రీదుర్గానందులవారు - సర్వాభరణములు వేయుచున్నారు చూద్దామా

మి॥ కం॥ ఒద్దికతోపెద్దలనుచు ముద్దుగనా సద్గుణములు ముత్తెపు పేరున్ శ్రద్ధాభక్తి విశ్వాసము శుద్ధంబగురత్నమకుట ॥ద॥ శుభకిరీటమునన్ వజ్రాల్ నీలమును కంకణములన్ నిద్దామగు నీ దయానద్దీనట్లుగ నాపై యేప్రొద్దూ నుంచమనుచూ బద్ధాంజలుండాను ॥మి॥ మొద్దుబుద్దులు జిమ్మి పెద్దాపద్ధతిని నా కెరుక పరచిన శిద్దుడౌశుద్ధాత్మరహితుడ బద్దుడను నను బాగుచేయుము శుభకిరీటమునన్ వజ్రాల్నీలమును కంకణములన్ ॥

సద్గురుప్రభూ తమదయ అనుగ్రహముచే నాలోకలిగిన సద్గుణములు మీకు

ముత్యాలపేరుగా నాలో వున్న శ్రద్ధ భక్తి, విశ్వాసం తమకు రత్నముగ్గా, కిరీటముగా, వజ్రముగా సమర్పిస్తాను తండ్రీ నా ముద్దుబుద్దులు ఎగురజిమ్మి గొప్పనైన పరిపూర్ణమెరుకల నెరిగించి బద్ధుడనైన నన్ను బాగుజేసినారు అందుకు సర్వాభరణములు వేయుచున్నాను. మరియు ఇదేవిధముగా

శ్రీపోలోజు వీరాచారి గారు-

***గీ॥ పెద్దలనుజూచి మ్రొక్కుటేనిద్ధమైన ముత్యములహారమగు కంఠమునను మెరయ రత్నముల కిరీటంబేవిరక్తి శ్రద్ధ నిందలనుపారదోలుటే అందెలునుగా ॥ద॥ జేసితీ ధరియింపుమా ఆభరణాముల్ దేశికుడగాంచుమా ఆశగుణముల నెల్లగోసిమీ మెడనిండ భూషణంబులు బెట్టి నాసుగుణముల గూర్చి జేసితి ధరియింపుమా ఆభరణాముల్ దేశికుడగాంచుమా ॥***

ఓ పరమదయానిధి! పెద్దలచూచిన తక్షణమే శిరమువంచి మ్రొక్కుట ముత్యములహారము మీ కంఠమునకు ఈ కపట జనుల ఈర్ష్యఅసూయ పరులు కుమతులు, ఉత్తములబాధపెట్టే తొత్తులు, మంచిమార్గములో చేరి వంచన రహితులు గానివారలు గురుభక్తులైకూడా ధనమదాంధముచేత పెద్దలసేవ చేయక చేసేవారిని చూసి వోర్వక పెద్దలమని అబద్ధాలాడే నీచులజూచి విరక్తి అనే శ్రద్ధకలిగినది తండ్రీ ఈవిరక్తి శ్రద్ధ తమకు రత్నముల కిరీటముగా దలంచుచున్నాను. నిందలకు వోర్చి వాటిని పారద్రోలుటే మీకు అందెలుగా జేసినాను ధరింపుము. ఆశగుణములన్నింటిని కోసివేసి నాసుగుణముల గూర్చి భూషణములు ఇస్తున్నాను గైకొనండి అంటాడు.

*శ్రీమద్గురునకు సర్వాభరణభూషణాన్ సమర్పయామి ॥*

*శ్లో॥ మలయాచలసంభూతం కర్పూరకలితంవిభో*
*విలేపనంత్వదర్థంబో గృహ్యతామర్పితంమయా ॥*

శ్రీపోలోజు వీరాచారి గారు-

***గీ॥ జ్ఞానమనియెటి తెలివిని సానపైన చెక్కయనేకోరికను యెందు దక్కకుండ***

**రాచితీసిన శ్రీగంధ రసమునిదియు మేనునకుబూతు మదికి సన్మానమొదవ ॥ద॥ పరిమెళపు గందమూ ధరియింపుమీ మెరుపుగలతిలకమూ సరసంబుగను సువాసన ద్రవ్యములనెల్ల నరసింపుమిగవీటి యానందమును గలుగ పరిమెళపు గంధమూ ధరియింపూమీ మెరుపుగల తిలకమూ ॥**

స్వామీ గురుదేవా! జ్ఞానమనియెటి తెలివి ఏదో దాని సానరాయిగా జేసి కోరికలన్ని గంధముచేక్కగా జేసి మెత్తగానూరి మేనంత బూసెదను అంటాడు. మరియు శ్రీదుర్గానందస్వామి ఆవరసలోనే

**మి॥ కం॥ తెలివిశరీరజగములు గలిగినదే జ్ఞానమనెడు గంధపు సానము దలిపలుకె మరిచెక్కను మిళితముగా జేసిదెచ్చితి ॥ద॥ మేలిమీ గానూ మేనందలదు కర్పూరరోజ్ లవంఢ్రూనూ సలలితముగ సంకల్ప వికల్పములు చక్కాని తిలకాము సరిగా మీనుదుటుంతు ॥మి॥ అలవిగాదా నన్ను బ్రోచుట చలనరహితుడ సాక్షి వర్జిత యిలను నీవంటిష్ట వేల్పింకెవరుగలరూ దిక్కుస్వామీ మేలిమిగాను మేనందలదు కర్పూరరోజ్ లవంఢ్రూలనూ ॥**

ప్రభో! తెలివిశరీరజగములు గలిగినది సానరాయిగాను అందలి పలుకులే గంధముచెక్కగాను సంకల్పవికల్పములు వికారగుణములన్నీ మిళితముజేసి నూరి తిలకముగా పెట్టుతాను.మీకంటే ఇంకా వేల్పు ఎవరు. దిక్కు ఎవరు లేరు తండ్రీ అంటాడు.

శ్రీ జనని ఆర్యులు -యెంతచక్కగా జెప్పుతారు ఏగంధము పెట్టుతాడుచూడండి.

**గీ॥ జననమరణంబులను దేహ జాడ్యకిలము శోకమోహంబులను మనోపంకిలంబు ఆకలియు దాహమను ప్రాణి పంకిలంబు చక్కగను జేర్చి శ్రీగంధ చయమటంచు ॥ద॥ లేపానమును జేసెదా నిర్లేపునిపుడె కాపాడుమని వేడెదా పాపాపుణ్యంపు భ్రాంతి లేపనమునదోచె కాపూగనుండి నన్ను కర్మవిముక్తుజేయ లేపానమును జేసెదా నిర్లేపునిపుడె కాపాడుమని వేడెదా ॥**

గురుదేవా జనన మరణములు శోకమోహంబులు ఆకలిదప్పికలను షడూర్మ్ములు నాలో జేరి నన్ను బాధపెట్టుచున్నవి. వీటిని పాపపుణ్యములు అనే సానపైన లేపనము జేసి గంధము సమర్పిస్తాను అంటారు

శ్రీమద్గురునకు శ్రీగంధం సమర్పయామి

**శ్లో॥ తండులాన్‌దవళాకారాన్ హరిద్రాచూర్ణమిశ్రితాం**
**గృహ్యాతామక్షతాన్ దేవ మయాదత్తాన్మనోహరాన్ ॥**

అయ్యలార సత్య దర్మమూర్తి నిరాహంకారుడు, నిరాడాంభీకుడు, శ్రీసీతయార్యులవారు అక్షంతలు సమర్పిస్తారు చూద్దాం....

**కం॥ ప్రజ్ఞయనెడు వడ్లుదంచియు అజ్ఞానంబనెడు తవుడు నానెరిగెలను విజ్ఞానంబుతో దీసియు సుజ్ఞానంబనెటి మంచి ॥ద॥ సురటి యక్షంతల్ జల్లేదను సుందరమౌ ప్రవింతల్ అజ్ఞానులయిన కృతజ్ఞులౌ మిముజేర యేజ్ఞానవంతులకో యేర్పడును మీరూపు సురటి యక్షంతల్ జల్లేదను సుందరమౌ ప్రవింతల్ ॥**

ఓ పరాత్పరుడవైన గురుదేవా! నేను విధ్యావంతుడను నేను గుణవంతుడను నేను ధనవంతుడను నేను బికాం, బిఎ, ఎల్ఎల్‌బి, బిఇడి, బిఇమెకానిక్, ఎంసిఎ, పిహెచ్‌డి, అనే ప్రజ్ఞా ఏదో అది వడ్లుగాజేసి బాగ దంచియు అజ్ఞానపు చేష్టలన్ని తవుడుగా చేసి నాదినీదిఅనే బేదబావాన్ని నెరిగెలుగా విజ్ఞానంబుతో జేసి సుజ్ఞానమనెటి అక్షంతలు సమర్పిస్తాను. ఏజ్ఞానవంతులకో మీ నిజరూపు తెలియుడమూ తంత్రీ అని అక్షంతలు సమర్పిస్తారు.

మరియు వాడపల్లి ఆగదాసులవారు అక్షంతలు సమర్పిస్తారు

**గీ॥ కలనరాజులు మంత్రులు కాల్పలంబు గానవచ్చియు మేల్కాందులేని తీరు గురునికృపచేత పరిపూర్ణ మెరిగినేను శూన్యమున శూన్యమౌదునో సూరిభూషా ॥ద॥ అక్షంతలు నర్పింతూ పూజించి మిమ్మూ అనుదినమూ సేవింతూ**

నీక్షణమున నన్ను శిక్షించినిజము ప్రత్యక్షముగజూపి రక్షించినాప్రభో అక్షంతలు నర్పింతూ పూజించి మిమ్మూ అనుదినమూ సేవింతూ ॥

నిద్రావస్థలో యున్నపుడు మంచి కలవచ్చినది అనగా స్వప్నము వచ్చినది అది ఏలా వచ్చినదంటే - శ్రీ వెంగళ కుమారాఖ్యులు చెబుతారు. వారు రచించిన సదానంద బోదామృత గ్రంథములో -

సీ॥ కలలోన తానుండి కాంచె రారాజును రారాజు తనకిచ్చే రాజ్యమంత రాజ్యమొచ్చెనటంచు రాణువగూర్చుక యేనుగునెక్కి దానింటికొచ్చె మేడలు మిద్దెలు మేలుగా గట్టించి దానధర్మము సాయదలచి యపుడె ఆసించు విప్రుల కగ్రహారములిచ్చి వూరూరు చలివేంద్రలుంచి తాను ॥గీ॥ హంసతూలిక తల్పంబునందు పండి మేలుకొన నుల్క కుక్కిలో మెలగుచుండె రాజ్య మేమాయె రాణువేరాళ్లగలసె మేడలే మాయ ధర్మంబు మిద్యయయ్యె ॥

ఈవిదంగా రాజయ్యి ఏనుగుపై కూర్చొని తనయింటికి వచ్చి మేడలుమిద్దెలు కట్టి. దానదర్మములు, అతిబూరివిరాళములు ఇచ్చి, అగ్రహారంబులిచ్చి, ఊరూరున చలివేంద్రములుంచి హంసతూలిక తల్పమున పవళించి మేలుకొని చూడగ తాను పాతనులకమంచములో పడివున్నాడు. అలాగే ఆగదాసులవారు కలగాంచి రాజాదిరాజై మంత్రులు కాల్బలంబు సైన్యమును గాంచి, మేలుకొన్నంక ఏమిలేదో ఆలాగే శ్రీగురుకృపచేత పరిపూర్ణపరబ్రహ్మమును యెరిగి గురుమేల్కలో తానుశూన్యముఅని నిశ్చయముకలిగి అక్షంతలు సమర్పిస్తాడు.

## శ్రీమద్గురునాకు అక్షతాన్ సమర్పయామి

శ్లో॥ పుష్పాణ్యనేకాని సుపల్లవాని సుగంధయుక్తాని మనోహరాని
త్వంగృహ్యాతాందేవమయార్పితాని జలాశయస్తాని జపాదికాని

అయ్యలారా! పుష్పములు అనగానే మనము రకరకాలుగల బంతి, చేమంతి, మల్లె, మొల్ల, గులాభీ, జాజి, సంపెంగ, ఈ విదంగా పూలు తెచ్చి పెట్టుతాము. కాని. శ్రీ జననిగారు ఎటువంటి పూలు పెడుతున్నారు చూద్దాం.

**గీ॥ పూర్ణమెరుగుటయే తొలిపుష్పమంచు పుడమియెరుకను యెరుగుట పుష్పమంచు భావమునరెంటి విడమలి పుష్పమంచు పూలమూటితో పూజింప పూనినాడ ॥ద॥ పూలపూజాలా గైకొనుమా నాపాలిదీపామాలాయెరుకాను మాపుమా నీలాతోయద విద్యుల్లీలాగ తోచు మాయవాలాయముగమాపి కాలా కాలూనిగూల్ప ॥ పూలపూజాలా గైకొనుమా నాపాలిదీపామాలాయెరుకాను మాపుమా ॥**

స్వామీ సద్గురుదేవా! తమరు జెప్పిన బోధరీత్యా ప్రపంచములోనున్నటువంటి బోధలలో తెలుసుకోవలసినది పరిపూర్ణబోధ అది మీకుమొదటి పుష్పము, సకలజీవజగత్తుకు మూలమై సత్తానిచ్చి గుర్తెరుగుచున్నదో అట్టితెలివి ఎరుక తమకు రెండవ పుష్పముగా సమర్పిస్తున్నాను. భావములో నిద్రవచ్చేదాక, చచ్చేదాక ఒకటి ఉన్నది, ఒకటిలేదు, ఒకటిసత్యము, ఒకటి అసత్యము, అని మరువకుండ ఉండడమే మూడవ పుష్పము ఈవిధంగా పూలమూటితో మిమ్ముల పూజిస్తాను అంటాడు.

దీనికే వాడపల్లి ఆగదాసులవారు చెపుతారు.

**గీ॥ వంధ్య సూనుడవతరించి వైరులవధ సల్పినది యెంతసత్యామో పలుకులేని బట్టబయలందు నేనంతె యెట్టులనగా పుట్టలేదునే గిట్టనో పూర్ణబావా ॥ద॥ పత్రిదళమూలానూ అర్పించితీ పరిమళా పువులునూ చిత్రాము లేని పవిత్ర బోధనుదెల్పి పుత్రునివిధముగా పోషించితివి తండ్రీ పత్రిదళమూలానూ అర్పించితీ పరిమళా పువులునూ ॥**

సద్గురుప్రభూ ! వంధ్యాసూనుడు, దారుపురుషుడు ఇద్దరు సోధరులు పుట్టి ఒకరికొకరు బేధబుద్దులతో ఈర్ష్య అసూయలతో వైరము గల్పించుకొని యుద్ధముజేసి రక్తకాల్వలు పారి చచ్చిపోయినారు అంటే ఎంతసత్యామో అట్టి దానిని మీకు పుష్పముగా అర్పిస్తాను. ఆర్యులారా ఇక్కడ ఈవంధ్యాసూనుడు, దారుపురుషులగురించి రామవసిష్టసుభోధయను గ్రంధములో ఒక మంచి కథ చెబుతాడు ఆకవి చూద్దాం. శ్రీరామచంద్రుడు పద్నాలుగు సంవత్సరములు వనవాసము చేసి లంకాదహనముజేసి రావణసంహారణజేసి అయోధ్య చేరినాడు

ఒకరోజు తన అంతఃపురములో తనకుతానే నవ్వుతూ నేనెంతగొప్పవాన్ని ఎంతబలవంతున్ని, అంతగొప్ప రావణున్ని సంహరించి, లంకారాజ్యాన్ని పాడుజేసి గెలిచివచ్చినాను కదా యని చిన్న అహముతో సంతోషముతో వున్నతరుణమున వసిష్టమహర్షులవారు అయ్యో రామచంద్రునికి అహము తలెత్తినది. ఇది ఏమి ప్రలయము జేసునో అని అసత్యమైన జగత్తు సత్యమని మిద్యయైన ఈ సంసారమును శాశ్వతమని రాముడు నమ్మి అహముకు లోనవుతున్నాడు. ఇతన్ని రక్షించకపోతే బాగుండదుయని దయార్థుడై పరుగు పరుగున రామచంద్రుని వద్దకు వచ్చి ఓ రామచంద్రా! చాలా ఆనందంగా ఉన్నావు. నీకొక చిన్న కథ చెపుతాను వినుమని ప్రారంభిస్తాడు.

కం॥ తొల్లింటికథయుజెప్పెద ఉళ్ళుక్కీయను దేశమందు ఉన్నదివినుమా డుల్లీయను నగరంబున కల్లాయను నృపునివద్ద ॥ద॥ ఘన మంత్రులునూ వంధ్యాసూను దారుపురుషులునూ ఉల్లాముర౦జిల్ల ఒకనాడుమంత్రుల వెళ్లినబకుసుమంబు వెసమీరు దెమ్మనినా ఘన మంత్రులునూ వంధ్యాసూను దారుపురుషులునూ ॥

కం॥ మండలదివు నాజ్ఞగైకొని దండతబోవంగ స్ఫటికదవళము గనియున్ వెండియుని విభ్రమజెందియు దండిసంతోషముననూ ॥ద॥ దగ్గరాజేరీ హహోయన్న మనకబ్బెననిరీ నిండుకోరికతోడ నిరువురు రాసులు నుండ మూటలు గట్టినొకరికి తక్వాయె దగ్గరాజేరీ హహోయన్న మనకబ్బెననిరీ ॥

కం॥ నయ్యేడదారుపురుషుడును నయ్యానయావంధ్యాసూను జేరంబోయి అయ్యా దర్మముగాదిది నియ్యేడ నీమూటగొప్ప ॥ద॥ నిదిసమానముగా పంచివ్వుమీ ననుజబాగముగా వెయ్యిజనములు జెప్ప వినను నీకివ్వను కయ్యమైనను తొగ్రిగవ్వెన నిచ్చెన నిదినమానముగా వంచివ్వుమీ ననుజబాగముగా ॥

కం॥ తామసమున దారుపురుషుడు నామాటనుబట్టి వంధ్యానందనునీడ్వన్

కోమలమున దారుపురుషుని దీమసమున గొట్టినతడు ॥ద॥ తీవరంబుననూ రొమ్ముమీద పొడిచినంతటనూ యామీద నిరువురు హస్తహస్తముగల్పి భూమిపై బడిలేచి పోరాడిరప్పుడు తీవరంబుననూ రొమ్ముమీద పొడిచినంతటనూ ॥

కం॥ ఆయుదములేని యుద్ధము జేయుటకును వొప్పదనుచు శశశృంగములన్ నాయెడచేరిక కయ్యము గాయంబులు బడియు రక్త ॥ద॥ కాలువబారగాను వ్యాసటజెంది యతిదప్పితోనూ వోయన్నా నీజగడమొప్పాది దహముకు పోయిజలములు ద్రాగిపోరుజేయుదమనిరి కాలువబారగాను వ్యాసటజెంది యతిదప్పితోనూ ॥

కం॥ నీరనుచుయెండమావుల వారిద్దరు జూచి వేగవాంచతోభోవన్ దారిలోరజ్జువకాటిడ భూరివిషజ్వాలచేత ॥ద॥ భూమిపైబడిరీ నంతట ప్రాణవాయువిడిచిరీ శ్రీరామనీకథ శ్రవణానందంబున కోరివిననివారు గురుసేవ రహితులు భూమిపైబడిరీ నంతట ప్రాణవాయువిడిచిరీ ॥

ఈకథ వినగానే శ్రీరాముడు సిగ్గుపడి నాజీవితము కూడా మిద్యాబాసమే గదా అద్యారోపవాదమే యని గురువు పాదాలమీద పడి ప్రణమిల్లి క్షమించు మంటాడు. ఈవిధముగానె బట్టబయలందు నేను కూడా అంతే ఏలాగనగా పుట్టనూలేను గిట్టనూలేను అని నిశ్చయముగలగడమే మీకు నిజమైన పుష్పము అంటాడు ఆగదాసులవారు.

శ్రీమద్గురునకు పుష్పం సమర్పయామి

## అథ అంగపూజ

1. తీర్థపాదాయనమః - పాదౌ పూజయామి
2. నిగమమంజీరాయనమః - గుల్ఫం పూజయామి
3. స్మరతూణీరజంఘాయనమః - జంఘౌ పూజయామి
4. ముక్తికాంతసేవితాయనమః - జానునీం పూజయామి

5. రత్నస్తంబోరు యుగళాయనమః- ఊరుం పూజయామి
6. పులినతల జఘనాయనమః - జఘనౌ పూజయామి
7. మణికాంచిత కళాపశోభితాయనమః - కటిం పూజయామి
8. గంబీరనాభి మండలాయనమః - నాభిం పూజయామి
9. విశ్వోదరాయనమః - ఉదరం పూజయామి
10. దయార్ద్ర హృదయాయనమః - హృదయం పూజయామి
11. విశాల వక్షాయనమః - వక్షస్థలం పూజయామి
12. కంబుగ్రీవాయ నమః - కంఠం పూజయామి
13. వరదాన ధురీణాయనమః - హస్తౌ పూజయామి
14. ఉన్నతస్కందాయనమః - భుజౌ పూజయామి
15. స్మితవక్త్రాయనమః - వక్త్రం పూజయామి
16. చంపక నాసాయనమః - నాసికం పూజయామి
17. పల్లవాదరాయనమః - అదరం పూజయామి
18. పుండ్రేక్షుకార్ముక భృవేన్నమః - భ్రూయుగ్మం పూజయామి
19. కరుణాకటాక్ష వీక్షణాయనమః - నేత్రౌ పూజయామి
20. పూష్ట కర్ణాయనమః - కర్ణౌ పూజయామి
21. రాకాసుధాంశు వదనాయనమః - ముఖం పూజయామి
22. సులలాటాయనమః - లలాటం పూజయామి
23. నీలకుంచిత మూర్ధ్నిజాయనమః- కేశాన్ పూజయామి
24. సువృత్తి శిరస్కాయనమః - శిరం పూజయామి
25. సర్వాత్మనే నమః - సర్వాంగాని పూజయామి

శ్రీదుర్గానందులవారు-

కం॥ చరణంబులు గుల్బజానులు, హరిమద్యముబోలుకటియు యాజఠరంబున్ విరివైనవక్షస్థలమును బరువడి గంభీరగాత్ర ॥ద॥ బలమగు భుజముల్ నాసిక లలాటము అధరచెక్కుల్ నయనశోత్రమస్తక కపాలంబూలు సర్వాంగములు సత్యావిగ్రహునకు ॥మి॥ కరువుదీరగ పూజొనర్చియు మరిమరీ స్తుతియించి

పరమును అరమరభ్యాంతరము లేకను దెల్పుమని నే వేడుకొంటిని భలమ్ము
భుజముల్ నాశిక లలాటము అధర చెక్కుల్ ॥

శ్రీవెంగళ కుమారాఖ్యులవారు-

**గీ॥ సర్వాంగములపూజ జేతునిస్సంశయముగ అనిశమొకరీతిగానుండ
అచలమరుగు తేటగాదెలుపుమిప్పుడు దీనబంధు తల్లిదండ్రివినీవే దైవంబు
గురుడ ॥ద॥ నిత్యాపూజింతునూ నామానసమందు ప్రత్యేకంబూగాను
నిత్యానిత్యాములను నిర్ణయించియిపుడు అసత్యమైనదాన్ని సాగనంపుమి దేవా
నిత్యాపూజింతునూ నామానసమందు ప్రత్యేకంబూగాను ॥**

తండ్రీ! సర్వాంగపూజ చేయుచుంటిని ఎందులకనగా తల్లివి దండ్రివి వల్లభుడవు, బాంధవుడవు, వసుదీశుడవు, తెల్లమిగ దేవుడవు కాబట్టి నాకు అచలమరుగు పూర్తిగా చెప్పండి ప్రభో. నిత్యమైన దాని నిలిపి నిర్ణయించి, అసత్యమైన దాన్ని పారద్రోలండి అనుచు

శ్రీమద్గురునకు అథఅంగపూజాం సమర్పయామి

## అథపత్రపూజ

1. అచింత్యాయనమః - బిల్వపత్రం సమర్పయామి
2. బృందారక వందితాయనమః - తులసీదళం సమర్పయామి
3. భువనరక్షణ తత్పరాయనమః - వకుళపుష్పం సమర్పయామి
4. భూరి విభవాయనమః - పున్నాగపుష్పం సమర్పయామి
5. జగజ్జనన కారణాయనమః - కేతకీపత్రం సమర్పయామి
6. చరాచర గురవేనమః - చామంతికాపుష్పం సమర్ప॥
7. సుప్ర భావాయనమః - చంపకపుష్పం సమర్పయామి
8. సుప్రసన్నాయ నమః - పాటలీపుష్పం సమర్పయామి
9. అపవర్గ ప్రదాయనమః - శతపత్రపుష్పం సమర్పయామి
10. అనంతాయనమః - జాజిపుష్పం సమర్పయామి

11. మోహావర్జితాయనమః - కరవీరపుష్పం సమర్పయామి
12. ముకుందాయనమః - రసాలపుష్పం సమర్పయామి
13. ప్రకృతిపురుష విలక్షణాయనమః - మాలతీపుష్పం సమర్పయామి
14. నిత్యాయనమః - కల్హారపుష్పం సమర్పయామి
15. ఆగ్నేయ చక్రనిలయాయనమః - అతసీపుష్పం సమర్పయామి
16. నాదబిందు కళాతీతాయనమః - పారిజాతపుష్పం సమర్పయామి
17. భూతాత్మనేనమః - అశోకపుష్పం సమర్పయామి
18. మండలత్రయతీతాయనమః - నీలోత్పలపుష్పంసమర్పయామి
19. అనంతాయ నమః - మల్లికాపుష్పం సమర్పయామి
20. అవ్యక్తాయనమః - మాలతీపుష్పం సమర్పయామి

ఇక్కడ ఎన్నోవిధముల పత్రములు అంటే ఆకులు తెచ్చి పూజిస్తుంటాము. కాని, శ్రీవెంగళ కుమారాఖ్యులవారు అర్పిస్తారు చూద్దాం

**గీ॥ నానావిధ పత్రపరిమళ పుష్పములను గూర్చిపూజింతుగైకొనుము స్వార్ధరహిత తెలిసితెలియకచేసిన దోషములను బాపినను బ్రోవునిరతంబు పరమపురుషా॥ దర్వ॥ పత్రాపుష్పములతో నర్పింతు సదనే మైత్రిభావంబుతో ద్రాత్రిలోగల దివ్యక్షేత్రదేవతల నేమాత్రము నమ్మకనమ్మితి మిముగురుడ పత్రాపుష్పములతో నర్పింతు సదనే మైత్రిభావంబుతో ॥**

నిజగురుదేవా! ఈ పరమపవిత్రమైన పత్రపుష్పములను గైకొని నేను తెలిసితెలియకచేసిన దోషములను మన్నించి త్రోసివేసి నను రక్షించండి. ఈ సృష్టిలో ఉన్న క్షేత్రదేవతలను ఏమాత్రం కూడా నమ్మక మిమ్ములనే నమ్మినాను. కాపాడండి తండ్రీ అంటారు.

శ్రీమద్గురునకు నానావిద పత్రపుష్పమ్ సమర్పయామి

# అథఅష్టోత్తర శతనామావళి

1. సద్గురువే నమః
2. పూర్ణాయ నమః
3. సర్వధారాయనమః
4. స్వచ్ఛాయనమః
5. శుద్ధాయనమః
6. నిర్మలాయనమః
7. విశ్వోదరాయనమః
8. నిరాలంబాయనమః
9. రమ్యాయనమః
10. నిర్లేపనాయనమః
11. నిర్వాసాయనమః
12. నిర్గందాయనమః
13. స్వప్రకాశాయనమః
14. నిత్యతృప్తాయనమః
15. అనంతాయనమః
16. అద్వితీయాయనమః
17. వేదవాచామవేద్యాయనమః
18. పరంజ్యోతినేనమః
19. ప్రణవాతీతాయనమః
20. అచలాయనమః
21. అపరిమితాయనమః
22. అప్రమేయాయ నమః
23. అవ్యయాయనమః
24. అచ్యుతాయనమః
25. అహంకార వివర్జితాయ నమః
26. విశ్వాత్మనే నమః
27. ప్రపంచాతీతాయనమః
28. మాననీయ్యాయనమః
29. క్షరాక్షర విలక్షణాయనమః
30. దృగ్దృశ్యా తీతాయనమః
31. ద్వైతాద్వైత వినిర్ముక్తాయనమః
32. అఖండాయనమః
33. ఖండాఖండ విరహితాయనమః
34. ఆదిమద్యాంత శూన్యాయ నమః
35. నిరంజనాయ నమః
36. నిర్వికల్పాయనమః
37. నిరాకారాయ నమః
38. నిరాఖ్యాతాయనమః
39. పరమానంద స్వరూపాయ నమః
40. సగుణనిర్గుణాతీతాయ నమః
41. సర్వసాక్షిణేనమః
42. సాక్ష్యాతీతాయనమః
43. త్రిగుణాతీతాయనమః
44. సర్వభూతాంతరస్తాయనమః
45. సుఖదుఃఖ విరహితాయనమః
46. జన్మజరామరణవర్జితాయ నమః
47. క్షేత్రజ్ఞాయనమః
48. సర్వోపనిషత్సారాయ నమః
49. నిష్కళంకాయనమః
50. నిరాభాసాయ నమః
51. స్వప్రకాశాయనమః
52. సృష్టిస్థిత్యాంతకారణాయ నమః
53. కర్తృత్వరహితాయ నమః
54. సచ్చిదానందతీతాయ నమః

55. అపరోక్షాయనమః
56. సకలమంత్రస్వరూపాయ నమః
57. ఆకాశతనవే నమః
58. నిరాధారాయనమః
59. నిస్తేజనేనమః
60. అవికారాయనమః
61. అమలాయనమః
62. పరతత్వాయనమః
63. పరంధామ్నేయనమః
64. అజాయనమః
65. అగమ్యాయనమః
66. షడ్గుణైశ్వర్య సంపన్నాయ నమః
67. సనాతనాయనమః
68. త్రిమూర్త్యాత్మనేనమః
69. అనాద్యాంతాయనమః
70. సర్వోపాదివినుర్ముక్తాయ నమః
71. భక్తాభీష్టఫలప్రదాయనమః
72. భవరోగభేషజాయ నమః
73. సహస్రారచక్రమధ్యస్థాయనమః
74. సనకాదిమునివందితాయ నమః
75. కామక్రోదాధి శత్రునికృంతనాయ నమః
76. కరుణారసార్ధ హృదయాయ నమః
77. బ్రహ్మావిష్ణుమహేశ్వర స్తుతాయనమః
78. బ్రహ్మాండజనకాయ నమః
79. పరమపావనాయ నమః
80. దీనజనానుగ్రహాయ నమః
81. దివ్యపురుషాయ నమః
82. ప్రసన్నపారిజాతాయ నమః
83. పురాణపురుషాయ నమః
84. నిరుపద్రవాయ నమః
85. నిత్యకళ్యాణాయ నమః
86. సర్వోపనిషత్పంజరకీరాయనమః
87. శబ్దాతీతాయనమః
88. జగన్నాధాయ నమః
89. జగద్గురువే నమః
90. విష్ణవే నమః
91. సర్వతో భద్రాయనమః
92. నిగమార్ధప్రతిపాదకాయ నమః
93. నిస్సంగాయ నమః
94. సహజానందాయ నమః
95. చిన్మయాయ నమః
96. శ్రీమతే నమః
97. సహజామనస్కాయ నమః
98. సాయుజ్య ప్రదాయ నమః
99. పంచబ్రహ్మమయాయ నమః
100. అజడాయనమః
101. జడాజడ విలక్షణాయ నమః
102. భావాభావమద్యస్తాయ నమః
103. అమనస్కాయ నమః
104. అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకాయ నమః
105. సర్వాదయేనమః
106. పరాత్పరాయ నమః
107. లక్ష్యాతీతాయనమః
108. మనోవాగగోచరాయ నమః

ఇక్కడ నూటయెనిమిది 108 కాదు ఇంకా యెన్నో నామాలు ఉన్నవి అంటారు జననిగారు చూచారా.

**గీ॥ అబ్బనీరూపమెన్ననా యబ్బుతరమె అఖిలరూపులు నీరూపెయైనవద్గ్గి నిఖిల లోకాంతరాళయో నేర్పుకాడ కన్నతండ్రిరో నీ విభూతెన్నగలమే ॥ద॥ మన్నాన జేసిబ్రోవుమా సహస్రరూపు కన్నాడ నన్నుగావుమా అన్నావన్నియు గన్న కన్నూ మిఱుమిట్లునొందె అన్నా నేతాళజాలనున్నా నిజరూపు జూపు మన్నాన జేసిబ్రోవుమా సహస్రరూపు కన్నాడ నన్నుగావుమా ॥**

108 కాదు, సహస్రారం కాదు, లక్ష నామములు కావు, కోటి నామములు పెట్టుకున్న తక్కువే. కాని, తమరికి నిజంగా నామము ఉన్నదా అన్నపుడు శ్రీదుర్గానందులవారంటారు.

**కం॥ నూటయెనిమిది పేర్లను నీటుగ మీసస్వరూపు నిర్గుణపదవిన్ పాటల రీతిగ పాడెద నోటను పల్కంగ రానీ ॥ద॥ ఓంకార తీతం బూటకమూ యీ ఓంకారసహితం సూటీగ నడినాళ బాటాలోపల వెలసె నీటైనక్షర బీజలధి దేవతలతోనూ ॥మి॥ యిష్ట నిజగురు విష్ణుమూర్తని అష్టతనువుల కవలివాడని కష్టనిష్టుర సుఖములెరుగని యిష్టవేల్పు నీవేయని నే ఓంకారతీతం బూటకమూ యీ ఓంకారసహితం ॥**

పరమపావన మూర్తి సద్గురుదేవా అకార, ఉకార, మకార, మాతృక స్వరూపమైన ఓంకారము బూటకమని ఓంకారసహితమైన ఈ నామములన్ని ఉత్తవి. ఓంకార తీతుడైన మీరు నా అజ్ఞానము చేత ఓంకారాన్ని అంటగట్టి ఓం సద్గురువే నమః అంటున్నాను. స్వామి ఇప్పటికీ తమస్థానము తమరుఎప్పటి వారు అన్నది భాగవత శ్రీకృష్ణప్రభువులవారు ప్రణవాతీతాయనమః అన్నది యదార్థమైనది. తండ్రీ సృష్టికి ముందు బ్రహ్మస్వరూపమైనవారు సృష్టి ఉత్పత్తికి కారణభూతులైనవారు తమనుండి అవ్యక్తము, మహత్తు, మహధంకారము, పంచతన్మాత్రలు, పంచమహాభూతములు, అఖిలజగత్తు, తర్వాత ఓంకారము మూడు అర్థమాతృకల స్వరూపమే ఓంకారము. తదనంతరం త్రిగుణములు, త్రిమూర్తులు, ఇంత దూరములో ఉన్నటువంటి మీకు దిగువన ఉన్న ఓంకారమును అంటగట్టుచు ఓం సద్గురువే నమః అని మూలపురుషులైన

పెద్దలు శ్రీభాగవతకృష్ణ ప్రభువులవారు మాటయందు నమ్మకములేక ద్రోహులై మూర్ఖులైన కొందరు గురువులు కృష్ణప్రభువులే తప్పినారని ఓంకారము పెట్టి అష్టోత్తరములు ప్రింటుజేయుడము చదవడము చేయుచున్నారు. వారు నరకమును పొందుదురు. శ్రీమత్పీల్ఖాన శంకరప్రభువులవారు గురుదేవునికి నీరాజనమిచ్చేటప్పుడు భూమిఆకాశము మొదలేమిలేనపుడు యేమిలేనపుడు భూమాయను శృతివాక్యము యేమిగానప్పుడు కాయమాయాతీతుడవైనవెపుడు నీవైయున్నవెపుడు యేమాయనోమాయ యేమనవలెనపుడు జైదేవ జైదేవ అంటాడు. అందుకు గురుపరమాత్మ నామరహితుడు రూపరహితుడు కాబట్టి అతనికి ఎన్ని పేర్లు బెట్టిన మన భ్రమనే కాని, ఆయన మాత్రం నాకొరకు నా భవసాగరమును దాటించేటందుకు ఫలానాపేరు పెట్టుకుని శరీరదారియై వచ్చినాడు కనుక నిరాకారములో సాకారపూజ చేయాలి. సద్గురుమూర్తి సాక్షాత్పరబ్రహ్మమనే నమ్మాలి.

### శ్రీమద్గురునకు అష్టోత్తరశతనామా స్మరణాన్ పూజయామి

శ్లో॥ చందనాగరుకర్పూర శర్కరాజ్యసమన్వితం
ధూపోయం గృహ్యతాం స్వామిన్ త్వమిదంతేమయార్పితం ॥

నాయనలారా ఆత్మసోధరులారా దూపం అనగానే మనము మంచి మంచి అగర బత్తులు, సుగంధశృంగార భారతీవాస్, అంబికా దర్బార్‌బత్తి, ఈనాడు, ఎన్నో రకముల ధూపముల తెచ్చి బాగా కమ్మని పొగలేపి దూపం అంటాము.
కాని, మన అచల ఋషిపావనమూర్తి శ్రీ కొండోజు సీతయార్యులవారు దూపము వేయుచున్నారు యేలాగా

కం॥ త్రయవాసన త్రయఈషణ త్రయ దేహంబులు అవస్థ త్రయములు సర్వము త్రయతాపంబులు మీకిదె నియమముగ దూపంబునిస్తి నికను గైకొనుమీ అఘ్రూనించు సకలేశాస్వామీ భయనిర్భయములులేని బయలుజూపియు యెరుక నయముతో విడిపించినది మీకు దూపముగా నికనుగైకొనుమీ అఘ్రూణించు సకలేశాస్వామీ ॥

గురుదేవా నాలోపల వాసన త్రయముులు, ఈషణత్రయముులు, దేహత్రయముులు, మలత్రయముులు, అవస్థలు, తాపత్రయముులు, గుణత్రయములు, బందత్రయములు, పెద్ద చెత్త నిండిపోయి వున్నది. ప్రభూ వీటిని మొత్తం తీసి పళ్ళెములో వేసి దూపంవేయుచున్నాను అంటాడు.
ఇక దుర్గానందస్వామి దూపమేస్తారు.

*కం॥ పాపపుణ్యద్వయముకు ప్రాపైయున్నట్టి యెరుక బ్రమదీశియునే యీ పట్లింద్రియ బృందము దోపిడివిషయాదు లెల్లా ॥ద॥ ధూపాము వేతున్ గురు మంత్రాగ్నిన్ లేకుండా జేతున్ నాపునర్జన్మాము యే ప్రొద్దులేకుండా ఓ పరమపురుషా వో ఆపాదోద్దారక ॥మి॥ పాపల్లోపల ప్రత్యగాత్మను నా పయిాకృపయుంచి దీయుము నీపయీ నాభారమేసితి పాపరహితాపరమపావన ధూపాము వేతున్ గురు మంత్రాగ్నిన్ లేకుండా జేతున్ ॥*

పాపపుణ్యములకు హేతువైన యింద్రియబృందమును దోపిడీ జేసేవిషయాదులను దూపమేస్తాను అంటాడు.
తద్రీతిగనే పోలోజు వీరాచార్యులు

*గీ॥ పాపపుణ్యములగు మూలప్రకృతి యెరుక భ్రమలగల్పించి బహు విధ శ్రమలబడును నట్టియింద్రియ విషయముల్ నంటగూర్చి గురుని మంత్రాగ్ని జ్వాలలో గూల్చియిపుడు ॥ద॥ ధూపముగ వేసితి ఇగనాపుణ్య పాపములబాసితీ యీపునర్జన్మంబునెగర గొట్టియుకంటీ పాప లోపలనున్నా ప్రకృతీ నేననే భ్రాంతి దూపముగ వేసితి ఇగ నాపుణ్యపాపముల బాసితీ ॥*

వీటినన్నింటిని గురుమంత్రాగ్నిజ్వాలచే కాల్చి దూపము వేస్తున్నాను దీనివలన పునర్జన్మ లేకుండా అవుతాది.

శ్రీమద్గురునకు దూపమాఘ్రాపయామి

**శ్లో॥ వహ్నినాయోజితం సాజ్యం దీపంవర్తిత్రయాన్వితం**
**గృహాణాజ్ఞానతిమిర హరజ్ఞాన ప్రవర్ధనం ॥**

ఆత్మబంధువులారా దీపం పెట్టాలంటే ఒక పౌరోహితుడు చెపుతాడు నెయ్యితో దీపం పెట్టుమంటాడు, ఒకసిద్ధాన్తి నువ్వులనూనెతో పెట్టుమంటాడు, మరొక సిద్ధాన్తి కొబ్బరినూనెతో పెట్టమంటాడు, ఒక బ్రాహ్మణుడు ఆముదముతో పెట్టమంటాడు శ్రీసీతయార్యులవారంటారు. ఎన్ని చమురులు తెచ్చి దీపము పెట్టుతాను స్వామీ నిజమైన చమురు మీకు ఇస్తాను అంటూ

***కం॥ కామము, క్రోధము లోభము వామూర్ఖపు గుణములన్ని వత్తులు జేసి పామరమనియెడు చమురును నీమంబుగ బోసియుంచి ॥ద॥ నీమంత్రకళనూ యంటించీన స్వామీ దీపమునూ యీ మహివెల్గాచు ఏకరీతిగయుండె బ్రామికల్ దీరగా పదపాడి దర్శించు నీ మంత్రకళనూ యంటించీన స్వామీదీపమునూ ॥***

తండ్రీ గురుదేవా! కామక్రోదములారింటిని వత్తులుగా జేసి పామరమనియెడు పాడుబుద్ధులను చమురుగా జేసి నీమంత్రాగ్నిచేత ప్రజ్వళింప జేసినాను. దర్శించండి స్వామీ అంటాడు.

అదేవిధముగా శ్రీ దుర్గానందులవారు-

***కం॥ ఆగామిసంచితత్రయ బాగుగ ప్రమెదయువత్తి బరువడి చమురున్ యీ గతి ప్రారబ్ధంబును శ్రీగురునకు దీపముంచీ ॥ద॥ శీఘ్రామునూనూ ప్రత్యగ్పరమాత్మ జ్యోతులనూ త్యాగముతో దీపదర్శయామియనుచు నిగమాగమ గోచర నీవేదిక్కనుచును రాగము లుయెడలించి బ్రోవుము శ్రీగురూవరశ్రిత జనావన యోగదృష్టినన్నవలోకించియు వేగముగ నీదయనుజూడుము శీఘ్రామునూనూ ప్రత్యగ్పరమాత్మజ్యోతులనూ ॥***

ఓ సత్యదేవా! ఆగామి, సంచితము, ప్రారబ్దము అను మూడింటిని అనగా ఆగామిని ప్రమిదగా, సంచితమును వత్తిగా, ప్రారబ్ధమును చమురుగా జేసి

ప్రత్యగాత్మ పరమాత్మను దీపముగ వెలుగజేశి ఎందులో జూచిన నిగమాగమ శాస్త్రములలో మీరుదప్ప ఇంకెవరూ లేరు. మీరేదిక్కని దీపం దర్శయామి అంటాడు. తద్రీతిగానే కొంత తేటతెల్లముగా

పోలోజువీరాచార్యులు చెబుతారు.

***గీ॥ దేహమాణిక్యమందున సోహమనెటి వత్తిగావించిమను తైలపొత్తు గూర్చి ప్రత్యగాత్మను వెలుగ ప్రకాశమైన దీపమును యుంచి నాడ మద్దేశికేంద్ర ॥ద॥ దర్శనము జేయుమా నామదినింపా హర్షపడిచూడుమా స్పర్శసోకిన ఇనుము స్వర్ణంబుగనుమారు పర్శవేదిగనన్ను పాలించుటకుదీపా దర్శనముజేయుమా నామదినింపా హర్షపడిచూడుమా ॥***

శ్రీగురుదేవా ఈదేహమే మాణిక్యము అనగా ప్రమిధ, సోహమనునదే వత్తి, మనస్సు తైలముగా పొత్తు జేసి అంటే అన్నిఒకటిజేసి జతపరిచి ప్రత్యగాత్మను వెలుగజేసి ఆ ప్రకాశములో దీపమును ఉంచినానయ్యా దేశికేంద్రా. ఇంతకష్ట పడుటమెందుకో తెలుసా ఇనుముకు పరశవేది స్పర్శసోకితే ఇనుము సువర్ణముగా మారినదో పరశవేది మీరు, ఇనుము నేను తమస్పర్శచేత సువర్ణమై పోవాలి చావకుండ పుట్టకుండ కావాలి, తమరు చేయాలి అని దీపం ఇస్తాడు. యీలాగ దూపము దీపము ఇస్తే ఆచోటు ఆమందిరము ఆఇల్లు, ఆఒళ్ళు, ఆభావము, ఆహృదయము ఎలావుంటాది అంటే శ్రీమంత సాయనార్యులవారు అంటారు-

***॥పాట చ॥ మరిదూపదీపంబులా మద్గురుని మందిరమెల్ల శోభిల్లగా పరమగురువరు వైభవము వర్ణించనేరికి వశముగాదన నరుడనగు నాతరమనా ఉపచారములన్నుత్తవేయని ॥పూజా॥***

సద్గురుదేవా ఇట్టివైభవము వర్ణింప దేవాదిదేవతలకే తరము కాదు, నరుడను నాతరమా స్వామి నాఉపచారములుఅన్ని ఉత్తవే ఆర్యులార పైన పేర్కొనబడిన దూపములోగాని దీపములోగాని సమస్తమైన దుర్గుణములు విషయేంద్రియ ములు సమకూర్చి దూపముగా దీపముగా సమర్పించితే పదుగూరు నినుజూచి బళి శబాష్ అంటారు అనగా- మననడవడి నుడువడి మనచూపు మనమాట,

మారిపోతాయి పరిశుద్ధమవుతాయి. అప్పుడు చూచేవారికి మనమున్నట్లు తోచేవారికి ఆనందము, ఆప్యాయత, అనురాగము, కలిగి దండమిడుతారు. లేదా ఉపదేశాలు కొత్తవి ఉద్దేశాలు పాతవి. అన్నట్లుగా ఉంటే లోకం మనలను మనగురువులను తిట్టుతారు. దూషిస్తారు, నిందిస్తారు. కావున జాగ్రత్త.

## శ్రీమద్గురునకు దీపం దర్శయామి.

శ్లో॥ శాల్యన్నంషడ్రసోపేతం పంచభక్ష్యాదిసంయుతం
నైవేద్యం దేవదధ్యాజ్య సమ్మిశ్రంప్రతిగృహ్యతాం ॥

సద్గురుమూర్తిని సంతోష పెట్టడమూ చాలా మంది శిష్యులకూ సంభవము కాదు. కాని, మహానీయుడు శ్రీసీతయార్యప్రభువు సాకారమూర్తియగు సద్గురువుకు ఆనందంగా బోంచేయబెడతాడు చూడండి

*కం॥ పరమాన్నము భక్ష్యంబులు అరిసెలు, బూరెలు, సుశర్కరాది పొంగళుల్ మరిఘృతమిశ్రిత లాడుల్ మురిపెంబుతో ముందు నిడితి ॥ద॥ మునునారగించూ నాదుర్దోషములనూ దొలగించూ గురుదేవా యీ దీన నరుని పోషించను స్థిరమైన బోధ యీక్షితిదెల్పి ఆహార మునునారగించూ నాదుర్దోషములనూ దొలగించూ ॥*

దేశికేంద్రా! పరమాన్నము, భక్ష్యంబులు,అరిసెలు, బూరెలు, శర్కరాది పొంగలు నెయ్యితో చేసిన లడ్డూలు, సఖిలాలు, గరిజెలు, అప్పడాలు, చక్కగా బెడుతున్నాను. బోంచేయండి అంటారు. పెద్దలు వాళ్ళ హృదయాలు ఎంతగొప్పవో మనం తెలుసుకునవలసియున్నది.

శ్రీదుర్గానందులవారు

కం॥ పరగగభూతము లైదను బరిగెడి క్షీరంబుజున్ను పాలా న్నములను అరయగనారు రసంబులు కూరిమితో వడ్డిస్తిని ॥ద॥ కూర్చుండుస్వామీ బోంచేయూడి నైవేధ్యం నిష్కామీ పరగా లడ్డుల్ దూద్ పెడా జిలేబీల నరయా గులాబ్‌జాం నాణ్యమౌ రస్కుల్లా ॥మి॥ నేరమెంచక ఆరగించుడి మీగడగలశర్కర

**పాలతో అరమరభ్యాంతరము లేకను మాయయెరుకను ద్రుంచు తండ్రీ కూర్చుండుస్వామీ భోంచేయూడి నైవేద్యం నిష్కామీ ॥**

పంచభూతముల బరిగెడి యెరుకను క్షీరాన్నముగా జున్నుపాలుఆరు రసములు తదితర స్వీట్లు స్వామీ భోంచేయండి అంటారు. అదేవిధముగా శ్రీ పోలోజు వీరాచార్యులు--

**గీ॥ సకలభూతంబులందు సమస్తమైన వస్తువులయందు ద్వేషంబు వదలిపెట్టి యుండుటయే మీకు భక్ష్యాన్న మొప్పితమగు పక్వములు నివియె వడ్డింప బరగినాడ ॥దర్వు॥ స్వామీ భోంచేయుమా యీ మహానైవేధ్యము దయజేయుమా నామీద దయలుంచూ నను లేకుండగజేయు యీ మాయమేను నింకేమాయనో తెలియా స్వామీభోంచేయుమా యీ మహానైవేద్యము దయజేయుమా ॥**

శ్రీగురునాథా! మమాత్మా సర్వభూతాత్మ ఆత్మైవసర్వభూతాణి అన్నట్టు శృతులను తమదయతో తెలిసి వాటియందున ఏలాంటి ద్వేషములు లేక గీతాచార్యులు చెప్పినట్లుగా

భగవద్గీత 5వ అ॥ 18వ

**శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని శ్శునిచైవ శ్వపాకేచ పండిత సమదర్శినః ॥** విద్యావినయము గలిగియున్న బ్రాహ్మణునియందు గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకునితిను చండాలునియందును, సమదృష్టిగలవారలె జ్ఞానులు. ఆత్మాభిమానము గలవారు, అట్టిద్వేషము వదలిపెట్టుటయే తమరికి భోజనము తండ్రీ. భోంచేయండి.

తద్రీతిగానే వాడపల్లి ఆగదాసులవారు -

**గీ॥ నేనునాల్గవతనువును మేను మూడు తనువులాయెను నేమేను దలపనేనే గాని నేనెవ్వరనినన్ను కడకుగంటె లేనునాకలిమికల్లాయె మానితాత్మ ॥ద॥ అయ్యా భోంచేయుమా ఈ మహానైవేద్యము ప్రేమింపుమా**

**దయ్యమను పెనుమాయ దగిలినను బాధింప దయ్యానమంత్రించి సాగనంపిన స్వామీ అయ్యా భోంచేయుమా ఈ మహానైవేద్యము ప్రేమింపుమా ॥**

ఓ మానితాత్మా! మరుపుతనువులు మూడు నేననే నాల్గవతనువు నేను మేనుల విచారించ తుదకు నేనుకల్ల, నాకలిమి నేను హుళ్ళక్కి ఇదయే మీకు నైవేద్యము స్వామీ పెనుమాయ దయ్యమువలె బట్టి నన్ను బాధింపగ గొప్పనైన మీ మంత్రాగ్నిచేత సాగనంపినారు, పారద్రోలినారు అంటారు. అయ్యలారా మనము అనుకుంటాము మా గురువుగారు రచించిన పూజావిధానమే చాలామంచిది, చాలా శ్రేష్టము ఇతరులు రచించినది పనికిరానిది అంటాం కాని. మనపెద్దలు అందరు ఒక విధముగానే, ఒక్క గురుబోధగానే రచించినారు. మనకు అనగా నాలాంటి వారికి ఇవి మంచివి ఇవి చెడ్డవి మాతాత గొప్ప మాతండ్రి గొప్ప నేను గొప్ప, నేను చెప్పినదే కరెక్టు అంటాము, కాని నిజంగా గురుసేవ తత్పరులై ఎంతోమంది పెద్దలసేవ జేసి ఎన్నోగ్రంథముల జూచి, బోధలువిని చెప్పినవారివి వందమందివైనా ఒకటిగానే ఉంటాయి. అందుకే నేను అన్ని కలిపి వినిపిస్తున్నాను. ఏదేశమువారు యేజిల్లావారు యెప్పుడు కలుసుకోనివారు యేలా వ్రాసినారో విజ్ఞులైన మీరే గమనించండి.

పూర్తిగా అర్థమయ్యే లాగున శ్రీజనని గారు నైవేద్యము సమర్పిస్తారు.

**గీ॥ లక్ష్యముంచిన వస్తువే భక్ష్యమంచు భువిజనించిన వన్నియు భోజ్యములనీ చోద్యమౌ వస్తుచయమంత చోష్యమంచు లేక తోచినవన్నియు లేహ్యములని ॥ద॥ లేని నైవేధ్యమొసగేదా లీలామానుషా లేని భవలయనాశకా లేనిపై వస్తువులా లేని నీకొసగినాడ లేనివాడను నన్ను లేకుండాజేయుమయ్యా లేని నైవేధ్యమొసగేదా లీలామానుషా లేని భవలయనాశకా ॥**

స్వామీ సద్గురుదేవా! దేనియందు లక్ష్యముంచుచున్నారో ఆ గురువాక్యమునందు లక్ష్యముంచడమే మీకు భక్ష్యం. సృష్టిలో ఈ భువిలో ఎన్ని పదార్థాలు ఉన్నవో అవి అన్ని మీకు భోజ్యములే మీరు చవి చూడనివి

మీరు తిననివి, మీరు ఎంగిలి చేయునివి యేమైనా వున్నాయా పెద్ద చోద్యపడడానికి అన్ని మీరు ఎంగిలి చేసినవే కాబట్టి లేక తోచినవి అన్ని నైవేద్యములే. లేని నైవేద్యమును పెడుతాను. ఎందుకో తెలుసా నన్ను లేకుండా జేయాలి అని అంటారు.

## శ్రీమద్గురునకు మహానైవేధ్యం సమర్పయామి

**శ్లో॥ పానీయం శీతలం స్వచ్ఛం మద్యేమద్యేమయార్పితం**
**సుగంధయుక్తం మధురం పిబత్వం పురుషోత్తమ ॥**

శ్రీసీతయార్యులవారు -

***కం॥ బేదంబులదొలగించియు ఖేదమువోదంబులేని కేవలఆత్మ బోధనుదెలిపియు జన్మబాదను రాకుండజేయు ॥ద॥ పరమాపావనుడా మ్రొక్కెద పాదవనజాముల్ప్రొడా యీదరణిలోన పానీయముల్మీకిడితి ఆదరణజేసియు అవియూ గైకొనుమార్య పరమాపావనుడా మ్రొక్కెద పాదవనజాముల్ప్రొడా॥***

బేదములు లేకుండజేసి ఖేదమోదములు లేని కేవలాత్మ బోధను దెల్పి జన్మబాధలు లేకుండాజేయండి జననమరణముల వల్ల ఎంతబాదయున్నదో శ్రీ సీతయార్యులవారి మాటలువింటే అర్ధమౌతుంది.

శ్రీదుర్గానందులవారు -

***కం॥ మలములు యీషణ త్రయములు కులమును గోత్రంబు సూత్ర గుణవర్ణములన్ అలరుగ రోజ్ పన్నీటను కలయగ జేసియు నీరము ॥ద॥ కడుమోచముననూ చంచలమూ యీ జలపానమూనూ పలువిదములుగా బహుప్రబలేటి యెరుకాను మూలము లేని గుర్తెరిగే యీ సాక్షిని ॥మి॥ యేలదీని మోహమిడువిడు యేల నీకిది యనుచు కలతోకలిపి జూపినకమల నేత్రా నలవియౌన నిన్నుతింపను కడువోదముననూ చంచలమూ యీ జలపానమూనూ ॥***

గురుదేవా! మలములు యీషణములు అనగా- అణవమలము, మాయా మలము, కార్మిక మలము, దారీషణ, దనీషణ, పుత్రీషణ, కులము, గోత్రము, సూత్రగుణము, వర్ణములు అన్నిటిని రోజ్‌పన్నీరులను కలయగజేసి నీరము దెచ్చినాను మద్యమద్య త్రాగండి స్వామీ అని వేడుకుంటాడు. మరియు

పోలోజు వీరాచార్యులు కూడా ఇదే పద్ధతిలో -

గీ॥ కులము గోత్రవర్ణాశ్రమ కుటిలములును నేను నీవను బేదంబు దీనిలోనె నిమిడియున్నవి గనుక వీట్నెగురగొట్టి జలములను దెచ్చినాడ చంచలములేని ॥ద॥ వుదకముల పానమూ జేయుమూ తండ్రీ ముదముగల నీరమూ వదలజాలని భ్రాంతి వచ్చి హెచ్చినదెట్లో తుద కు లేకనేపాయుగద పరిపూర్ణములోన వుదకముల పానమూ జేయుమూ తండ్రీ ముదముగల నీరమూ ॥

ఆత్మబంధువులారా! పెద్దలందరి హృదయములు ఒకటిగానే యున్నవి. చూడండి కులము, గొత్రము, వర్ణము, కుటిలము, నేనునీవను బేదములు ఎగురగొట్టి ఉదకపానీయములను తెచ్చినాను పుచ్చుకోండి అంటాడు.

శ్రీమద్గురునకు మధ్యేమధ్యే వుదకపానీయం సమర్పయామి

శ్లో॥ సుపక్వాన్యనేకాని రంభాంమ్రమ జంభూసకర్జూర నారంగద్రాక్షాది
కానిత్వమేతాని సంగృహ్యాతాం స్వప్రకాశఫలాని ప్రదేయాని సర్వాణి తేజ్య ॥

శ్రీ సీతయార్యులవారు-

కం॥ కదళిపనసయునింబయు మధురంబగు చూతద్రాక్ష మరిఖర్జూరాల్ ముదమొప్ప జామనేరడి బదరులు ఇకనారికేళ ఫలములు గొనుడీ యర్పణజేస్తి భక్తితోగొనుడీ వ్యదదీరుకొరకు మీపదములపూజింప మదిసంతోషంబాయే మౌనివినుతాయిట్టీ ఫలములు గొనుడీ యర్పణజేస్తి భక్తితోగొనుడీ ॥

సద్గురుదేవా నావ్యద దీర్చుటకు, దీర్చుకొనుటకు మీ పదములపూజింప యిన్ని ఫలములు దెచ్చినాను ఫలహారము చేయండి అంటాడు సంతోషమనస్కుడై.

శ్రీజననిగారు-

**గీ॥ పృధివిమానవజన్మయే పెద్దఫలము గురునిపూజించుటన్నది గొప్పఫలము పూర్ణబోదనుపొందుటే పూర్ణపలము యనుచు దలచిత్రిపలముల నయ్యకిడుదూ ॥ద॥ ఫలమూల భుజియించుమా భక్తులందరా భ్రాంతిరహితుల జేయుమా కలదోచుమాయ ఫలమూ లిలదోచు బాయఫలము లెలమీ కులగోత్రమూల నలమీ బహుభ్రాంతి గూర్చు ఫలమూల భుజియించుమా భక్తులందరా భ్రాంతిరహితుల జేయుమా ॥**

సర్వాంతర్యామిఅయిన సద్గురుదేవా ! 83లక్షల 99వేల 999 జన్మముల తర్వాత ఈమానవజన్మ వచ్చింది ఇదిరావడము పెద్దఫలము వచ్చినతర్వాత యేదోవ్యాపకాలాలోబడి చావకుండా సద్గురునిజేరి ఉపదేశఅనుగ్రహమును బొంది పూజించుటయే గొప్పఫలము యికయేదోఒకగురువు ఓమంత్రము అనుకోకుండా నిజగురువుని జేరి పరిపూర్ణాచలబ్రహ్మమును యెరిగి యెరుకరహితమై యుండుటే పూర్ణఫలము. ఈ త్రిఫలములను అర్పించినాను హారగించి నాభ్రాంతులన్ని పటాపంచలుచేయండి తండ్రీ అంటాడు. భక్తుడు ఈవిధంగా అర్పించుతూరాగపూజవుతాడు.

శ్రీమద్గురునకు ఫలోపహార నైవేద్యం సమర్పయామి

**శ్లో॥ తాంబూలం గృహ్యతాంపూగీ ఫలకర్పూర సంయుతం**
**నాగవళ్ళీదళాద్యంతం గురుతుభ్యో మయార్పితం ॥**

శ్రీసీతయార్యులవారు -

**కం॥ మెప్పుగుజాజిలవంగము గొప్పగు యాలకులు జాత్రి కోరిక ఆకున్ కప్పుర విడెమని మీకును తప్పక నర్పిస్తిదీన్ని ॥ద॥ దయతో చేకొనుమీ దేశికనాదు తప్పులెన్నకుమీ యెప్పుడు మీస్మరణ యేమరకను జేయ తిప్పలు బాపీ మేలొప్ప బ్రోచినతండ్రీ దయతో చేకొనుమీ దేశికనాదు తప్పులెన్నకుమీ॥**

స్వామీ కోరికయనెడు ఆకులలో జాజిలవంగము జాపత్రి కుంకుమపువ్వు

మడచి విడియమిచ్చెద మీరుదయతో తీసుకుని నాతప్పులన్నీ మన్నించండి

శ్రీదుర్గానందులవారు-

**కం॥ సకలేంద్రియ సంగటమై నిఖరంబైవెలయుచున్న యీతను లైదున్ మీ కాకులుగా నుంచితి చీకాకులెన్నింటొన్గూర్చి ॥ద॥ చెక్కలు గాగన్ ప్రకృతి గుల్లసున్నముగాగన్ అకార ఉకార మకార ఓంకార యీ కారణములావే సుగంధద్రవ్యము మీకు ॥మి॥ విడియముగా జేసివుంచితినేకగుణ సమ్మేళన ముగా రాకపోకలు లేని మార్గము జేకొనుమని జెప్పుమయ్యా చెక్కలు గాగన్ ప్రకృతి గుల్లసున్నముగాగన్ ॥**

సకలేంద్రియములగు నిలయమైయున్న యీపంచతనువులను మీకు ఆకులుగా జేసి చీకాకులెన్నింటినో గూర్చి చెక్కలుజేసి ప్రకృతిగుణములన్నీ సున్నముగా ఉంచి అకార ఉకార మకార ఓంకార ఈకారణములన్నీ కాసుగా బెట్టి విడియమిస్తాను రాకపోకలు లేని మార్గముప్రసాదించండి ప్రభూ అంటాడు.

శ్రీపోలోజు వీరాచార్యులు కూడా

**గీ॥ సంకులంబనె యాకులో సర్వజగము వస్తులును జీవబేదముల్ వరుసదోచు నట్టిజాపత్రియాలకుల్ బెట్టికాసు సున్నములనుంచి మడచిన జూడుమిదియె ॥ద॥ గొనుము విడియంబునూ భయభ్రాంతూల దునుము జననంబూనూ మునుయేమిలేకనే డనుమాత్రములో దోచు తనువెరుకలును లేని వనిదెలిపి కడతేర్చ గొనుము విడియంబునూ భయభ్రాంతూల దునుము జననంబునూ॥**

సద్గురుదేవా సంకులములనే ఆకులు సర్వజగమవస్థలు, జీవభేధములు వరుసగా పోకలుజేసి నడినుడిని కాసుసున్నముగాను మునులేనిదానిని అనుమాత్రములో జూచి తనువెరుకల విడిపించ విడియమిచ్చెద అంటాడు.

శ్రీజననిగారు-

**గీ॥ అచలమందలి యాశలె యాకులంచు పుడమియందలి పోకడల్ పోకలంచు సోహంభావాది క్రియలెన్న సున్నమంచూ విడియమిచ్చెద నన్నునే**

విడుటకొరకు ॥ద॥ తాంబూలమును యిచ్చేదా అంబరచయ సంబావ నన్నుగూల్పగా బింబాదర్శన ప్రతి బింబాభాసన మిళిత కుంబా సంభవ గళిత దంబా చారములమాన్ప తాంబూలమును యిచ్చేదా అంబరచయ సంబావ నన్నుగూల్పగా ॥

చలనములేనట్టి అచలములో చలించే ఆశలు ఆకులుగాను, పృథివిపై నానడకలు పోకలుగాను, సోహంబావమను క్రియలు సున్నమని విడియమిచ్చెద నయ్యా నన్నువిడుటకొరకు నాధాంబీకాలు లేకుండా చేయుకొరకు తాంబూలము అర్పిస్తున్నాను అంటాడు.

## శ్రీమద్గురునకు తాంబూలం సమర్పయామి

శ్లో॥ సువర్ణోదర గర్భస్త్వం స్వర్ణబీజం మయార్పితం
అనంతపుణ్యదం స్వామిన్ తేగృహాణత్వ మచ్యుతం ॥

ఆత్మసోధరులారా మనము దక్షణములు గురుదక్షణ అనగానే ఒకరూపాయి, రెండురూపాయలు, ఐదురూపాయలు, పదిరూపాయలు, 50రూ॥ 116రూ॥ 1000రూ॥ యింకా యెన్నో సమర్పిస్తాం కానీ, వెలివర్తి రామబ్రహ్మం గారు ఏవిధంగా దక్షణ యిస్తారో చూద్దాం నేర్చుకుందాం ఆవిధంగా చేద్దాం.

పాట- అక్షయాత్మసద్ధర్మ గురుదేవా దక్షణార్పింతు మహానుభావా ॥అ॥

2. ధనముధాన్యాము తనువింద్రియములూ
   మనసుభూతతన్మాత్రా ప్రాణములు ॥అ॥

3. అష్టా బంధూలు అన్ని నీసొమ్మూ కష్టాపెట్టాకు కలవూ నాసొమ్ము ॥అ॥

4. దేహీ దేహముగల మోహములు అహమెరుకాత్మ అన్నీ నీపాలు ॥అ॥

5. నేనునాది సర్వమును నీదాయె అనాది బంధములు పోనాయె ॥అ॥

6. యెందారుండీన నేమి లేదాయె ముందువెనుకాను నీవెమాకాయే ॥అ॥

7. సర్వామర్పింతు నీకు సర్వేశా మర్మాముంచాకు మదియు విశ్వేశా ॥అ॥

8. నేను లేకాను నీవెనాకాయా నేను మేను మరిచితె తానె ఆయా ॥అ॥

9. లేనిమాయా లేకుండా జేయూమీ కాని మాయకాకుండా జేయుమీ ॥అ॥

10. యేమిలేనిదీ లేకనెపాయె రామదాసుకు జోకాలేదాయె ॥అ॥

11. అక్షయాత్మ సద్ధర్మాగురుదేవా దక్షాణర్పింతు మహానుభావా ॥అ॥

ఓఅక్షయస్వరూపాత్మ అనంతమైన సకలజీవులందు సకలవస్తువులందు పిపిలీకముమొదలు బ్రహ్మపర్యంతము వరకు అక్షయముగా నిండి యున్న గురుదేవా మీకు నాతనువు నాధనము, నాసంపద, నాబంధువులు దేహిదేహములందు గల మోహము, నేనునాది అనే సర్వము మీకర్పించు చున్నాను నాకు మర్మములుదాచక కష్టపెట్టక అహం, యెరుక అంతా అర్పించుచున్నాను కాబట్టి లేనిమాయను లేకుండా జేయగలరు కాని మళ్ళీ మాయ గాకుండా జేయండి తండ్రీ, యెందరుండీన యేమిలాభములేదు ముందువెనుకాల నీవే మాకు దిక్కు అని దక్షణ సమర్పిస్తాడు. ఇదేవిధముగా శ్రీసీతయార్యులవారు, వెంగళ కుమారాఖ్యులు, ఆగదాసులవారు, పోలోజు వీరాచార్యులు, దుర్గానందులవారు, సమర్పిస్తారు.

శ్రీమద్గురునకు సువర్ణపుష్పదక్షణాన్ సమర్పయామి

శ్లో॥ నీరాజనం మయాదత్తం రాజరాజేశపూజితం

గృహాణజగదుత్పత్తి హేతుభూతాఘానాశన ॥

శ్రీగురుసేవాదురందరులారా! శ్రీసీతయార్య ప్రభువులు అంటారు

కం॥ బంగారు పళ్ళెరంబున రంగగు యాదీపకళిక లందునజేర్చి పొంగుచు ముట్టించియునే మంగళముల్ నొసగెదాను ॥ద॥ మహనీయ్య దేవా గైకొను మోహరహిత సద్భావా శృంగారములును జెలంగ పాడుచు చుట్టు అంగాన మణులంతా హారతి నొసగిరీ మహనీయ్య దేవా గైకొను మోహరహిత సద్భావా॥

పరమప్రతివ్రతా శిరోమణులైన త్రిమాతలు లక్ష్మీ, పార్వతీ, సరస్వతీ మరియు తార, హాల్య, మండోదరి, ద్రౌపది, సీతాదేవి, అరుందతి, శశిదేవి, అనసూయ మొదలుగాగల ముత్తయిదువులు వచ్చి బంగారు పళ్ళెరం బట్టి ప్రేమతో హారతులిస్తున్నారు అందుకోండి అంటారు. తద్రీతిగానే శ్రీదుర్గానందులవారు

*కం॥ తను కర్పూరపుజ్యోతిని వినయముతో మీ సన్నిధి వెలిగిస్తికలన్ అనయము యెరుక పరములను గనిగనకుండంగ జేసె ॥ద॥ ఘనులగుమీకున్ హారతినిస్తి గొనునాల్గోతనువున్, పనిబూనినా జన్మమరణాములను మాన్పి వినివినక గనిగనక అని అనకయుండీన ॥మి॥ మనవి జేసుకొన్న నా మనవాలకించీ దీనుడానని కనులజూచీ కనికరముతో వునికిదెల్పి నేమనిరానీ ఘనులగుమీకున్ హారతినిస్తి గొనునాల్గోతనువున్॥*

యెరుకమరుపులనే పరమార్థమును కనికరముతో నామనవి ఆలకించి పరిపూర్ణ పరబ్రహ్మవునికిని జూపిన ఘనుడగు మీకు నాల్గవతనువును హారతినిస్తిని గైకొనండి ప్రభూ అంటాడు.

మరియు శ్రీ పోలోజు వీరాచార్యులు-

*గీ॥ దృక్కువను పళ్ళెరంబులో దృశ్యమనెటి కర్పూరము నేనుయగ్ని విగదయుమీరు నిట్టి కర్పూరములను బోధింగలముకు ముట్టజేసియు మీయెదుటబట్టి యిపుడు ॥ద॥ హారతియు నొసగెదా దేశికమంగళారతిదె వేడెదా యీ రీతిబోధ విచారించు గురుశిష్యులేరి యెరిగేటి యెరుకే పారిపోయిన వెనుక హారతియు నొసగేదా దేశిక మంగళారతి దేవేడెదా ॥*

సద్గురుదేవా! దృక్కుఅనే పళ్ళెరము దృశ్యమనే కర్పూరము నేనుయనే అగ్ని తమరు బోధించే ప్రభోదయే మంగళములో వేయించి నేనుమీరలు అదృశ్యమైనట్లుగా త్రోచి హారతినొసగుచున్నాను.

శ్రీమద్గురునకు కర్పూర మంగళ నీరాజనం సమర్పయామి

శ్లో॥ సుకేతకీపాటల పారిజాత చాంపేయకంజాత రసాలమల్లీకా
చామంతికా సంయుత మంత్రపుష్పం గృహ్ణామివిష్ణో శివశంకరాచ్యుత ॥

శ్రీసీతయార్యులవారంటారు-

కం॥ కరవీర మల్లెమొల్లలు సరసిజముల్ గోగుపత్రి సంపెంగలునూ మరిచెంగల్వలు కల్హర విరులివే యర్పింతు మంత్రా ॥ద॥ విధి పుష్పమంచూ గైకొను గురువే ముదమూను మించూ పరమాత్మ నిను జేరి ధరికి ముట్టిరి భక్తువరులెల్ల పరికించి మరినొసగిరిదెమంత్ర విధి పుష్పమంచూ గైకొను గురువే ముదమూను మించూ ॥

పరమాత్మా! మిముజేరి యెన్నోవేల మంది యీధరికిజేరినారు తుదముట్టినారు అందుకే ఈమంత్రపుష్పము నొసగుచున్నాను మహనీయదేవా అంటాడు.

శ్రీజననిగారు-

గీ॥ మంత్రమో తంత్రమో మాయో మందోమాకో యంత్రమో చింతయో లేక యెంతనిజమొ వింతయౌనట్టి యీభ్రాంతి నంతదీసి చింతలేనట్టి మర్గాము చెంతనిడిరి ॥ద॥ మంత్రాపుష్పము గొనుడయ్యా కుతంత్రమూల చేంతాకు చేరనీకయ్యా మంత్రాము పదియు రెండు మంత్రాము పదియునారీ మంత్రాముల్ రెండుగన నడమంత్రాపు మాయసున్నొ మంత్రాపుష్పము గొనుడయ్యా కుతంత్రమూల చేంతాకు చేరనీకయ్యా ॥

గురుదేవా నాకుయేమి తెలియనటువంటి మతిహీనున్ని నాకు తమరు మంత్రమో, తంత్రమో యేదో జేసి నాభ్రాంతులన్నీ పటాపంచలుజేసి చింతలేనట్టి మార్గమును అందించితిరి. కానీ ఒక్కమాట తండ్రీగురుదేవా తంత్రము యెంత జేసినా మంచిదే కానీ కుతంత్రము జేసితే నేను దరిజేరలేను ఈ కాలములో గురువులమని తిరుగుచున్నవారలు వారి ఢాంబీకమాటలు కుయుక్తులు, కుతంత్రములు పెద్దపెద్ద వాక్యములు కూసి ఒక్కశిష్యుణికి కూడా సరియైన బోధనందించి పదిమందికి పనికొచ్చేవాన్ని చేయడంలేదు. ఒకవేళ ఆశిష్యుడు పదిమంది పెద్దలతో తిరిగి వారిసేవలు జేసి బోధనేర్చుకొని ఒకప్రచారకుడుగా

అయినాడంటే వాని జూచి గురువులు ప్రక్కన పెట్టేస్తున్నారు. కాబట్టి కుతంత్రము చేయవద్దు అంటాడు.

శ్రీఆగదాసులవారు -

**గీ॥ వున్నదే ద్వాదశాక్షరి వుత్తబయలు లేనిదే షోడశాక్షరి లేనినేను నమ్మినమ్మక నమ్మితే నాదువునికి పూజలో పూజ పూజాయె పుణ్యపురుషా ॥ద॥ మంత్రా పుష్పంబునూ బెట్టితిననూ్న మరచి పోకుండనూ మంత్ర తంత్రములన్నీ మాయమాట లనుచు తంత్రముచే నన్ను తప్పదీసినస్వామీ మంత్రా పుష్పంబునూ బెట్టితిననూ్న మరచి పోకుండనూ ॥**

యెపుడు యేకాలమునందూ వున్నటువంటి ద్వాదశాక్షరి, యెన్నడు యేకాలమునందు లేనటువంటి షోడశాక్షరి నమ్మినమ్మక నిలచితే పూజలో పూజాయె పుణ్యపురుషా ఇది మంత్రపుష్పముగా సమర్పిస్తాను అంటాడు. మరియు పోలోజువీరాచారి గూడా ఇదే పద్ధతిలో -

**గీ॥ ద్వాదశిది తప్ప ప్రతియేమి లేదటంచు బలుకుచుండెను షోడశి భావమూల మెరుగు యీగుర్తు నాస్తియింకేమిలేదు యనిన యిది మంత్రపుష్పము యనుదలచి ॥ద॥ పెట్టితిని గాంచుమీ యెరిగిన యెరుక వట్టిదాయెసుమి పొట్టిపొడుగులులేని బట్టాబయలును దెలిసినట్టి గోప్యము గూడనగుబాట్టె పాయెరుక బెట్టితిని గాంచుమి యెరిగినయెరుక వట్టిదాయెసుమీ ॥**

అయ్యా ఈ ఉత్తబట్టబయలుదప్ప యితరమింకేమియులేదు మూలము లేని ఈగుర్తెరిగే శరీరముయేమిలేదు. అని విచారించగ యెరిగిన యెరుక వొట్టిదైపాయె సుమీ అసలైన మంత్రపుష్పమిదె స్వామీ అంటాడు. ఈవిధంగానే దుర్గానందులవారు మంత్రపుష్పము సమర్పిస్తారు. కావున ఇక్కడ

శ్రీమంత సాయనార్యులవారు పాట చరణములో **మాటయె మంత్రంబాయెగా మాటైన మంత్రమే మాటాలేదాని తెలిపేగా మాటమంత్రము లొకటియనియెడి మాటలేని పరమునందున మాటమంత్రము లేని మర్మమే మంత్రపుష్పసమర్పణంబని ॥పూజాజేయగబూనితి॥** అనగా మంత్రములన్ని మాటలే, మాటలే మంత్రములు యేలాగనగా ఏకాక్షరి, ద్వితీయాక్షరి, తృతీయాక్షరి, చతురాక్షరి, పంచాక్షరి,

షడాక్షరి, సప్తాక్షరి, అష్టాక్షరి మొదలు కొని ఎన్నోవిధముల మంత్రములు మనము వాక్కుతో ఉచ్చరిస్తుయుంటాము. ఉదా॥ నమఃశివాయః అన్నాము అర్థము యేలాగ నమస్కారమయ్యా శివుడా అనిఅర్థం. ఓం నమశివాయః ఓ శివుడా నమస్కారమయ్యా అంటే మాటనేగదా, అందుకే మాటయే మంత్రము నారాయణ అన్న, ఓంనమో నారాయణాయ అన్న మాటలే -నమస్కారమయ్యా నారాయణ అనిఅర్థం. విజ్ఞులు గమనించాలి.

## గురువాక్యోపనిషత్

శ్లో॥ ఖంవాయుర్జోతిరపః పృథ్వీవిశ్వస్యధారణే
యత్పరం బ్రహ్మ సర్వత్ర విశ్వస్య యతనం మహత్ ॥
సూక్ష్మాసూక్ష్మ తరం నిత్యం తత్వమేవత్వమేవ తత్

శ్లో॥ జాగ్రతస్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే
తద్బ్రహ్మ హమితిజ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే

శ్లో॥ యో వేదాదౌస్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య యఃపరస్య మహేశ్వరః ॥

శ్లో॥ ద్రష్టదర్శన దృశ్యానాం విరామో యత్రవాలభేత్
దృష్టిస్త త్రైవకర్తవ్యా ననాసాగ్రావలోకనే

శ్లో॥ అంతఃపూర్ణం బహిఃపూర్ణం పూర్ణకుంభ మివాంబసే
అంతః శూన్యం బహిశూన్యం శూన్యకుంభ మివాంబరే

శ్లో॥ ఈశాన స్సర్వవిద్యానాం మీశ్వర స్సర్వభూతానాం
బ్రహ్మాదిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మాశివోమె అస్తుసదాశివోం ॥

శ్లో॥ వాక్పూర్ణ సహనావ్యాయం భద్రం కర్ణేభిరేవచ
పంచశాంతీః పఠేద్యాదౌ పఠేద్వాకానంతరం ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

శ్రీమద్గురునకు దివ్యసువర్ణమంత్రపుష్పము సమర్పయామి

**శ్లో॥ జన్మాంతరకృతాన్యాని యానిపాపానిమే ప్రభో**
**నశ్యంతుతేతానితాని ప్రదక్షణ పదేపదే ॥**

శ్రీకృష్ణప్రభువులవారంటారు- తండ్రీ గురుదేవా నేను ఈజన్మములో యున్నంతవరకుమీకు కృతజ్ఞుడను. జన్మజన్మాంతరములనుండి చేసిన పాపములు ఒకసారి పటాపంచలు చేసి రక్షించినందుకు ఎప్పుడు మళ్ళీ మళ్ళీ పదేపదే ప్రదక్షణలు చేస్తూనే వుంటాను.

శ్రీసీతయార్యులవారు అంటారు-

***కం॥ అక్షయబోధను దెల్పియు ముక్షువు బంధంబు మాన్పి ముందుగ వీన్నిన్ రక్షించి బ్రోచినాడవు అక్షంతలన్ వేసినే ప్రదక్షాణల్ జేతూ సద్గురుదేవా దీక్షాలన్ బాపూ యీక్షితిలో మిము మించ యెవరి గానము గురవె అపరోక్షమార్గము దెల్పి రోశించె యెరుక ప్రదక్షణల్ జేతూ సద్గురుదేవా దీక్షాలన్ బాపూ ॥***

ఓ అశ్రిత భక్తజనమందారా ముముక్షజన కల్పతరువా నేనుయెప్పుడు ఈజననమరణ బంధంనుండి నానా విధములైన గర్భనరకములనుండి యెప్పుడు బయటపడవేస్తావు తండ్రీ తీవ్ర మోక్షాపేక్షగల ముముక్షువును ఒకసారి గట్టుపైన వేసితివి రక్షించి నాకు అపరోక్షమైన ఆపరమపదమును అందించిన ప్రభో మీకు సాటి యీచితిలో యెవరూలేరు. మిమ్ములపొగడడానికి తమగానం చేయడానికి యెవరూ చాలరు కనుక మీకుప్రదక్షణముజేసి కృతార్థుడనయ్యోదను అంటాడు.

శ్రీ వెంగళ కుమారాఖ్యులు అంటాడు-

*గీ॥ హృదయగ్రంథినిమాన్పియు వుచితమైన కైవల్యపరతేజంబు గలుగజేసి సత్యమునుగానిమాయ సమూహమంత తడవుచేయక విడజేయు ధన్యచరితా ॥దర్వు॥ త్రికర్ణశుద్ధితోనూ ఆత్మప్రదక్షణం బికజేతుశ్రద్ధతోనూ వికటమైనమాయ సకలాకోరికలన్ని నీకర్పణముజేతూ నిఘమూగమవేద్య త్రికర్ణశుద్ధితోనూ ఆత్మప్రదక్షణం బికజేతుశ్రద్ధతోనూ ॥*

స్వామీ నాటినుండి నేటివరకు బాధపెడుతున్నా హృదయగ్రంధిని వికటమైన

మాయను విడిపింపజేసి కైవల్యపరతేజమైన వెలుగును ప్రసాదించిన నిగమావేద్య త్రికరణశుద్ధితో మీకు ప్రదక్షణలు జేసెద అంటాడు. ఇక జనని గారు, ఆగదాసులవారు, దుర్గానందులవారు ఈ భావములో ప్రదక్షణలు సమర్పిస్తారు.

శ్రీమద్గురునకు ఆత్మప్రదక్షిణ నమాస్కారాన్ సమర్పయామి

**శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా తపఃపూజా క్రియాదిషు**
**న్యూనంసంపూర్ణతాంయాన్తి సద్యోవందేతమచ్యుతం**

నాయనలారా ఇంతవరకు సద్గురుదేవునికి యెందుకు పూజలు జేసినాడో యేబాధవుంటే మ్రొక్కి పూజలుజరిపినాడో అట్టి బాధ చెపుతాడు

శ్రీజోష్యుల జననయ్య గారు.

***గీ॥ యెన్నికడుపులు కాల్చుట కేగినానో ఎన్ని కడుపులు కాల్చనే నేగవలెనొ మన్నులోనేను గలియక యున్న యపుడె మిన్నుపై మిన్న జూపియీ నన్నుమాపు ॥ద॥ కన్నయ్యా నన్నుబ్రోవరా కపటంపు రాక పోకాల కాల్చి వేయారా నిన్నూనే గన్నవేళ యెన్నాటి పూజఫలమొ ఉన్నపూర్ణము జూపి ఉళ్ళుక్కేరుకాను మాపి కన్నయ్యా నన్నుబ్రోవరా కపటంపు రాక పోకాల కాల్చి వేయారా ॥***

సద్గురుపరమాత్మా! యెంతమంది తల్లుల కడుపులు కాల్చినానో యెంత మంది తల్లుల కడుపులు కాల్చ యింకాయేగవలెనో నేను జీవించియుండగానే అనగా మన్నులో మట్టిలో నేను గలియకముందే మిన్నుపై మిన్నుజూపి అన్నింటికంటే గొప్పది అంతటా ఉన్నటువంటిది దాన్నిజూపి నన్ను మళ్ళీ పుట్టకుండా చావకుండా జేయండి ప్రభూ మిమ్ములజూచి కన్నవేళ యెట్టిదో ఎన్నిజన్మలపుణ్యమో యెన్నినోములు, యెన్నివ్రతాలు, యెన్ని పూజల ఫలమో తండ్రీ ఈనాటికి సంపూర్తిఅయ్యింది. మీకు సర్వోపచార పూజలు చేస్తాను అంటాడు. శ్రీవెంగళ కుమారాఖ్యులు అంటాడు.

**గీ॥ భావముల కందరానుత్త బట్టబయలు యేవిధంబుగనెరుగుదును నేనుమాయ నేనుదెలసినది నాతోటే లేనిదాయె అశరీరస్థితిపరునిజేయు గురుడా**

**॥దర్వు॥ సర్వోపచారంబులా పూజలునిత్యా నిర్మలంబుగను చాలా ధర్మోపదేశము దయతోదెలసిప్పుడూ నిర్మోహస్తునిజేయు నిశ్చయముగతండ్రీ సర్వోపచారంబులా పూజలునిత్యా నిర్మలంబుగను చాలా ॥**

స్వామీ సద్గురుదేవా తననితరమెరుగని బట్టబయలును నేను యెరుగుదును యెరిగినాను అను మాటలు పనికిరానివి నేను తెలిసినది అంతా మాయ యెందుకు నేను మాయ కాబట్టి నేను తెలిసినది నాతోటే లేనిదాయె అశరీర స్థితిపరుడుగా జేసి రక్షించండి మీకు సర్వోపచార పూజలు చేయుచున్నాను. అంటాడు. అయితే ఇది సాధ్యమా? అంటే సాద్యమే ఏలా

శ్రీమంత సాయనార్యులవారంటారు

**పాట చ॥ శరణూశరణన్నవారికినీ మరణంబు లేదని మర్మమెంచి చూడగా మదినీ శిరముకరముల శరణుజేసిన మరణమెన్నడు మానిపోదని శరీరమందశరీర పదమును యెరిగియెరుగుటే శరణు ఫలమని ॥పూజా॥**

అయ్యలారా ఆత్మబంధువులారా మన వాడుకలో ఒకవిధమైనటువంటి మాటవున్నది అది యెవరన్న నిందించిన కోపపడిన తిట్టిన, పెద్దమనుషులు నాయనా శరణన్నవారికి మరణములేదురా అంటే అన్నాడులే పరవాలేదు పడివున్నవారికి మంచిదే అని అంటారు. ఆవిదంగానే శరణన్నవారికి మరణముండదని నమ్మి యెంతమంది దేవతలకు స్వాములకు గురువులకు శరణుజేసిన మ్రొక్కిన మరణము మానిపోదు, నొసలంత అనగా లలాటము అరిగేదాకా మ్రొక్కిన ఒళ్ళంతా అరిగేదాకా పుణ్యనదులలో స్నానంబులు జేసిన కాళ్ళన్ని అరిగేదాకా తీర్థయాత్రలు తిరిగిన మరణం మానిపోదు. మరణించడం అంటే చావడం. చావకుండా ఎలావుంటాం పుట్టినవారందరూ తప్పక గిట్టడము మానదు. మంచిమంచి గొప్పగొప్ప అవతారమూర్తులు సైతము మరణించినారు కృష్ణుడు, రాముడు, రంగడు, గురువులు, ఋషులు, సిద్ధులు అందరూగూడ చచ్చిపోయినారు. కాబట్టి చావకుండా ఉండాలంటే ముందు పుట్టకుండా ఉండాలి. పుట్టకుండా ఉండాలంటే మందు తినాలి. నిజగురువులజేరి 43 మాత్రల ఔషదము సేవించితే గురుసేవలు జేసి గుర్వాజ్ఞకు బద్దులై యుంటే

శ్రీ గురుమూర్తి కరుణించి అచలపరిపూర్ణపరబ్రహ్మమును సూచన ద్వారా కనుసౌంజ్ఞచే తెలియజేసి చూపిస్తారు. అట్టిపదార్థము అట్టివస్తునిశ్చయము అరనిమిషము పొందితివా నీకు చావులేదు. పుట్టుకలేదు అనగా శరీరముండగానే శరీరంలేనట్టి వస్తువును తానుండగానే తానులేనట్టి స్థితిని పొంది శరణుజేసితే ఫలము ఉంటుంది అంటాడు.

## శ్రీమద్గురునకు సర్వోపచార పూజాన్ సమర్పయామి

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన
యత్పూజితం మయాదేవం పరిపూర్ణం తదస్తుమె ॥

శ్రీగురుభక్త సోధరులారా ఇదిచివరి శ్లోకం ఇందు అనంతమైన అద్భుతమైన అర్థమున్నది పూర్తిగా తెలియపర్చలేను గాని, కొంచెము రెండుమాటలు చెపుతాను. సద్గురుదేవా ఈ సృష్టిలో అంతులేని మంత్రములు ఉన్నవి. నమకములు, చమకములు, రుద్రములు, శ్రీసూక్తము, పురుషసూక్తము, ఖడ్గమాలలు, సప్తకోటి మంత్రములు ఎన్నోరకముల మంత్రములు, యక్ష మంత్రములు, వశీకరణ మంత్రములు, పరకాయ మంత్రములు, ఇంకాయెన్ని వున్నా సుస్వరంగా వల్లించి పూజలుచేసిన తమరు జెప్పినమంత్రముతోటి ఏవి సరికావు. స్కాందపురాణములో రేవాఖండమునందు చెప్పబడు గురుగీతలో పరమేశ్వరుడు పార్వతీదేవితో యిలా అంటాడు.

శ్లో॥ సప్తకోటి మహామంత్ర చిత్తవిభ్రమకారకాః
ఏక ఏవపరోమంత్ర గురురిత్యక్షర ద్వయం ॥

గురుమంత్రముకన్నా చిన్నవి హీనము అనగా తక్కువ అని అర్థం. సప్తకోటి మంత్రములు చిత్తాన్ని చలింపచేసేవి, భ్రమలో పడజేశేవి, గురుమంత్రము యేలాంటిది అంటే -

శ్లో॥ సంసార సాగర సముద్రనైక మంత్రం
బ్రహ్మాదిదేవ మునిపూజిత సిద్ధిమంత్రం
దారిద్ర్యదుఃఖ భవరోగవినాశ మంత్రం
వందే మహాభయహరం గురురాజమంత్రం ॥

సద్గురుదేవా తమరిమంత్రము యెంతగొప్ప పనులుచేసేది అనగా ఘోరమైన సంసారజలధిని దాటింపజేసేది బ్రహ్మాదిదేవతలు ఋషులు మునులు, పూజించి సిద్ధిపొందిన మంత్రం సర్వదారిద్ర్యములను పాగొట్టేది, సర్వదుఃఖములను నివారింపజేసేది, భవరోగములను వినాశనము జేసేది మంత్రములలో రాజైన మంత్రము గురుమంత్రము కాబట్టి మంత్రహీనం అన్నారు. క్రియాహీనం - ఇదికూడా తక్కువే సర్వసృష్టిని ఏర్పరచి సప్తసముద్రములు, యెన్నో పుణ్యనదులు క్షేత్రములు పర్వతములు, వృక్షలతాధికములు, సమచతుర ప్రదేశములు, కనిపించిన మీ క్రియ చాలా గొప్పది. కొన్నిపూలతో అలంకారణ జేసి లైటుపెట్టితే సరిపోలేదు స్వామి అందుకు హీనం. భక్తిహీనం- ఇది మరీ తక్కువ తమ భక్తులలో విచారించిచూసినప్పుడు తండ్రీ నారదుడు ధ్రువుడు, పుండకరీకుడు, అంజనేయుడు, ప్రహ్లాదుడు, యీలాగున శివరామదీక్షితులు, కృష్ణప్రభువులు, లక్ష్మణప్రభువులు, శంకరప్రభువులు, అవదూతస్వామి శ్రీసీతయార్యులు మొదలగాగల వారందరి భక్తిప్రపత్తులలో ఒక బాగమునకు పనికి రాదు నాభక్తి. దేశికేంద్రా మీరు ఎల్లప్పుడు పూజనీయులే పరిపూర్ణులు కాబట్టి నేను తక్కువజేసినాననిగాని ఎక్కువ జేసినానని గాని కించబోక నన్ను ఆశీర్వదించి ఎప్పటిలాగానే ఉండండి తండ్రీ మీకు నావందనములు అంటాడు. తర్వాత సద్గురుమూర్తి సంతోషమనస్కుడై దీవించి ఆశీర్వదించి, అనుగ్రహించి, ఆ ప్రియశిష్యునికి పాదతీర్థం ఇస్తాడు.

*శ్లో॥ అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం*
*జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ ॥*

పరమభక్త గ్రేసరులారా సాదారణముగా మనము ఏ దేవాలయమునకు గాని ఏదేవతా పూజకుగాని వెళ్ళినపుడు అక్కడ తీర్థం ఇస్తారు. అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారిణం శ్రీపరమేశ్వర పాదోదకం లేక శ్రీఆంజనేయ పాదోదకం పావనం శుభం అంటారు. కాని శ్రీమద్భాగవత కృష్ణదేశికప్రభువులవారు ఏవిదంగా తీర్థం ఇస్తున్నారు అజ్ఞానమూలహరణం అనగా- అజ్ఞానానికి మూలం జ్ఞానం , జ్ఞానానికి మూలం అజ్ఞానం ఈరెండు లేకపోవాలి హరించిపోవాలి జన్మకర్మనివారణం జన్మకుమూలం కర్మము, కర్మకు మూలం జన్మము, ముడిబడి కర్మము, జ్ఞానము, విడువకనారెండు వెలసె

విశ్వమనునదె అంటాడు ఈ రెండులేకుండా పోవాలి నివారణం జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం అనగా అజ్ఞానంతో కూడిన వైరాగ్యములు, అనంతముగా యుంటావి. కాని, జ్ఞానముతో కూడిన వైరాగ్యము కలగడము చాలా కష్టము. ఒకపనికావాలి అని యెన్నో శ్రమలు పడతాడు. అదికాదు యింకేదో కావాలిఅనుకుంటాడు. నాకు ఈసంవత్సరము 50లక్షల వ్యాపారము కావాలనుకుంటాడు. కానీ, జరుగదు. ఈ ధాన్యములో బాగా లాభం రావాలి అనుకుంటాడు. కానీ రాదు,బార్యభర్తలు యేమో అనుకుంటారు. గొడవపడ్తారు, తండ్రీకొడుకులు, తల్లీకూతుళ్ళు, అత్తకోడళ్ళు, కయించుకొని పైన అనుకున్న పనులుగాక మనస్తాపంకు లోనై అన్నిటికి గురుపరమాత్మ ఉన్నాడు ఆయన కరుణలేదు కాబట్టి ఏదికాలేదు. అని తెలుసుకొనే జ్ఞానము లేక అజ్ఞానము ఆవరించి వైరాగ్యము కలిగి కొందరు విషము పుచ్చుకుంటారు. కొందరు ఉరి వేసుకుంటారు, మరికొందరు ఇల్లువిడచి, కుటుంబమును విడిచి, వెళ్ళిపోవడము జరుగుతుంటాయి. ఇవన్నీ అజ్ఞానముతో కూడిన వైరాగ్యములు, కాబట్టి ఓ ప్రియమైన భక్తుడా నీకు జ్ఞానముతో కూడిన వైరాగ్యము సిద్ధిస్తాది. ఈ పరమపావనమైన గురుపాదోదకము వలన జ్ఞానవైరాగ్యసిధ్యర్థం గురుపాదోదకం పిభేత్ -అంటే పుచ్చుకోండి, త్రాగండి, సేవించండి, అనగా ఏవిధమైన ధనముగాని విద్యాగాని, బలముగాని, పేరుప్రఖ్యాతులు అన్నియుగూడ గురుకరుణచేతనే జరుగుతాయి అని తెలిసి నిమిత్త మాత్రముగా నాకర్తవ్యము చేస్తాను అని మెలగడమే మనవిది. ఇదియే జ్ఞానసంపద.

ఈవిధముగా తీర్థము తీసుకుని గురుపూజ ముగించుకుని సద్గురుమూర్తికి సేవలు చేస్తూ నిత్యము భోజనతాంబూలాలు అందిస్తూ త్రికాలములయందు వారి ప్రభోధనము వినుచూ లాలిపాటలతో, జోలపాటలతో, పవళింపులు చేయుచూ ప్రభాతవేళలో మేలుకొలుపులు పాడుచూ స్నానభుక్తులు సలుపుచూ ఉండి రెండురోజులు గాని, మూడురోజులు గాని ఆయన యిష్టమే కాబట్టి గురువుగారు పోయేటప్పుడు వారి చేతికి వారిసామానులు బ్యాగు గాని, పెట్టెగాని, గొడుగు గాని యిచ్చి సాగనంపేటప్పుడు ఈవిధంగా శ్లోకం అంటాడు-

శ్లో॥ *గచ్ఛాద్యపునరాగచ్ఛ మామకాభిష్టసిద్ధయే*
*గురోర్యః కృపాయవీక్ష్యా పూజాంస్వీకురుమత్కృతం ॥*

తం(డ్రీ ఓస్వామీ ఓపరందామ హే(ప్రభూ ధీనుడనైన నామీద కృపవుంచి ఇప్పుడు ఏవిధంగా నాగృహమునకు, నా(గామమునకు, వచ్చి నన్ను నాగృహమును పావనం చేసి పోవుచున్నారో ఇదే విధముగా మళ్ళీమళ్ళీ (పునరాగచ్ఛ) అంటే రావాలి. మా అభీష్టములన్నీ మా కోరికలన్నీ సిద్ధపరచి నేరవేర్చి పోవుచుండాలి గురువరేణ్య తమకృపా కరుణాకటాక్షములు మాయందు ప్రసరింపజేసి, వీక్షింపజేసి (పూజాం స్వీకురుమత్కృతం) మేము జేయు ఈచిన్ని పూజలు స్వీకరించుచు యుండాలి. మమ్ము ఆశీర్వదించుచూ యుండాలి అని ప్రార్థిస్తాడు. కానీ మనవారలు భక్తులు కొందరు గురువులు కూడా పూజలు చేసేటప్పుడు మంగళహారతి కూడా ఇవ్వకుండా ముందుగానే పై శ్లోకమును చదివేస్తారు. కారణం- వారలకు శ్లోకార్థం తెలియకనే. సరే మనపెద్దలు దయగలవారలు కాబట్టి సవరించి సరిపెట్టుకుంటారు. కాని బయటపూజచేయు పరిసర ప్రాంతంలో ఆ గ్రామంలో, ఆపట్టణంలో యెంతోమంది పండితులు జ్ఞానులు ఉంటారు. వారు హేళనచేస్తారు వీరికి ఏమితెలియదు కనీసం మంగళహారతికూడా ఇవ్వకుండా గురువును సాగనంపుచున్నారు యని నవ్వుకుంటారు. కనుక మనము సరియైన విధముగా పెద్దలవద్ద కూర్చొని విని, నేర్చి పూజలు చేయాలి. కావున విజ్ఞులు గ్రహించెదరుగాక. ఇక మంగళహారతికి వెలుదాము.

## మహా మంగళారతి

1. శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున ప్రాకటంబుగ హరికి భానునకును ఏకముగ వెలిగేటి యాజ్ఞవల్క్యకి మరియు జోకతో రాజఋషి జనకపతికీ జయా జయ మంగళం నిత్య శుభమంగళం జయతు జయ మంగళం మహోత్సవ మంగళం

2. శుద్ధతత్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య సద్ధర్మమార్గుడౌ సాందీపునకు సిద్ధముగా పూర్ణుడౌ శ్రీకృష్ణమూర్తికిని ఒద్దికతో అర్జున యుద్ధవులకూ...............॥జయ॥

3. శ్రీమించి వెలిగేటి శ్రీధరస్వామికి ధీమించు శివరామ దీక్షితులకు కామితార్థము లిచ్చు ఘన అప్పబ్రహ్మముకు వేమారు శ్రీసీతరాములకునూ .....॥జయ॥

4. పరిపూర్ణబోధను ప్రకటపరచిన యట్టి వరభాగవత కృష్ణ గురునకిపుడు

నిరతంబు పరతత్వ మెరిగించు ఫీల్ఖాన వర లక్ష్మణాప్రభు చరణములకూ .....॥జయ॥

5. స్థిరమైన ఓంకార గురుపరంపరయందు పరిపూర్ణ సిద్ధాంత భావములనూ నిరతమూ భక్తులకు కరుణతో బోధించు గురుడు నిత్యానంద సీతయార్యులకు .......॥జయ॥

6. భాగ్యశాలులయ్యి బాధలనుపోగొట్టి బాగుగ అచలంబు బోధజేసీ భోగ మహేశ్వర పురమందు నివసించు నాగుల రామలింగార్యులకును........॥జయ॥

7. మాయతనువుయనుచు మర్మంబుదెలిపిన సాయనార్య ప్రభు చరణములకు అతీతమైయున్న అచలబోధను దెలిపె మోతె కృష్ణయ్యార్యులకును......॥జయ॥

8. దేహగుణముల బాసి త్రివిదబావము జూపి దేవదేవుడైన దేశికుండు దేహి దేహములేక విదేహుడై యుండె దేవగురునాగులెంకటేశ్వరులకు......॥జయ॥

9. భయంభ్రాంతులను దీసి భ్రమలెల్ల దొలగించె నిర్భయానంద బుచ్చయార్యులకునూ అభయప్రధానుడై అచలబోదనెరుగు నిర్గుణుడు నారాయణార్యులకునూ ॥జయ॥

10. మీకు మూలముగాక మాకు మూలములేక లోకలోకములెల్ల యేకముగను ప్రాకటంబైయున్న పరిపూర్ణబ్రహ్మమును జోకతోదెల్పు గురుపీఠమునకు. ....॥జయ॥

11. వేదాంతసభలందు వేడ్కతో ధర్మోపన్యాసములుజేయు బులుబోధ్యులకును బోధాధికారమును పొందిన అచలగురు పీఠాధిపతులకూ పీఠమునకూ....॥జయ॥

"ఆత్మ సోదరులరా! మనము మంగళహారతి పాటలు పాడేటప్పుడు మా గురువు పేరు రావాలి ఫలానా గురువు ఫలానా గురువు పేర్లు రావాలి అట్టి చరణమునరాక తికమక పడుతూ గోలగోల చేసుకుంటాం కదా! నిజముగా మాతృమూర్తులు శ్రీమతి శేషమాంబ గారు, శ్రీమతి తల్లావజ్ఝల జాలమాంబ గారు నిజమైన గురునకు మంగళహారతి ఇచ్చినారు అది వినండి. గ్రహించండి."

## మంగళహారతి-1

నిర్వికారాయ సకల నిత్యముక్తిదాయకాయ నిర్గుణాయ నిర్మలాయ నిత్యమంగళం ॥నిర్వి॥

సగుణనిర్గుణ రహితాయ సంకల్పవర్జితాయ - సర్వసాక్షితీతునకు సత్యమంగళం ॥నిర్వి॥

సత్తుచిత్తునమనిపాయె శత్రుసంహారణాయు వత్తిలేని దీపమునీ కిత్తుమంగళం ॥నిర్వి॥

చేష్టలన్నిఉడిగిపాయె జేశెదేమి లేకపాయె శేషమ్మమనసంలోన చేరెమంగళం ॥నిర్వి॥

పరిపూర్ణాయ సకల భవ్యదివ్యరూపాయ పరశురామాయ సీతరామ మంగళం ॥నిర్వి॥

నిర్వికారాయ సకల నిత్యముక్తిదాయకాయ నిర్గుణాయ నిర్మలాయ నిత్యమంగళం ॥నిర్వి॥

## మంగళహారతి-2

గురునకు మంగళమనరమ్మా । మ । ద్గురుమూర్తిని గనుగొనరమ్మా తరుణులార యీతనికిభక్తితో మురయుచు మ్రొక్కిన మోక్షముచేకురు ॥గురు॥

క్షరపురుషుండనరాదమ్మా అ క్షరపురుషుండనగాదమ్మా క్షర పురుషాక్షర పురుషుల కావలి పురుషోత్తముడనబరగినమాయీ ॥గురు॥

క్షేత్రజ్ఞుండనరాదమ్మా యీ క్షేత్రమతండనగాదమ్మా క్షేత్రజ్ఞని తత్ క్షేత్రంబును యే మాత్రము దగులక పాత్రుడైన యీ ॥గురు॥

స్మరణ రూపుడనరాదమ్మా వి స్మరణరూపుడనగాదమ్మా స్మరణలేక విస్మరణ గాక త త్స్మరణ విస్మరణలెరుక లేనియీ ॥గురు॥

దేహియనుట కనరాదమ్మా యీ దేహమంతడనగా-దమ్మా అహంభావన కంటుసొంటులగు దేహిదేహముల తెరువుబోని యీ ॥గురు॥

పిండ రూపుడనరాదమ్మా బ్ర హ్మాండరూపుడనగాదమ్మా పిండాండ

బ్రహ్మాండ భాండముల నిండియుండి యవిరెండుగాని యీ ॥గురు॥

జ్ఞానియనుట కనరాదమ్మా అజ్ఞానియనుటకది లేదమ్మా జ్ఞానజ్ఞానాములోన నొక్కటియు తానుగాక శూన్యానాకి మీరిన ॥గురు॥

యోగియనుట కనరాదమ్మా మరి భోగియనుట కనగాదమ్మా యోగి భోగి వుద్యోగములంటని భాగవతాన్వయ భవకృష్ణుండనే ॥గురు॥

మేలుకీడులనరాదమ్మా యే మేలుకీడు లదిగాదమ్మా కాలకూటమున కన్న మిక్కిలగు జాలమూంబవెత క్షణములో బాపిన ॥గురు॥

శ్రీమతి అమలాంబ కేశోజు రాములమ్మ గారు తమ గురుదేవులకు యిచ్చిన మంగళారతి పాట-

## మంగళహారతి-3

1. మంగళము జయమంగళము శుభమంగళము మద్గురుస్వాములకూ
మంగళమని మీరంగనలందరు సంగంబై వెంకటేశుని ముంగీట
॥మంగళము॥

2. అచ్ఛమైనదీ సద్గురువాక్యము సాక్షిగదెల్పిన స్వాములకూ
స్వచ్ఛంబైన దీక్షితబోదని నిశ్చయముగ సచ్ఛిశ్యులకిచ్చి ॥మంగళము॥

3. భయమునులేదనీ భవములుదులిపినా నిర్భయుడగు మాగురుస్వాములకూ
పాయక పరిపూర్ణంబును జూపిన ద్వయరహితుండగు దయానందులకూ
॥మంగళము॥

4. అంతటనుండియు ఆదిమధ్యము అంత్యములేని స్వాములకూ
మంతనమున సుంతైననువెరువక చింతలుదీర్చే శాంతునకూ ॥మంగళము॥

5. ఓంకారంబనే హంకారంబుకు అంకెలుదీసే స్వాములకూ
సంకటహారణుడూ శుకవంశీకుడు శంకలుబాపే వెంకటేశునకూ
॥మంగళము॥

6. ప్రాగార్ధచరమార్ధయోగములు సంయోగములు గావించీ । ఆగమ నిగమంబుల మధితార్థముల నెరిగిన నాగులవంశోద్భవునకూ ॥మంగళము॥

7. యీషణవాసనదోష గుణంబుల దీసివేయుమాస్వాములకూ
విష్ణుమూర్తిగురు విష్టదైవమను కృష్ణాయార్యుల శిష్యారత్నముకూ
॥మంగళము॥

8. కల్లాయుగములో యెల్లలోకములు యెరిగితిరిగి నాస్వాములకూ
చిల్లరమాటలు స్థిరముకాదనె గొల్లగూడపురనివాసునకూ ॥మంగళము॥

9. సత్యాసత్యములసారమెరిగియు మత్తువదలిన స్వాములకూ
సత్తుచిత్తులు ఉత్తవియనిమది సత్యమ్మకు దెల్పిన స్వాములకూ
॥మంగళము॥

10. నామరూపనీమంబులులేనిది భూమయచలమను స్వాములకూ
ప్రేమతోడుత రాములమ్మకు దీమతోదెల్పినదేశిక స్వామికీ ॥మంగళము॥

11. సాయనార్యుల కరుణాచేతనూ మాయను దాటిన స్వాములకూ
భయముబాపెను బాబయ్యకునూ బాయమ్మకుదయజూపిన స్వామికి
మంగళము జయమంగళము శుభమంగళము మద్గురుస్వాములకూ
మంగళమని మీరంగణలందరు సంగభైశారద జంగమయ్యకూ ॥మంగళము॥

## మంగళహారతి-4

1. స్థిరమగు మీ పదవిని - సుస్థిరమగు - సంస్థాపనంబు చేసి జనులకున్ - పరిపూర్ణబోధ ప్రకటపరచిన - మరి శివ రామార్యులాకు మంగాళమనరే - ఆర్యులకిపుడు మంగాలమనరే - పొంగూచుసిద్ధాంత - పూర్ణులైయెరుకాను - భంగపరచిన గురు పారంపర్యులాకు - మంగాళమనరే - తత్ పీఠముకు మంగాళమనరే ॥

2. నిరతము జగములు మీరిన - మరుపుయు యెరుకయు లేక మాయయులేకన్ - పరిపూర్ణులైనట్టి - గురునకు - మరిమరి విశ్రాంతి జెంది మంగాళమనరే - నిత్యముశుభమంగాళమనరే - అంగలింగములాకు అతీతమగు మాయసంగరహిత గురుసభకు అధ్యక్షులకు - మంగాళమనరే - నిత్యము శుభమంగాళమనరే ॥

3. మరియును పీఠస్థులకునూ - పరమ తత్వ విచారులకును - నిరతమూ వేదాంత సభలో నిలకడైన సాధు జనులకు హారతిదిగో - మంగళ హారతిదుగో - సద్గురు మూర్తికి హారతిదిగో - మంగళహారతిదుగో ॥

మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే ॥
సర్వలోక శరణ్యాయ సాధురూపాయ మంగళం ॥

మానవుడు తన శరీరమును జూచుకొని తన సంపదను, తన బంధుబలగమును జూచి మురిసి అహంతో విర్రవీగుచు నాకేమి పర్వాలేదు అని తలంచుతు గురువుల ఆశ్రయించక గురుబోదలు వినక తుదకు దిక్కులేని వాడై బాదపడి చచ్చి నానాయమబాదలు పడుతాడు అది గుర్తించిన అచల గురువులు చక్కనైన వైరాగ్య తత్వములు వ్రాసినారు విందాము-

## పద్యాలు

1. రారికబాంధవుల్ సుతులు ప్రాణము నిల్వగా
రావుసంపదల్ రారిక బాత్రులున్ భటులు
రమ్యమనోహరమైన బార్యయున్ రారిక పౌత్రులున్
హితులు రారయ ప్రాణముల్ పోవుచుండగన్ ॥

2. ప్రాణము పోవుచుండగను ప్రాణసఖినిను రక్షణ
చేయదే ప్రాణము కాలుడున్ గొనగ ప్రాజ్ఞులు పుత్రులు
కానరారుగా ప్రాణము దేహమున్ విడువ ప్రాతమటంచున్
ముట్టుకోరుగా ప్రాణమువుండగానే మునుప్రార్థన జేయుము దేవదేవునిన్॥

3. జీవములుండగానే నినుజేరగరారు దనిష్టులంచున్
బావలు భాతృలున్ హితులు బందుజనంబులు బార్యమిత్రులున్
ఈవలకీడ్చివైచి నినుయెండిన గడ్డిలో పరుండవేతురా
యేవయ దూదిపాన్పుల్ యేవయమేడలు మిద్దెలన్నియున్ ॥

4. సీ॥ అర్ధశరీరమై అలరారుబార్యయె ప్రాణముండగ నిన్ను బయటకీడ్చు
యిండ్లు వాకిండ్లు యిలయెన్నిగల్గిన పంచాయతిరోడ్డు పాన్పుయవును
మెత్తని పాన్పులు మెరయ శయ్యలుగల్గి పసలేని గడ్డిపై ప్రాణమిడుట

ఆత్మస్వరూపమనుకున్న పుత్రుడు కనికరంచక నిన్ను కాల్చివైచుత్ర కపూడ్చివేయుచూ యెన్నిసంపదలుండిన యేమిఫలము స్వప్నమందున గాంచిన సర్వజగము మేలుకొని జూడలేనట్లు యేమిలేదు గురునివాక్యము రక్షనిగుర్తుయెరుగూ ॥

## తత్వం - 1

1. ఇల్లు ఇల్లాంటావు ఉల్లాసపడతావు - ఇల్లెక్కడున్నాదే చిలుకా ॥నీ॥ అల్లంతదూరాన వల్లాకాటిలోన నీ ఇల్లు ఉన్నాదే చిలుకా । నీ ॥ఇల్లు॥
2. వచ్చునాడు నీవు వెంటేమి తేలేదు - పోవునాడు అంతే చిలుకా ।నీవు। మున్నాళ్ళ ముచ్చటకు మురిసేవు భ్రమసేవు ముందుగతి గానవే చిలుకా నీవు । నీ ॥ఇల్లు॥
3. ఆలుపిల్లాలనుచు అన్నాదమ్ములంచు ఆరాటపడతావు చిలుకా ॥నీవు॥ నీవు నీవెగాని నీకెవ్వరును లేరు నామాట నమ్మావే చిలుకా నీవు ॥ఇల్లు॥
4. ఊపిరున్నన్నాళ్లు ఊరిలోనీవారు మావారు అంటారు చిలుకా ॥నిన్ను॥ వారు ఊపిరిపోగానే భార్యపిల్లలు కూడ నినుజూడ రాబోరె చిలుకా అయ్యో నీ॥ఇల్లు॥
5. ఆస్తిపాస్తుల కొరకు అస్తామానము నీవు కుస్తీలుబట్టేవు చిలుకా ॥నీవు॥ ఎంత ఉన్నాగానీ వెంటేమీ రాబోదూ సత్యంబు గానావే చిలుకా । నీ॥ఇల్లు॥
6. పేరు తెచ్చానంటు పైకి వచ్చానంటు విర్రవీగకే వెఱ్ఱిచిలుకా ॥నీవు॥ విశ్వమంతటి లోన నీపేరు నీవెంత తెలుసుకొనవే రామచిలుకా ।నీ॥ఇల్లు॥
7. డబ్బు డబ్బంటావు ఇబ్బంది పడతావు దిబ్బాలో పడబోకే చిలుకా ॥నీవు॥ డబ్బుచూడక యముడు దబ్బుదబ్బునలాగ తబ్బిబ్బులయ్యేవు చిలుకా । నీ॥ఇల్లు॥
8. ఇప్పుడు చచ్చినవాని యికజూడలేనని బావురంటున్నావు చిలుకా ॥నీవు॥ రేపు నీచావుంది తప్పించుకోలేవు ముందు జాగ్రత్త పడవే చిలుకా । నీ॥ఇల్లు॥
9. నీదన్నదేహమే నిన్నుకాదని పోవ నీదన్నదిక ఏదిచిలుకా । అయ్యో నీ॥ ఎవరేమి తేలేదు ఏదినీది కాదూ కాదు శాశ్వతమేది చిలుకా । నీ ॥ఇల్లు॥

10. సారమే లేనట్టి సంసార వలయాన చిక్కిసొక్కగనేల చిలుకా నీవు నారుపోసినవాడు నీరుపోయునంటు బాస్కరానందుని మాట చిలుకా ॥ఇల్లు॥

## తత్వం - 2

ఎన్నాళ్లు బ్రతికినా యేమీసామ్రాజ్యంబు। ఎందుకీ మోహంబు జీవా। పన్నుగా నిహలోక భ్రాంతివదలియు శివుని భజనసేయవె మాయజీవా ॥ఎ॥

తొలిజన్మమునజేయు దోషకర్మముయెందు తొలగజాలక మళ్లీజీవా। ఎలమితో నీజన్మమెత్త కారణమాయె యెరుగజాలవు మాయజీవా ॥ఎ॥

మొదట నవమాసములు మురికిగర్భములోన మునిగితేలుచునుండి జీవా మదిలోన కడతేరే మార్గమెట్లనిచాల మరుగుచుంటివి మాయజీవా ॥ఎ॥

జననమొందేటిదాక జనని గర్భములోన జగదీశ్వరుని నీవుజీవా। ఘనముగా నుతియించి గర్భనరకమునుండి కడతేరితివి మాయాజీవా ॥ఎ॥

బాలత్వమున వెర్రిభ్రాంతిలోబడి యాటపాటలోపల నొరులజీవా। చాలగాబాధించి సాటిబాలురతోటి శ్రమలుగొంటివి మాయజీవా ॥ఎ॥

యవ్వనంబున మనము క్రొవ్విమోహముచేత యెదురు తన్నెరుగకను జీవా। పువ్వు బోణులగూడి భోగించితివి చాల బుద్ధిదప్పియు మాయజీవా ॥ఎ॥

వృద్ధత్వమున బలము ఉడుగుచుండియు వ్యాధులుద్భవించుచుండె జీవా బద్ధత్వమున నింక బ్రతుకు నిక్కంబనుచు శ్రమజెందకుమీ మాయజీవా ॥ఎ॥

జననిగర్భమునుండి జన్మించి మాయలో జేరుకొనికొన్నాళ్ళు జీవా ఘనమైన యాపదల ననుభవించుచు దినము గడుపుచుంటివి మాయజీవా ॥ఎ॥

మాయసంసారంబు మంటిదొంతులటంచు మరినీకుదెలియదా జీవా కాయంబనిత్యంబు కలగన్న చందంబు కల్లగాదిక మాయజీవా ॥ఎ॥

ఆలుపిల్లలు తమ్ములన్న లున్నారంచు ఆశనొందగబోకు జీవా కాలుడచ్చుట నిన్ను కష్టపెట్టగనెవరు కడతేర్చురిక మాయజీవా ॥ఎ॥

ఇండ్లుమేడలు సొమ్ము లితరభోగంబులు యివి నిత్యమనుబోకు జీవా కండ్లజూచుకనీవు కామాంధకారమున గర్వమొందకు మాయజీవా ॥ఎ॥

దనలిపోగులుగూర్చి దనర గృహమునుబన్ని దారిగానగలేక జీవా పిన్ని
కాయలపురుగు మెసలజాలక తుదకు నశియించదే మాయజీవా ॥ఎ॥

కూటికోసంబయ్యి కొరగాని పనులెల్ల కోరుచుండగబోకు జీవా నీట్లో
మీనంబు ఎఱ్ఱమాంసముకయ్యి నిక్కి నీల్గదే మాయజీవా ॥ఎ॥

పలుమారు నావంటి బలవంతుడెవడాని భయపెట్టకొరులను జీవా
బలవంతమైనట్టి పాముచీమలచేత ప్రాణంబు విడువదేజీవా ॥ఎ॥

ఏమిదానములేక వేలలక్షల ద్రవ్యమెంతగూర్చిన మాయజీవా పాము
కుబుసము విడచి పారిపోయిన విధము పరుగెత్తుదువు మాయజీవా ॥ఎ॥

ధరలోనబీబీపేట పురవాసుడైనట్టి పురహరుని దలచవే జీవా దరిలేని సంసార
వా శరధి నిమిషములోన దాటించునిక మాయజీవా ॥ఎ॥

చేటుకేమూలంబు జయమునొందవు మాయ నాటకంబిది సుమ్మి జీవా
బూటకంబనుచు నిచ్చోట హనుమద్దాసు మాటనమ్మవే మాయజీవా ॥ఎ॥

## తత్వం - 3

1. తల్లిగర్భమున ఉన్నప్పుడు నీతమాషయెట్లుండే
ముల్లెగట్టినట్లుండి నరకమున మునిగితేలుచుండే ॥తల్లి॥

2. నేత్రములప్పుడు మూసియుండి నీకేమితోచకుండే
చెప్పనలవిగాకయుండే అంతానిరామయియుండే ॥తల్లి॥

3. మూత్రద్వారమున వెడలిరాగ నీయాత్ర యెట్టులుండే
గాత్రమందు వకపిండిముద్దవలె గాన్పించుచునుండే ॥తల్లి॥

4. కొన్నాళ్లకు నీకన్నతల్లిపై కోరికగలిగుండె కన్నదివిన్నది
కావలెననుచును కాంక్షగలుగుచుండె నీమది వాంచజెందుచుండే ॥తల్లి॥

5. పాయనిసంసారము నీతలపైబడినపుడెటులుండే రేయింబవళ్లు
ఆలుపిల్లలతో బాయనట్టులుండే బాయనట్టులుండే ॥తల్లి॥

6. కాయకష్టమునుచేయలేక నీకాయసముగుండె అత్యాయసముగుండే
వృద్ధాప్యంబున కాలుచేతులు లుడిగినట్టులుండే ॥తల్లి॥

7. వద్దికలేకను వక్కడైన నీవద్దికి రాకుండే తద్దినమెప్పుడటంచును
కాలుడు తలచుచుకూర్చుండే నీకాతలపే లేకుండే ॥తల్లి॥

8. స్థిరముగ నీవిదివరకే గురుని చేరవలసియుండే పరిపరివిధముల
చింతించుటకు పనియేలేకుండె బాగయ్యనేదెలేకుండే ॥తల్లి॥

## తత్వం - 4

1. యేమిజన్మాము యేమిజీవనమూ యీమాయకాయము యేమిజన్మము యేమిజీవనమూ - యేమిజన్మము యేమిజీవనమేమి శాశ్వితమేమిసుఖము యేమినా ప్రారబ్ధఖర్మము స్వామినన్నిటజేసి మరచేను ॥యేమిజన్మాము॥

2. దండిగా భూమండలంబున వొండోరులు కూడంగ శుక్లము మెండుగ శోణితముపైబడి అండమై గర్భముననిండి పిండరూపముదాల్చుచుండు గదా మలమూత్రములతో ఖండమైబడియుండు నిజముగదా అందుండు శ్రమతలితండ్రులకును తెలియబడదు గదా అఖండకోసమే నిండు దినములు గండమెనుదా । కొండగూహలనుండు పగిదిని గుండెలదురుచు దండమిడుకొని నిండుతొమ్మిది నెలలుజూచి ఉండలేనని జననమాయను ॥యేమిజన్మాము॥

3. గర్భనరకము దాటిభువిలో నిర్భయముగా నిలుతుమంటే దుర్భలంబైనట్టి వ్యాధులు గొబ్బుననుగ్రూలంగ ద్రోయును నిబ్బరము నిమిషమునులేదు గదా తబ్బిబ్బుచే గురుదెబ్బలకు లిబ్బందిపడునుగదా । అబాలప్రాయము లోభలోభములెరుగదాయే గదా నిర్భాగ్యతనువులు సుబ్బరంబగు రుచులు గోరుగదా । యేభయములేకుండగా తనకభయమొసగె ప్రభువులెవరో శుభము జగమునజూడబోము శభాసుయేభూషురులు జేసిరో ॥యేమిజ॥

4. యేమిజెప్పుదు యవ్వనంబున కోమలాంగులమోము జూచి తామరస గర్భదులకు సహాప్రేమపుట్టకమానదయ్యయెూ కామరము కనుగప్పి యుండుగదా ఆసమయమున పరభామలెడ మమకారమిడునుగదా

కమలాక్షి మాంసపుష్ఠనములందే మనసునిలచుగదా క్రమమెరుగ కిలల్రా దురితములచే దూగుచుండుగదా । మనమునను భ్రమజెంది మరియొక కమలనేత్రిని పెండ్లియాడి విమలమగు సుజ్ఞానమిడచి కుమారులనుగని భ్రమలు జిక్కిన ॥యేమిజన్మాము॥

5. పుత్రమిత్ర కళత్రసందడి మాత్రమేనేత్రములతో గనీ దాత్రిలో కౌమారమున అతిసూత్రమై భవబంధములకు పాత్రుడైపడియుండవలయుగదా తాపత్రయంబులు తగుల్కొనిదిగులొందుచుండుగదా కర్తుత్వమున తావిత్తమార్జన జేయుచుండుచుగదా వటపత్రశయనుని భక్తిలేకనుమత్తుడౌను గదా । గుత్తమగులోగిల్లుగా దేలు యెత్తాగా వేడలుగట్టి శక్తినొందినవారు మృతులై ఉత్తచేతులబోవువారలు ॥యేమిజన్మాము॥

6. దారువటదడదడ వణకుచు కోరికలు యెడబాయకుండునూ కారుతన వారెవరు వెంటనురారు వృద్ధాప్యమయినను దీరతను తనుతెలీడాయే గదా యీ ఘోరమగు సంసారమేమది గోరుచుండు గదా క్రమమెరుగకిలలో శ్రమలచే కొన్నాండ్లు గడుపుగదా గురుసేవజేయని తిరిగి పుట్టుచునుండ వలయుగదా । అరమరలులేనట్టి సద్గురునడిగి యనుభవమైన మట్టుకు దరణిలోపాల యడ్లరామదానుడిది రచియించే దెలయుడీ ॥యేమిజన్మాము॥

## తత్వం (ఆటతాళం-ఆనందభైరవి రాగం) - 5

1. ప్రభుశేవదొరికెను నేడూ అహంబావము లేదిందు చూడూ
అభిమానములనెడి అవివేకమున జిక్కి ప్రభలేటి యెరుకను
బరిమార్చుటకునై విభుదులరసిన బోధయిదియని విడువకను
బోధించి భక్తుల కభయమిడి సంతోషమున తనహస్తమును
శిరమందునుంచిన ॥ప్రభు॥

2. మురయుచూ గురుసేవజేసీ ముక్తీనరసి యీషణములరోసీ
అరమరలేకిక అనయము మీరిట్లు నిరతాము గురునాకు పరిచర్య
యొనరించి తరుగు విరుగులులేక నెప్పుడు తరచుటకు తరమేమిగాకను
పరమపదమైనట్టి బట్టబయలు యిదిగోయనుచుదెలిపే ॥ప్రభు॥

3. భ్రమమూలామైనట్టి జగమూ నేడూసమసె యీసంకల్పగుణమూ
నమరపంచాభూత సమితిచెగలిగినా సమయుచుండేటి యెరుక
నరయాబయలందున నిమిడియున్నది యనుచు బలికెను
కుమతివాక్యము విడిచివేగుము క్రమముతో యీద్వాదశాక్షరి
కనుగొనుమని యానతిచ్చే ॥ప్రభు॥

4. చెప్పశక్యముగాకయిలనూ అదిమెప్పియున్నదిజూడుమికనూ
తప్పాకచూడూడి తనువేరుకలూలేక యెప్పూడు ఒకరీతి యున్నాదీ
బయలాని తెప్పునను గనుగొన్నవారికి తిప్పలేమియులేక
నీకనురెప్పపాటులోయున్నదా గురుమెప్పువడసిన మేటివరులకూ ॥ప్రభు॥

5. వెంకటేశ్వరయోగివరులూ యిట్టిశంకాలు తీర్చినఘనులూ శంకలేకను
గురుసార్వబౌముని పదపంకాజములు హృదయపద్మమందున నిలిపి
పొంకముతో వరరామసింహ్మాని బోధపద్ధతులెల్లతెలసి సంకటంబుల
బాపిభక్తుల సన్నుతించేడి స్వానుభవులకూ ॥ప్రభు॥

## తత్వము-6

1. ధనవంతులైనారె కొమ్మా - దారి గనుగొని బుధులంత ధన్యులైరమ్మా
ధనవంతులై ఆత్మ తరచి సద్గురుబోధ - వనజాములను నమ్మి వసుధాలో
పరిపూర్ణ ॥ధనవంతులై॥

2. శృంగార శోభితులమ్మా ఆత్మాబంగారు మహిమచే ప్రభలేరెకొమ్మా
అంగాములో పరమలింగాము గని విషయసంగామంటక మదిలో సతతాము
ముదమొందీ ॥ధనవంతులై॥

3. అండత్రయములలో కొమ్మా దనమునిండించి వెలిగెరోయమ్మా కుండాలి వేదించి కోటికి పడిగెత్తి చండభాస్కరవహ్ని శశిమద్య వెలుగుచూ ॥ధనవంతులై॥

4. చిత్తా విశ్రాంతులోయమ్మా-పరమొన్నత్తులై పరులకు పలుకారోయమ్మా వుత్తాది జగమాని వూహించి నిరతము సత్యా జ్ఞానానంద స్వానుభూతిని జెంది ॥ధనవంతులై॥

5. నిగమాంతనిలయులోయమ్మా - మాయ వదలి యింద్రియ సుఖ వశముగా రమ్మా - త్రిగుణకల్పితమైన జగమాని మరచియు పగలు రేయి ఒకటిగా పరికించి సతతాము ॥ధనవంతులై॥

6. పామరులనూజేరరమ్మా - యితరులేమన్న మదికించ నుంచరోయమ్మా ప్రేమతోడుత పరందాముని గన్నట్టి దీమంతులను జేరి దినములు గడుపుచూ ॥ధనవంతులై॥

7. నీతికోవిదులైన రమ్మా సర్వభూతములను దయజూతురోయమ్మా బీతినొందక మనసు రాతిగ జేసియు ప్రీతితో జగతి ప్రఖ్యాతివహించియూ ॥ధనవంతులై॥

8. వొళ్ళు మరచినారె సుమ్మా, పరమొల్లాసులైనారె కొమ్మా కల్లయుగము జగమల్లా యనుచునెంచి, అళ్ళా శ్రీకలమాళ హరి బాబ గురుజేర ॥ధనవంతులై॥

## తత్వము-7

1. యేమానందు నెగురుడు యేమందుబెట్టెనో నామరూపములేనిదీ కనరానిది కామందమనె పిత్తకడలి లిక్కించగ యే మంచి గుటికనో నూరిపోసెనోగాని-తామసంబును తావు దప్పెనుగా తడవింతలెక నెమొరాజ సరూపమాయెనుగా సాత్వికమయిక్యంబాయె నా మనసందు నేకముగా ॥మిత్ర॥ ఏమి జెప్పుదు ఏమనందిక నామహ ఔషద ప్రభావము సోమ సూర్యులు గతులు

దప్పెను స్వామి దయయింకేమీ జెప్పుదు ॥యేమ॥

2. తాపత్రయంబనె తరుణా జ్వరమునన్ను తల్లాడమును బెట్టగ ॥భయపెట్టగ॥ ఆపాదబాపె ఆనందశన్ముఖి ముద్ర చూపి కన్నులనిండనోపి పటియించెనూ తప్పెఆధ్యాత్మిక దాహమును దైర్యంబు జెందగబాపె బౌతిక మృతిభయంబి కను మైకంబు నిచ్చియునోప నాయెను దైవతాపమును అప్పుడప్పుడు నతిరసంబగు నారు వర్ణంబులను వెలిగెటి చెప్పశక్యముగానిదేదో గొప్ప మాత్రను నూరిపోసే ॥యేమ॥

3. మౌనమనెటి మూలికను పానమును దీనికని తినుమని పలికేనూ ॥గురిదెలిపెనూ॥ గనమైన యీ మందు ఘణ పుణ్యులకెగాక జనులాకందరికివ్వ జనదనుచు దెలిపెనూ సత్యామె పత్యంబటంచనిరీ సద్గురుని తలుచుక నిత్యా నిత్యంబెరిగి తినుమనిరీ జన్మాంతర వ్యాదెప్పటికీ లేకుండ చనుమనిరీ ॥మి॥ మానవులకెగాక ఔషదమంద అన్యులకలవిగాదని జ్ఞాన మార్గం చూపు పెద్దలు పూనితినె మంది దెయటనిరీ ॥యేమ॥

4. ఆది అంత్యములేక అంతాటనిండి ఆనంద రూపమైనది ॥అనరానిదా॥ సాదు సజ్జనులెల్ల సారమెరిగినామందు బేదా బుద్దుల కందరాదు రాదనినిచ్చె ఏదిరా యీ మందుకునుసాటీ సత్పురుషులెల్లనూ బాగుగా తినిచూచిరిపాటి, శడ్ శాస్త్రమందున యున్నదె యీ మందు సరిపాటి ॥మి॥ సదయుడగు ముదిగొండ శంకరుడిదిగొ రమ్మని రామలింగని హృదయమున తా పదిలపరచిన సదమల ప్రదమైన మందూ ॥యేమ॥

## తత్వము-8

గురురూప మెరుగావె యేరూపమును గాదే నిరుపమ నిరువాచ్యమే। నిరుపమని నీ హృదయము గురు పరమరహస్యం బెరిగి నీవిక. సరస సల్లాపములను నీ విరసమును నిరసించుమనసా ॥గురు॥

ఆది అనాది బ్రహ్మాదుల కలవిగాదనుచు బుధులు బల్కిరే। వేదశృతుల కగోచరంబని, భేదమెంచక సాదు జనులది। పాదుకొని పొందిక సమాధిని జెందియుండగ యితరవశమా ॥గురు॥

కానరాదు చూడ కనిపించునది కల్ల. మనసూలో కనవాలెనె, మనసుల్తో కని మనసు కుదిరిన మనసుదే గురురూపమనబడె మనసు నిర్మలమ్మైన దచలంబన్నది లేదనుచు మనసా ॥గురు॥

శబ్దమనగరాదు నిశ్శబ్ధమనగాదు అబ్బా యేమనవచ్చునే నిబ్బరము పరిపూర్ణ మచలంబదె బయలు నిర్భయలు సాక్షిగ, మబ్బు వదలని మనుజులకు పరమబ్బదని శృతులనగ వినమే ॥గురు॥

గ్రంధ ప్రబంధాములెన్ని చదివిన హృదయ గ్రంధి తన నెడబాయదే ॥ గ్రంధిరంది ప్రకృతి విషయం బందులోబడి బొందిరాకడ సందిదెలసి రంధి బాసి బంధమోక్ష ద్వంద్వ మెడలిక ॥గురు॥

అనరాని వినరాని కనరాని దచలమని మునివరులు నుతియించిరె అనవినకనరాక యున్నదచలమే పరవస్తువనుచును అనుదినంబును మదిలో మరువక కనుచు కనరాకుండు మనసా ॥గురు॥

కనపడ్డ వస్తువు కానిది పోనిది లేనిదానుచు వినయమునా రానిపోనిది అచలమని శ్రీరామచంద్ర కృపానురక్తిని పూని మదిని నిరాకరించిన అచలమే మన దోచదాహా ॥గురు॥

## శ్రీపరదేశి వీరయార్యులు యీషణత్రయబాధలు తనగురువుగారితో విన్నవించినది

1. ముగ్గురున్నారయ్య । ననుముంచె కాంతలు । ముగ్గురున్నారయ్యా హగ్గముండలు నన్నువిడకనూ । పగ్గముతో బిగబట్టి నట్లుగా సిగ్గుదప్పియు నుగ్గుజేసిరి । దగ్గరైతినివారి కోసమె ॥ముగ్గురు॥

2. వచ్చితే పోనట్టిదీ వాకతున్నదీ । నను చిచ్చుబెట్టుచున్నాదీ యిచ్చలేని మునీశ్వరులకే తెచ్చుచున్నది । సంకటంబులు హెచ్చేప్రశ్నలు భల్కినన్ను కుచ్చాహాడవులకుర్కజేసేనూ ॥ముగ్గురు॥

3. తెంపితె తెగనట్టిదీ । యెన్నెన్నో విదముల పంపుచున్నదిగట్టిదీ । కొప్పుగల రాజాది రాజుల కొంపలను కొరిగింపజేసెనూ కంపుముండల సిరముకిందికి వొంచజేసేటి ఘనులు యెవ్వరో ॥ముగ్గురు॥

4. తగిలితొాదులనీ దొక్కతే నగుబాటుజెగతి పగలుజేసెను జిక్కితే యుగయుగంబుల వారివలనను వగలు తోడుత హొగడుజేసియు భుగులు లేకను స్వారిజేయు యామగువకెవ్వ రదికారమిచ్చిరో ॥ముగ్గురు॥

5. యిట్టి సకియలనెట్టులా పుట్టించె దేవుడు గుట్టుదెలియదెట్టులా గట్టిగను లెక్కబెట్టజాలరు దిట్టరులచెయ్యి భట్టిరాండనీ అంతెపారుగుజేసి కట్టుబట్టాగానని బద్దుమాసులు ॥ముగ్గురు॥

6. వారినొంచుటకయ్యా కరిభసవడను గురురాయునొద్దకు బోయ్యా వారిజాక్షుల నేరమంతయు కూరిమితో వినిపించగలననీ చేరబిలచియు సాము నేర్పియు ఘోరఖడ్గము బారి దీర్చెనూ ॥ముగ్గురు॥

7. ముప్పుదప్పెననుచునూ శ్రీనారగూడెము నొప్పుగానేనుందునూ తప్పకను వీరప్పయాక్ష్యుని గుప్పునను కనురెప్పపాటున యెప్పుడో మురిపించి మబ్బు గప్పి తిప్పలుపెట్టే లంజలు ॥ముగ్గురు॥

## తత్వం తేది: 10-1-97

1. వశముజేసుకున్నాడే తనవద్దనిలుపుకున్నాడే కశిదీరగా తనకౌగిటజేర్చుక ముసిముసి నవ్వుచుమోదము జూపుచూ ॥వశము॥

2. మూడుకోరినాడమ్మ జతవీడనన్నడోయమ్మా పీడపాయెనని వోడకనిచ్చితి యేడ్డెదుల నాతోడ దీయించియు ॥వశము॥

3. మూడు జూపినాడమ్మా నాజోడు బాపినాడమ్మా ఏడెనిమిది ఆరుమూడు తానొక్కటి వేడుకతో కథకూడిక తెల్పెనే ॥వశము॥

4. ఆ ఐదుటిస్థావరములు నాకందజేసెగను డిలలో అయిదైదుయిరువై అయిదాడించుచు ఆయిదొన్నెల తానై నిలచున్నాడు ॥వశము॥

5. ఆరుమూతలను మూసి పదిఆరవదానిగ జేసీ ఆరుతొమ్మిది అర్థము జూపెను
ఆరు ఆరుత్తానైనను చాలని ॥వశము॥

6. వొక్కటి లేపినాడమ్మ మూడొకటిజేసినాడమ్మా సకలంబునకు సాక్షి
యిదెయని ఒకటొకటిడిచియ ఒక్కటై పొమ్మనే ॥వశము॥

7. అంతామరచినానమ్మా యీవింతతెల్పరాదమ్మ అంతయింతయని
అంతుదెలియకనూ అంతాటనున్నడు అచలసద్గురుడూ ॥వశము॥

8. ఆశలేనివాడమ్మా నా ఆశదీర్చినాడమ్మా బాసిపోకు యమబాదలు లేవని
బాషజేసె పరదేశికు గను గొని ॥వశము॥

## లాలిపాట

లాలిశ్రీకృష్ణలాలీ లీలావినోద పరిపూర్ణలాలి బాలగోపాలలాలీ
దేశికప్రభురాయ యిదుగొలాలి ॥లాలి॥

భాగవత వంశమందూ నీవుబల్ వేగముగవచ్చిముందూ భూసురులు
వేడవిందూ నీ పేరుభువిని శ్రీకృష్ణుడందూ ॥లాలి॥

బ్రహ్మాండ భాండములనూ నిండియున్నటిమీతేజంబునూ దండి
ఋషులును మునులును గొల్తురటనిండారు భక్తితోనూ ॥లాలి॥

భూమియే తొట్లగట్టి ఆకాశమనునదే ఛత్తుగట్టి నాల్గు వేదములు బట్టి
పాశములుగా నవియె చుట్టిపెట్టి ॥లాలి॥

బ్రహ్మాదిసురలందరూ తమచుట్టు ప్రస్తుతింపుచునుందురూ
గోపికాగుములందరూ నీకుషోడశ పూజలొనరింతురూ ॥లాలి॥

మందయానలు నూర్గురూ తమచుట్టు అందిపుష్పములేతురూ
యిందువదనలు జూతురూ వారుబల్ నిష్టతోవినుతింతురూ ॥లాలి॥

స్థూల సూక్ష్మములు లేవూ కారణామహాకారణములు గావూ త్రిగుణములు
లేనేలేవూ యిందుకే అశరీరవర్తకుడవూ ॥లాలి॥

క్షరమక్షరములుగావు అందుకు విలక్షణుండ వగుదునీవూ సాక్షి రూపుడవుగావు బ్రహ్మాదిదక్షులకె దొరుకబోవూ ॥లాలి॥

పంచభూతములుగావు తరువాత పంచేంద్రియములుగావూ పంచ శక్తులునుగావూ సర్వప్రపంచంబు నీవుగావు ॥లాలి॥

ఆద్యంత శూన్యుండవు అమితుండవప్రమేయుండ వీవూ చోధ్యప్రకాశుండవు నీవు వేదవేద్యుల కగోచరుడవూ ॥లాలి॥

శూన్యశూన్యములుగావు శూన్యశూన్యముల కావలివాడవూ బహుమాన్యమాన్యుండవూ నాతండ్రి మహినినిజదేవుండవు ॥లాలి॥

నిజగురువు కృపగల్గితే మనసు నిశ్చయముగను కుదిరిపోతే నిష్కపటివై నిలచితే నాకు ప్రత్యక్షమేపరమపదమూ ॥లాలి॥

తప్పొప్పులేమెరుగనూ నేనైతెతప్పుగాడను సత్యమూ మెప్పైన మీభక్తిచేనా తప్పులన్ని వొప్పుగాజేయుము ॥లాలి॥

మంగళము మంగళంబూ మీకు జయమంగళము మంగళంబూ అంగనలు బాడవిందూ మీకునే వందనములాచరింతూ ॥లాలి॥

భాగవత కృష్ణగురుడౌ నీవు నాపాలివేల్పువు దాతవూయనుచు హర్నిశములందూ ఫీల్ఖానశంకరుండనుచునుండూ ॥లాలి॥

నేననేహంకారమూ లేనిదే నా వెంటబడె చూడుమూ దీని పుట్టుగ ముంచుమూ నాతండ్రీ దీనులను పోషించుమూ ॥లాలి॥

యిట్టి భక్తులనందరీ నీవుబల్దిట్టముగ గాచుటకూనూ నట్టేమి లేకయిపుడూ ఘట్టిగా పుట్టితివి రక్షింపనూ ॥ లాలిశ్రీకృష్ణ లాలీ లీలావినోద పరిపూర్ణలాలి బాలగోపాలలాలీ దేశికప్రభురాయ యిదుగోలాలి ॥లాలి॥

# జోలపాట

జోకృష్ణగురురంగ జోపాండురంగా దీనాధి అరిబంగ దివ్యప్రసంగా ॥జోజో॥ దశనాదములు వినుచు దశదిశలు జూచీ విశదమైవెలుగొందు విదమంతగాచీ అసమానసూర్య చంద్రులనంత గడచీ వశమైనయాముక్తి కాంతనటుగెలచీ ॥జోజో॥ కమలమద్యమునందు విమలమైనావూ రమణీయమై యెుప్పి రంజిల్లినావూ అమలమై ఆత్మస్వరూపమైనావూ భ్రమరహితులకు బట్టబయలువై నీవూ ॥జోజో॥ నవద్వారపురమనే నయపట్నమందూ నయనయుగ్మమునందు నాణెమనివిందూ అష్టతనువులపైన ఆనందమొందూ చున్నకేవల వస్తువవెనీవ నందూ ॥జోజో॥ రత్నాల గొలుసులతో రాణించునట్టి ముత్యాలతొట్లగా ముదమొంద గట్టీ బాలీసుపరుపుతో బాగుగబెట్టీ మేలైన రమణులందరుచేత బట్టీ ॥జోజో॥ భాగవత శ్రీకృష్ణ దేవాదిదేవా వేగమే నాచేత పూజ గొనరావా భోగభాగ్యములలో మరిచియున్నావా రాజాధి రాజువై రక్షించలేవా ॥జోజో॥ నాతండ్రి నీచిన్ని పాదములు గొలిచే ఫీల్ఖాన శంకరుండను వాడు బిలిచే గురిచక్కగా నిలిపి గుణుడయ్యు నిలిచే కల్లసంసారంబు ఘడియలో మరచే ॥జోజో॥ జోకృష్ణగురురంగ జోపాండురంగా దీనాధి అరిబంగ దివ్యప్రసంగా ॥జోజో॥

# జోపాట

1. జోఅచ్చుతానంద జోజోముకుందా । రారా పరమానంద రామగోవిందా ॥.......జో........జో॥

2. తొలుత బ్రహ్మాండంబులు తొట్లెగావించి నాలుగువేదములు గొలుసులమరించి బలువైన ఫణిరాజు పాన్పులమరించి చెలియ డోలికలందు చేర్చెలాలించి ॥.......జో........జో॥

3. తొమ్మిది వాకిళ్ళ దొడ్డిలోపలను మూర్ఖులు ముగ్గురు సాదులైద్దురును అంతట ముగ్గురు మూర్తులున్నారు తెలివి తెలిపె గురుడు దేవుడున్నాడూ ॥.......జో........జో॥

4. కట్టవలె ఆర్గురిని కదలకుండగను పట్టవలె ముగ్గురిని పదిలంబుగాను వుంచవలె ఒక్కని హృదయ కమలమందు వుండవలె పండువెన్నెల

నిండుగానూ ||.......జో........జో||

5. ఇడ పింగళ గంగయమునల నడుమ త్రివేణి సంగము తీరైన నడుమ పరమ పక్ష పసిమ మధ్యరంగమున పురాణమే స్వప్న భావమైపాడూ ||.......జో........జో||

6. నాదుబిందు కళ నాన్యామై వెలగు సుషుమ్నానాడి ఆదారమై మెలగు భ్రూమధ్యమందు పరంజ్యోతివై వెలగు సత్తుచిత్తానంద నిత్యమై వెలుగు ||.......జో........జో||

7. ఇడుగాని వాన్ని కూడుండవలెను జోడులేనివాని జాడగనవలెను మేడ మీదున్నా మేలుగనవలెను కోరియా గోవింద గురుని గనవలెను||....జో.....జో||

8. సకల వేదశాస్త్ర పురాణములు చదివి ప్రకటితంబుగ మాయ తెలియంగలేని అకలంకమైన సద్గురు కటాక్షము వలన ఒక్క శ్లోకము చదివి జ్ఞానులైనారు ||.......జో........జో||

9. ఓంకారమనియెటి ఒక తొట్లె గట్టి । తత్వములు అనియెటి చలువల్లు పరచి వేడ్కతో పాపన్ని ఏర్పటుజేసి । ఏడు భువనములవారు యేకమై పాడు ||.......జో........జో||

10. యుక్తిచే యెరుక ముత్యపు గుత్తిగట్టి । తొక్కేటి యింద్రియములనవి తొక్కిపట్టి పట్టిరిక తన శోభభావం । గుర్తెరిగి యెత్తుకో ఆనంద భరితులైనారు ||.......జో........జో||

11. నల్లద్వారములోన మోముజూపారా । నవనీతచోరనీ నిన్ను బిలచేరా పగిడిగిన్నెల పనుస దారబోసెరా । పరమాత్మ నాచేత పండందుకోరా ||.......జో........జో||

12. ఆశక్తి యీశక్తి యిరగడల నిలిపి । వాచార్థ అజ్ఞానమాత్మలో నిలిపి । స్వచ్ఛముగ నీపాద జలములను కడిగి నిత్య సేవించేరు ఆనందముగను ||.......జో........జో||

13. వాచార్థమున చార్ధ వర్ధిల్లినాము । లక్ష్యార్థమునచేత రంజిల్లినాము । వాచార్థ లక్ష్యార్థమటు పారదోలి । ప్రత్యక్షమున పరబ్రహ్మమైనాము ||.......జో........జో||

14. పదహారువేల గోపణతులగూడి । ముదమొప్పనినుగొలతు ముద్దు గోపాల నయమొప్పనిను దలతు వోపరందామా । కలలోన నినుమరుప వో ఘనశ్యామా ॥.......జో.......జో॥

15. రంగైని గోలకొండ రంగనిబాల శృంగార రక్షణతోజేసిన గోల మంగళంబంటి శ్రీమదన గోపాల కోటి ధనములు మాకు యివ్వు యీ వేళ ॥.......జో.......జో॥

## మేలుకొలుపు

1. తెల్లవారెను మోహతిమిరం బెల్లబాయెను జ్ఞానవుదయం బల్లప్రబలంబాయ తనమన సెల్ల స్థిరమాయెన్ ॥ఆత్మా॥ మేలుకొనవే

2. మూడుగుణములు మునిగిపాయెను ఏడుధాతువులెనుక బట్టెను ఏడయేమియు లేకపాయెను ఎరిగిమేల్కొనవే ॥ఆత్మా॥

3. అష్టతనువులు అడవిబట్టెను అష్టమదముల హమిక మణగెను కష్టసుఖముల కాంక్షదీరెను ఘనతమేల్కొనవే ॥ఆత్మా॥

4. అష్టప్రకృతుల ఆటలుడిగెను అష్టపాశములపుడె వీడెను ఇష్టమేమియు లేకపోయెను ఇపుడె మేల్కొనవే ॥ఆత్మా॥

5. వాసనాత్రయ మొదలిపాయెను ఈషణాత్రయ మిపుడె వీడెను విన్నదేమియు లేకపాయెను వేగ మేల్కొనవే ॥ఆత్మా॥

6. సాగరంబుల చప్పుడుడిగెను వాదభేదము వదలిపాయను నాదమప్పుడె నశ్యమాయెను నయమె మేల్కొనవే ॥ఆత్మా॥

7. మండలములనె మమతమానెను కుండలస్థలి కూలి పాయను పండువెన్నెల భావమాయను బరగమేల్కొనవే ॥ఆత్మా॥

8. మనస్సు బుద్ధియుమరల జనియెను మానిపాయను జననమరణము మమత ఏమియు లేకపాయెను మరియు మేల్కొనవే ॥ఆత్మా॥

9. గురుడుశిష్యుండేకమాయెను కులము గోత్రము లేకపాయెను కుడియడములు నమమె ఆయెను గురుతెరుక బాయున్ ॥ఆత్మా॥

10. పరశురాముని సీతరాముల భజన నిత్యము సేయుటా యెను బాగుగా శేషమ్మభావము బయలులో లేదాయెన్ ॥ఆత్మా॥

## కటకట మోసమాయెను

1. మోసమాయెను జీవచూడగ, మోహపాశము లధికమాయెను గాశిజెందగ జేసెనీగతి కర్మమేమందూ ॥జీవా మేలుకొనవే॥

2. కల్పశతములకన్న మిక్కిలి కాలమాయెను తిరిగిచూడగ అల్పసుఖమని కలలో మురియుచు ఆడుచున్నావు ॥జీవా మేలుకొనవే॥

3. కోటిజన్మములెత్తియును శతకోటి దుఃఖములను భవించుచు నాటిమాటలు దలచుకొంటె నాటు నీ మదికీ ॥జీవా మేలుకొనవే॥

4. యిరువదొకవెయ్యి ఆరునూరులు జరుగు హంసలు తరుగు నాయువు హరిహరాదులు వచ్చి నిలచిన ఆగదీతనువూ ॥జీవా మేలుకొనవే॥

5. లేనిపోని దుఃఖజాలము లోనబడి చెడిపోవుటెందుకు మాన అవమానంబులని నీమమతవిడలేవూ ॥జీవా మేలుకొనవే॥

6. నిజగురుండగు సూర్యుడిప్పుడు నిజముగా వుదయించె చూడుము త్రిజగముల వారంత మేల్కొని తెలివి గన్నారు ॥జీవా మేలుకొనవే॥

7. బట్టబయలును గురుడు జూపిన నట్టులేకను పుడమి అందున పట్టువిడువక గుట్టుమరువక దిట్టమైపోవే ॥జీవా మేలుకొనవే॥

8. మాయతనువై మాయతానై మాయ పనులను జేయుచునుమరి మాయ తన మర్మంబుగననే మాయమైపోవున్ ॥జీవా మేలుకొనవే॥

9. ద్వాదశిషోడషులనె జలధారకర్ణములందు సోకిన బాదలన్నియు తొలగి నీవిక భ్రాంతివాదిలెదవూ ॥జీవా మేలుకొనవే॥

10. భాగవత శ్రీకృష్ణదేశిక ప్రభువరుండిటు రానె వచ్చెను వేగగని తనుమన దనంబులువీడి శరణనవే ॥జీవా మేలుకొనవే॥

11. ఫీలుఖాణ శంకరుండని పిలిచి ప్రభువరుండేలినారట మూలమూ లేనట్టి యెరుకనూ ముంచివేసిరటా ॥జీవా మేలుకొనవే॥

# జీవా మేలుకో నాతండ్రి మేలుకో

మేలుకో నాతండ్రి కీలుదెలసిగురుపాలబడితెజాలు మేలుకో ॥జీవా॥ ముగ్గురిముంతవంటి తిగ్గరిదేహమునమ్మి చిగ్గురుబుస్సెందుకు మేలుకో ॥జీవా॥ కాతపూతలేని యీత చెట్ల క్రింద కోతి కూర్చున్నాది మేలుకో ॥జీవా॥ ఘటమునందు నీవు దిటముబూని చూడు కుటిలాముడిగివేగ మేలుకో ॥జీవా॥ గుండు మీదరెండు గండ్లు చక్కగజూచి గండిలోపలదూరి మేలుకో ॥జీవా॥ మనసు చూపుమాలి నిమిషాముంచి చూడు సంశయమెందుకు మేలుకో ॥జీవా॥ ముక్కుమీదినుంచి ధృక్కు నిలిపి చూడు చక్కానిచుక్కాలు మేలుకో ॥జీవా॥ కుక్కామీదవక్క నక్క వున్నదిబాగ నిక్కిచూతువు గాని మేలుకో ॥జీవా॥ కాళ్ళు నోళ్ళు లేని కోళ్ళాగుంపులుగూశె వ్యాళ్ళాజూతువుగాని మేలుకో ॥జీవా॥ రూపులేనిపంది రేపుమాపునువచ్చి రాపాడుచున్నాది మేలుకో ॥జీవా॥ నోరులేనివాడు పూరావేదము జదివె కారణమును దెలియు మేలుకో ॥జీవా॥ కోటిసూర్యులకన్నా దీటుగా వెలిగేటి మేటిని జూడగ మేలుకో ॥జీవా॥ పాపాలలో శుద్ధ స్ఫటికసన్నిభమైన ఆపోజ్యోతిని చూచి మేలుకో ॥జీవా॥ అందమైన పెద్ద లందరర్థము జేసి ఆనందమొందేరు మేలుకో ॥జీవా॥ భాగవత శ్రీకృష్ణదేశికేంద్రునిపాద శేవజేతువుగాని మేలుకో ॥జీవా॥ ఫీలుఖాన శంకర ప్రియదాసునీ కీలుదెలసినాడు మేలుకో ॥జీవా॥



ఓం
శ్రీసీతాయార్యగురువే నమః

శ్రీదుందిబినామ సం॥ ఆశ్వీయుజ శు॥ ద్వాదశి శుక్రవారం ది: 29-10-1982 శ్రీ సీతయార్యులవారి ద్వాదశ వార్షిక ఆరాధన సందర్భమున శ్రీమదచల పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపులగు శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్యుల ప్రియశిష్యులగు, సుపుత్రుడగు నిత్యనిర్గుణానంద బ్రహ్మానందార్యుల శిష్యకూటమునకు కానుక మరియు బ్రహ్మానందార్యులకు దివ్య సువర్ణ తత్వ మకుటముగా సమర్పించనైనది.

*రచన: సద్గురు పాదరేణువు దయానంద నాగుల వెంకటేశం, గొల్లగూడెం*

## 1. తత్వము, గురుస్తుతి

1. వందనంబులు సీతరామయ్యా నిర్గుణానంద కొండోజు బ్రహ్మానందార్య
వందనంబులు జేసెదాము యిందుమౌళి యతివరేణ్యా సందిదెలిపి
రందిబాపుము స్వామి బ్రహ్మానందగురుడా ॥వందనం॥

2. నిత్యానంద నిలయమందయ్యా నిర్గుణానంద నిత్యాపూజింతునోయయ్యా
నిత్యామైనదాని నీవు నిశ్చయించిచూపుమయ్యా నిష్కపటివనుచు నిన్ను
నిత్యాపూజింతునయ్యా ॥వందనం॥

3. త్రివిధభావముబోదజేస్తివీ నిర్గుణానంద త్రివిద దీక్షలు నొసగుమంటివీ
త్రివిద ప్రసాద లనుభవంబు తేటగానీకు దెల్పెదనుచూ తీనుతెరనొవ్వా
ఆటరతీసివేయుము భక్తుడంటివీ ॥వందనం॥

4. ఈశ్వరాంబనాదుడవయ్యా నిర్గుణానంద ఈశ్వరసంభూతుడవయ్యా ఈష
వినునా ఆశపాశములనుగజేయుము ఈషణంబుల నాశనంబు జేసినీ
పదదాసునిగావించు తండ్రీ ॥వందనం॥

5. గొల్లగూడపురమునుండయ్యా నిర్గుణానంద గురుశిష్యులిద్దరొచ్చిరయ్యా
ఆది మద్యాంతములు లేని అచలుడగు శ్రీమోతెక్రిష్ణయ్య బోదజేసెను
వెంకటేషుకు పోషకుడు శ్రీగురువరేణ్యుడు ॥వందనం॥

# 2. పాట

## ది: 18-10-1983 శ్రీసీతయార్యులవారి త్రయోదశ వార్శికారాధన పూజ సందర్భమున సమర్పించుకున్న తత్వకీర్తన

1. యెంత చక్కనీ గురుడమ్మా కొండోజు బ్రహ్మానంద స్వామి ఎంతసత్యప్ర పరుడమ్మా ఎంతచక్కనీ అచలగురుడు యింతిరో నేనేమిజేయుదు మంతనమున శ్రీధరులశివరామ దీక్షిత పుత్రుడాయె ॥ఎంత॥

2. ధరనీ గోలకొండ పట్నములో వెలసినా శివరామ దీక్షితపీఠములో వాసిగను సికింద్రాబాద్‌లో వెలసిన చిలకలగూడలో సీతయార్యుల ఈశ్వరాంభకు పుత్ర శిష్యుడాయెనమ్మా ॥ఎంత॥

3. సత్యశీలుడూ బోదపరుడమ్మా కొండోజు బ్రహ్మానందస్వామి సుగుణవంతుడు పూజపరుడమ్మా ప్రేమదృష్టితో చూడగాను చూచెవారికి గణపతమ్మ పరమ తండ్రీ అచలపూర్ణ విగ్రవుండో యమ్మలారా ॥ఎంత॥

4. దేశములు దిరిగినాడమ్మా బ్రహ్మానందస్వామి పీఠములు దర్శించినాడమ్మా దేశము గజపతి నగరము ఆల్లవరము బెంగుళూరు కాకినాడ శ్రీధర ఆశ్రమ పూజ్యులను కలిసిన తండ్రీ ॥ఎంత॥

5. నిష్టలోనినిజగురుడోయమ్మా కొండోజు బ్రహ్మానందస్వామి ఇష్టదైవము పుణ్యపరుడమ్మా అనుదినము శ్రీబాలాంజనేయుని భక్తుడై విలసిల్లె దీక్షతో లక్ష్మీనారాయణునకు ప్రేమ అగ్రజుడాయెనమ్మా ॥ఎంత॥

6. అంటినటుల యుండునోయమ్మా బ్రహ్మానందస్వామి జగమంట కనుతిరుగు వాడమ్మా ఆత్మీయ సోదరుడైన జొన్నాడ హరిక్రిష్ణస్వామినీ జేరి శ్రీగురుకరుణా నందుని కలసి భక్తులనేలుచుండె ॥ఎంత॥

7. తెలుసుకొనుటకు తెలియరానిదనీ బ్రహ్మానందస్వామి చలన మేమియు లేకయున్నదనీ నీమనిష్టలు లేకనదియు మోక్షా క్షేమంగాకయున్నది స్వామి సద్గురుకరుణచె గనుమనుచుయును బోదించెతండ్రీ ॥ఎంత॥

8. వాసిగగొల్లగూడ వాసుడూ నాగుల వెంకటేశం అనువాడు దాసుడూ

నిత్యానంద నిలయమందు శివరామదీక్షిత సంఘములో కొండోజు
బ్రహ్మానంద స్వామికి దోసిలొగ్గిన దాసుడమ్మా ॥ఎంత॥

## లాలి పాట - 3

### ది: 6-10-1984 చతుర్ధశ వార్శికములో సమర్పించినది

1. లాలీ బ్రహ్మానందలాలీ నిత్యానంద నిలయనీకులాలీ నిర్గుణానందలాలీ వందనము బ్రహ్మానందార్యలాలీ వందనమ్ము ॥లాలీ॥

2. అశరీర గురువులారా! ఆశ్రయించేటి భక్తుల్లార దాసులకు తద్దాసుడు యీ గురుడూ సీతయార్యుల పుత్రుడూ యీ గురుడూ సీతయార్యుల శిష్యుడూ ॥లాలీ॥

3. ఈశ్వరసంభూతుడూ యీగురుడూ ఈశ్వరాంబపుత్రుడూ ఈర్ష్యద్వేష రహితుడూ సచ్ఛిష్య సగుణ శాంతరూపుడూ ॥లాలీ॥

4. అచల పరిపూర్ణుడమ్మా యీగురుడు అచలపారంపర్యుడమ్మా అందరికి చూడనమ్మా యీ గురుడు ఆనందసహితుడమ్మా ॥లాలీ॥

5. పాపములు పుణ్యములు యీగురునీ ప్రాప్తించనేరవయ్యా ప్రాప్తించుయెరుక మహిమాతెలియని వారికి చూడరయ్యా ॥లాలీ॥

6. పుట్టడూ గిట్టడమ్మా యీగురుడూ పూర్ణుడైయుండెనమ్మా పుడమిలో యీగురువునూ చేరిన వారెల్ల పూజ్యులమ్మా ॥లాలీ॥

7. ఆత్మాకతీతుడమ్మా యీగురుడూ కేవలాత్మ రూపుడమ్మా తాతలకు తాతయనుచు మీరంత తత్వమునయెరుగరమ్మా ॥లాలీ॥

8. కొండోజు వంశమందూ యీగురుడూ కోటీశ్వరుడనుచు విందూ అంగనలు జూడవిందూ యీగురుడూ అందరికి దీపమందూ ॥లాలీ॥

9. చిలుకలగూడలోన యీగురుడూ పలుకన్నాపలుకలేక అలుక జెందున్నాడయ్య యీగురుడు వులుకులేకుండనయ్యా ॥లాలీ॥

10. దరగొల్లగూడమందూ యీగురునీ నిర్గుణుడనుచువిందూ నరయు వెంకటేశమూ బ్రహ్మానందార్య లాలీదిగోయనెనూ ॥లాలీ॥

11. అందముగమీరలంత యీగురుని ఆనందముగా జూడరయ్యా ఆంధ్రదేశటనుడూ సికింద్రాపురమున వెలెసెవారూ లాలీ బ్రహ్మానందలాలీ నిత్యానందనిలయ నీకులాలీ నిర్గుణానందలాలీ వందనము బ్రహ్మానందార్య లాలీ జై సద్గురు ప్రభుమహారాజుకుజై....

## పాట - 4.

శ్రీగురువేనమః **మేలుకొలుపు పాట** ది: 5-10-1984

**రచన: సద్గురు పాదరేణువు దయానంద నాగుల వెంకటేశం, గొల్లగూడెం**

**నీవుండేదాకొండపైనా స్వామి నేనుండెదీ నేలపై - అనువరుస**

1. నిత్యానిర్గుణానంద కొండోజు బ్రహ్మానందయార్య తెల్లవారె మేల్కోవయ్యా గురుదేవ భవభయములు బాపవయ్యా నిత్యానంద నిలయమందు నిద్రబోయిన దేవ । అల్లదుగో సూర్యుండు అరుదెంచనాయెనయ్యా త్రిజగములు నీవాయెను దేవ । లెండునిద్రలేవయ్యా స్వామీ ॥నిత్యా॥

2. శీతరాముల ఈశ్వరాంబ గర్భజనితంబై ।కొండోజు వంశమును కుదురా జేసిన దేవా మా కోర్కెలు నెరవేర్చురా గురుదేవ కోరినిద్ర మేల్కొవయ్యా ॥నిత్యా॥

3. తాత మహ ముత్తాతల సాంప్రదాయులు చాల వచ్చియు నీకునూ వందనంబులు జేయ వాళ్ళు మరచియున్నావయ్యా గురుదేవ బ్రహ్మానంద మేల్కోవయ్యా ॥నిత్యా॥

4. చుక్కలు మరుగాయే ఘనచీకటి వెలుగాయే । కోడి గూయుచునుండే కోలాహలము నిండే । గురుని కొలువుకు వేళాయెరా । గురుదేవా వాళ్ళు గడిగెదనురా ॥నిత్యా॥

5. పదునారు భువనాలు ప్రజ్వరిల్లుచునుండె యీ కర్మ కొంపలో పదిపిట్ట లోరుచునుండే । యెరుక దూరమాయేరా గురుదేవ । యెందాక లేపుదురా ॥నిత్యా॥

6. పుట్టు గిట్టులు లేని పూర్ణబయలు నందూ మత్తుజెంది యున్నావయ్య మాయరహితుడవయ్యా మమ్ముల ఆపదవికి చేర్చుమూ బ్రహ్మానందయార్య ॥నిత్యా॥

7. రాజాదిరాజులు రాజ్యములు విడచిరి మీబోధకొరకు వారు బేజారులైరి రాజయోగివి తండ్రీ మాకు రాజమార్గము దెల్పరా ॥నిత్యా॥

8. కాశిబుగ్గపురం నుండి నిజానంద రామకృష్ణుడూ నీజనకుని చరితంబు వినజెప్పెటందుకు వొచ్చి కూర్చున్నాడయ్యా నాస్వామి కాళ్ళు మ్రొక్కెద లేవరా ॥నిత్యా॥

9. అందముగా గోవిందమ్మ అక్కవచ్చి కూర్చున్నది భ్రమరాంబ అనసూయమ్మ సీతమ్మగారు । వచ్చి కూర్చున్నారయ్యా దేవ ఆదరించుము స్వామి ॥నిత్యా॥

10. అయ్యా నీదర్మపత్ని సత్యఈశ్వరాంబ ద్వాదశ సేవలు జేయ ధర్మాము వినగోరా లేవు నా స్వామి యనుచు గురుదేవా లేచి చింతాలు దీర్పు ॥నిత్యా॥

11. లక్ష్మీనారాయణ దంపతులు వచ్చిరి సైదాబాదు నుండి సత్యమ్మగారు వచ్చి అదిగో కూర్చున్నదయ్యా గురుదేవా మెల్లన మేల్కొవయ్యా ॥నిత్యా॥

12. కొమరిపాలెము నుండి పూర్ణానందా దేవాదులా ధర్మరాయచార్య కవి దంపతులు వచ్చిరి మాతా పితరులా పద్యములు గురుదేవా వినుమనుచున్నాడయ్యా ॥నిత్యా॥

13. సమిష్టిబోధానంద ఉప్పలంచి వారు మీకు । పాదపుజలు చేస్తు పాటలు పాడుచూ । పాలించుతాడు అన్నా మనప్రభుడు సీతయార్యయోగుడు ॥నిత్యా॥

14. యెట్టివేళ ఎపుడయిన ఎన్నడయిన మిమ్ములమరువని వీరాస్వామిగారు వచ్చి కూర్చున్నడయ్యా లేచి మాటాడుమయ్య గురుదేవా నేరములెన్నకయ్యా ॥నిత్యా॥

15. కళకుంట్ల భక్తులు కలిసిపోవుదమనుచూ కాళ్ళు పట్టుకవారు కరుణించమనుచూ చేయి జాచియున్నారయ్యా గురుదేవా వారి చింతాల తీర్చుమయ్యా ॥నిత్యా॥

16. గొల్లాగూడెం నుండి మోతెక్రిష్ణార్యుల శిష్యుడూ నాగుల వెంకటేశనువాడు తనుమన ప్రాణధనమూ గురుదేవా దారబోసెనులేవరా ॥నిత్యా॥

17. సీతయార్య ప్రభువులా చతుర్ధశ వార్షికమూ నిత్యానందనిలయములో జరుపుసమయమునా యెల్లభక్తులు యేతెంచిరి గురుదేవా నినుపూజింప దలచిరి ॥నిత్యా॥

18. అంగనమణులంతా హారతి నొసగిరి అలిగియున్నావానీవూ అవతార పురుష మంగళం నొసగెదనూ గురుదేవా మళ్ళీ జన్మని మాన్పవయ్యా ॥నిత్యా॥

## పాట - 5

### ది: 12-10-1989 -19వ వార్షికారాధన సమయమున వ్రాసినది

1. హారతులిత్తమురారమ్మా ఆచార్యగురునకు హారతులిత్తమురారమ్మా హారతులిత్తమురారె అందమగు బ్రహ్మానందస్వామికీ నిత్యానంద నిలయమందు పొందుగగూర్చున్న స్వామికి ॥హారతి॥

2. సాంఖ్యతారకమనస్క భావమునూ సాదించి శిష్యుల సౌఖ్యపరచిన గురువరుడితడూ శ్రీకర గురుచరణములనూ ప్రాకటముగ పూజజేసి లోకభ్రాంతినిరోసి దాసుల దాసుడుగ గనిపించె తండ్రికి ॥హారతి॥

3. అందుయిందు సందులేకనూ ఆచార్యగురుడూ అఖండముగా తానిండి యున్నాడూ అరయుగనూ పరిపూర్ణబోధకు హర్షుడైనగురునిగాంచి పరగసీతయార్య ప్రభుని పాదములు గొలిచేటి తండ్రికీ ॥హారతి॥

4. స్థిరముగా సికింద్రాబాదులో ఆచార్యగురుడూ సుస్థిర చిలకలగూడలో చూపురూపులేరుక పరచి సూక్ష్మమైన ప్రత్యగాత్మను పామరులైనట్టి జనులకు పాదుదెలిపె ప్రభుడు యితడనీ ॥హారతి॥

5. దీక్షితాంశగురువరేణ్యుడు నిర్గుణానందుడూ సాక్షిసర్వభూత శాంతుడూ శ్రీదరుల మర్మామెరిగియు శీదాగద్వాదశిని దెలిపె భ్రాంతిరహితుడు బ్రహ్మానందుడు మాయరహితుండు యితడని ॥హారతి॥

6. సత్యమైన స్వామియితడని నిర్గుణానందుడూ సత్యమైన బయలుగనెనానీ సత్య అసత్యాము లెరుకపరచి సమరసైక్యముగానుండిన సతిఈశ్వరమ్మ సమేత స్వామిమంగళ హారతిదియని ॥హారతి॥

7. గొల్లగూడ పురమునందుననూ నిర్గుణానందుల యెల్లావేళలా తలచేవారునూ కల్లాయుగము నందులోన యెల్లతిరిగెటి వెూతెక్రిష్ణుడూ శిష్యా వెంకటేశరమ్మా బ్రహ్మానందుల హారతిమ్మానే ॥హారతి॥

జై సద్గురు ప్రభుమహారాజుకు జై

## 1974లో పరిపూర్ణ పరబయలు సూచన అయ్యనంక ఆ ఆనందములో వ్రాసుకున్నది -నాగుల వెంకటేశం

## తత్వము -6

1. చూచితినయ్యా చూపురహిత మైన బయలు చూచితి నయ్యా
చూచితినయ్యా గురుడు-సూచనచెయ్యగానె ॥చూచితి॥

2. అదిగదిగో చూడుడయ్యా అందరికి లోనబయట. ఆదారించి
యున్నదయ్యా పాద్యమర్ఘ్యము లియ్యరయ్యా ॥చూచితి॥

3. దర్మార్థకామములూ దరికి రానీయదయ్యా స్వర్గ నరకమోక్ష
ములు అపరిదికి లేవయ్యా వినుము ॥చూచితి॥

4. అష్ఠతనువులలోన కష్ఠమనక నిండినట్టి సృష్ఠికి అతీతమై
సమిష్ఠి బావమై యున్నదాన్ని ॥చూచితి॥

5. పామరత్వమైన యెరుక, పాలుమాలిపోయెనయ్యా, ప్రేమమీర
గురునిసేవ నీమముతో జేయరయ్యా ॥చూచితి॥

6. గురువుల నెందరినో గుర్తు జేసుకుంటి నయ్యా యీ గుర్తు
జూపించెటి గురులు నూటిక ఒకరయ్య భువిలో ॥చూచితి॥

7. శ్రీధరశివరామదీక్షిత అప్ప బ్రహ్మసీతరామ ప్రభుడు బాగవత
కృష్ణుడు లక్ష్మణునకు దెల్పిన బయలు ॥చూచితి॥

8. నిత్యానంద సీతాయార్యులు రామలింగ ప్రభువర్యులకు నిత్యా
మైన వస్తువిదియని సత్యాముగ సాయనార్యుకు దెల్పె ॥చూచితి॥

9. సాయనార్యుల వరముచేత దయానంద వెంకటేశుడూ మోతె
క్రిష్ణా గురువర్యుని కరుణా కటాక్షమున ॥చూచితి॥

10. కల్ల నిజమనె యుగములోన గొల్లగూడ మనె పల్లెలోన యెల్ల
బయలై వెలుగుచున్నది, మెల్లగ దరిజేరరయ్యా ॥చూచితి॥

# విరాల్‌డెడ్ పంచాక్షరి మఠము వారు వ్రాసినదాని ఆదారము జేసుకొని రచించిన తత్వము - 7

1. యెటువంటి గురునాథుడే నాజీవన చరితాత్మ్ముడే చాలదయగల పరమాత్మ్ముడే, శిష్యాయిటురమ్మనీ యేకాంతమున బిలచి యెటువంటి గురిదెలిపినాడే ॥నాజీవన॥ ॥యెటు॥

2. సాదులగనుమన్నాడే చాలదర్మముచూడన్నడే సద్గురుసేవలు జేయన్నడే సాదు సద్గురువుల సేవలు జేసితె బాదలు లేవన్నడే ॥నాజీవన॥ ॥యెటు॥

3. మూడు గుణములగనుమన్నడే ముందుమూలం చూడన్నడే ఆరుగుణములు విడుమన్నడే ఆరుమూడు తొమ్మిదా గురుదేవుకర్పించి హారతులిమ్మన్నడే ॥నాజీవన॥ ॥యెటు॥

4. యేడు కిటికీలమేడన్నడే మూడుమూలల నూతన్నడే జోడుతలుపుల దీయన్నడే వేడుకలలరగ వన్నెలకాంతతో గాడరతులను గూడన్నడే ॥నాజీవన॥

5. అష్టతనువులగనుమన్నాడే అష్టమదముల అణచన్నడే అష్ఠపాశముల విడుమన్నాడే అష్ఠతనుకావలున్న ఇష్టగురువిష్ణువనిన కష్టములు దీరన్నడే ॥నాజీవన॥ ॥యెటు॥

6. పంచకోశముల గనుమన్నడే సంచితాగముల దృంచన్నడే ఎంచిషోడశాక్షరి చూడన్నడే అంచితముగ ద్వాదశి అర్థమంతటజూపి పంచదశిని పదిల పరచినాడే ॥నాజీవన॥ ॥యెటు॥

7. పరిపూర్ణమిదిగోయనెనే లేని యెరుకనువివరించెనే యెరుకలేదని కరిగించెనే పరిపూర్ణ బ్రహ్మమున పరగదోచీయెరుక హరిహరసురలాయెనే పిండా బ్రహ్మాండమిది అయెనే గురునిపాడగన్న లేదాయెనే యెటువంటి గురునాధుడే ॥

8. రానిదిపోనిదన్నడే బయలు ఉన్నదికనుమన్నడే యిందులేనిదే యెరుకన్నడే లేనికలదోచినప్పుడు లేని విచిత్రములన్ని లేకనెతోచన్నడే ॥నాజీవన॥ ॥యెటు॥

9. జనన మరణములు లేవన్నడే జన్మకర్మలు రావన్నడే జన్మమూలం లేదన్నడే మనన్సు బుద్ధియులేక మమత యేమియుగాక

నమ్ముపరమిదెయన్నడే ॥నాజీవన॥ ॥యెటు॥

10. బయలులో బయలన్నాడే నిర్భయలులో బయలన్నడే ఆబయలును గనుమన్నాడే బయలులో లేనట్టి దయానందవెంకటేశం భవభయము బాసినాడే ॥నాజీవన॥ ॥యెటు॥

11. పొందిగొల్లగూడలో శ్రీసాందీపమందిరములో భవబంధములు విడిపోయెనే రంది గ్రంధులుబాపి హృదయానందము జేసి సిందువు తెగటార్చెనే నా జీవన చరితాత్మడే చాలదయగల పరమాత్మడే యెటువంటి గురునాథుడే॥

## అలిగినవేళ అనువరస

1. గురుదేవా మీకరుణాజూపవా - కరుణజూపి కడతేర్చరావా ॥గురు॥
తరముగా నీభవసాగరములో - దారిదెలియక ఈదుచుంటి - అరమర శాయక అతిత్వరితముగ ఆదారించే ఆపాద్బాంధవా ॥గురు॥

2. యీషణాత్రయములు విడువకబట్టి - ఆశలెన్నో పాశములై వాసనా త్రయములు వదలకనన్ను - గాసిలజేయగా త్రోసివేయుతండ్రీ ॥గురు॥

3. మన్నుమిన్నుల మధ్య మహాపాపినై - యెన్నో జన్మము లెత్తితినయ్యా ఉన్నదానిజాడ యెన్నడు దెలియలేక - పన్నుగతమచరణంసన్నుతిజేస్తినయ్యా ॥గురు॥

4. అఖిలవేదాంతార్థ అప్రమేయుడవూ ప్రకటితజనులకు పాలీటవేల్పువూ ఈకలికాలము దుఖ్ఖఃజాలము ఇదివిడిపించ దిక్కునీవేనయ్యా ॥గురు॥

5. చెడితిరిగితినయ్యా ఘడియనిలుకడలేక కొడుకుల గనియూ యిడుముల బడితీ పాడుయీసంసారము పరికిపాదలాంటిది విడిపించు తండ్రీ భూ పుణ్యాత్ముడవై ॥గురు॥

6. వ్యసనములన్ని విషపూరితమయ్యి దోషములెన్నో జేసితినయ్యా మోసిమోయలేని కోర్కెలలోబడి బాషించితి దుర్భాషణలెన్నో ॥గురు॥

7. అరిషడ్వార్గములన్ని యేకమై క్రూరమృగముల । వలె వెంటాడియూ తరుమూ చున్నవి ఘోరాడవిలోకి ప్రాణమునిల్వదు పరమార్థము జూపుతండ్రీ ॥గురు॥

8. యీదరలోపల వరగొల్లగూడలో బోదక్రిష్ణుడవయ్యి బోదించినదేవా యీదయానంద వేంకటేశముకూ బాదలుబాపిన భాగేయుడవయ్యా ॥గురు॥

స్వస్తిశ్రీరక్తాక్షినామ సంవత్సర అశ్వీయుజ మాసం 1984న దసర నవరాత్రుల సందర్భంగా బతుకమ్మ పాటగా శ్రీదయానంద నాగుల వెంకటేశం గారు రచించిన సాంఖ్య విచారణ-

## ఉయ్యాల పాట వరుస

1. సృష్టికి పూర్వంబు ఉయ్యాలో - సృష్టికి పరమందు ఉయ్యాలో - సృష్టి ఉన్నప్పుడు ఉయ్యాలో - సృజనంబు లేకనే ఉయ్యాలో - సకల దేశంబులా ఉయ్యాలో - సకలకాలంబులా ఉయ్యాలో - సకల వస్తువులందు ఉయ్యాలో - చంచలము లేకనే ఉయ్యాలో - ప్రాగ్ దక్షిణంబుల ఉయ్యాలో - పశ్చిమోత్తరముల ఉయ్యాలో - నాల్గు మూలలమీద ॥ఉ॥ నడుమనూ క్రిందనూ ॥ఉ॥ అచలమై సత్యమై ॥ఉ॥ ఆద్యంత శూన్యమై ॥ఉ॥ పరిపూర్ణంబుగా ॥ఉ॥ వెలితిలేకుండెనే ॥ఉ॥ బట్టబయలుగాను ॥ఉ॥ యేకమైయుండెనే ॥ఉ॥ యేబాధలెరుగదే ॥ఉ॥ అచలమై యుండెనే ॥ఉ॥ బ్రహ్మవిష్ణుమహేశులు ॥ఉ॥ ఈ బయలుకే మ్రొక్కిరే ॥ఉ॥ ఆత్మకతీతము ॥ఉ॥ ఇదికేవలాత్మందురే ॥ఉ॥ ఈశుద్ధబ్రహ్మమునందు ॥ఉ॥ శబ్దమెన్నడులేదు ॥ఉ॥ పలుకు రహితామైన ॥ఉ॥ పరిపూర్ణమందునా ॥ఉ॥ పలుకు తనకుతానె ॥ఉ॥ పరగలేకనె కలిగె ॥ఉ॥

2. బ్రహ్మంబు అవ్యక్త ॥ఉ॥ అదివ్యక్తమెవరికిగాదు ॥ఉ॥ అవ్యక్తమందునా ॥ఉ॥ మహత్తు కలిగెనే ॥ఉ॥ మహత్తుయందున ॥ఉ॥ మహదాంకారంబు ॥ఉ॥ అహంకారమందునా ॥ఉ॥ పంచతన్మాత్రలేర్పడెనే ॥ఉ॥ తన్మాత్రలా స్థూలంబు ॥ఉ॥ పంచభూతంబు లాయెనే ॥ఉ॥ పంచభూతాలచే ॥ఉ॥ పరగజగమేర్పడెనే ॥ఉ॥ అట్టిజగమునందు ॥ఉ॥ జనులెట్లు గలిగిరీ ॥ఉ॥ జీవసృష్టివిధము ॥ఉ॥ మరి తెలియ జెప్పెదవిను ॥ఉ॥

3. ఆకాశ సూక్ష్మంబు ॥ఉ॥ శబ్దమై యుండెనే ॥ఉ॥ శబ్దనిజాంశంబు ॥ఉ॥ జ్ఞానంబుఆయెనే ॥ఉ॥ వాయువు సూక్ష్మంబు ॥ఉ॥ స్పర్శయై వుండెనే ॥ఉ॥ స్పర్శనిజాంశంబు ॥ఉ॥ వ్యానవాయువాయె ॥ఉ॥ అగ్నిసూక్ష్మంశంబు ॥ఉ॥

రూపమైయుండెనే ॥ఉ॥ రూపనిజాంశంబు ॥ఉ॥ చక్షువేర్పాటాయె ॥ఉ॥ జలమొక్క సూక్ష్మంబు ॥ఉ॥ రసమైయుండెనే ॥ఉ॥ రసము నిజాంశంబు ॥ఉ॥ రసేంద్రియామాయె ॥ఉ॥ పృథివి సూక్ష్మంశంబు ॥ఉ॥ గంధమై యుండెనే ॥ఉ॥ గంధనిజాంశంబు ॥ఉ॥ గుదమేర్పాటాయె ॥ఉ॥ జ్ఞానంబు వ్యానంబు ॥ఉ॥ చక్షురసగుదములూ ॥ఉ॥ ఈఅయిదు తత్వాదులు ॥ఉ॥ జీవపిండ తన్మాత్రలే ॥ఉ॥

4. జ్ఞానమందొక భాగం ॥ఉ॥ నాల్గుభాగాలాయె ॥ఉ॥ అందు మొదటిభాగం ॥ఉ॥ వ్యానవాయువు గూడి ॥ఉ॥ మనసుయేర్పాటాయె ॥ఉ॥ మనసుంచి వినవేమె ॥ఉ॥ రెండవభాగంబు ॥ఉ॥ చక్షువునూ జేరి ॥ఉ॥ బుద్ధి యేర్పాటాయే ॥ఉ॥ యిది అగ్నితత్వంబె ॥ఉ॥ మూడవ భాగంబు ॥ఉ॥ రసేంద్రియము జేరి ॥ఉ॥ చిత్తంబు పుట్టెనే ॥ఉ॥ యిదిజలతత్వంబె ॥ఉ॥ నాల్గవ భాగంబు ॥ఉ॥ గుదమందున జేరి ॥ఉ॥ అహంకారమే బుట్టె ॥ఉ॥ యిది పృథివి తత్వంబె ॥ఉ॥ జ్ఞానంబు మనంబు ॥ఉ॥ బుద్ధిచిత్తాంకారం ॥ఉ॥ యీ అయిదు తత్వాదు ॥ఉ॥ అంతరేంద్రియాదులే ॥ఉ॥

5. వ్యానమందొక భాగం ॥ఉ॥ నాల్గుభాగాములాయె ॥ఉ॥ అందుమొదటి భాగం ॥ఉ॥ జ్ఞానంబును జేరి ॥ఉ॥ సమానవాయువాయె ॥ఉ॥ ఆకాశతత్వంబిదె ॥ఉ॥ రెండవభాగంబు ॥ఉ॥ చక్షువునూజేరి ॥ఉ॥ ఉదానవాయువాయె ॥ఉ॥ ఇది అగ్ని తత్వంబిదె ॥ఉ॥ మూడవ భాగంబు ॥ఉ॥ రసమందు జేరియు ॥ఉ॥ ప్రాణవాయువాయె ॥ఉ॥ ఇదిజలతత్వంబె ॥ఉ॥ నాలుగవ భాగంబు ॥ఉ॥ గుదమును జేరియు ॥ఉ॥ అపాన వాయువాయె ॥ఉ॥ ఇది పృథివి తత్వంబె ॥ఉ॥ సమాన వ్యానంబు ॥ఉ॥ ఉదాన ప్రాణఅపానంబు ॥ఉ॥ ఈ అయిదు తత్వాదులు ॥ఉ॥ ప్రాణేంద్రియాదులే ॥ఉ॥

6. చక్షువందొకభాగం ॥ఉ॥ నాల్గుభాగాలాయె ॥ఉ॥ అందుమొదటి భాగం ॥ఉ॥ జ్ఞానంబును జేరి ॥ఉ॥ శ్రోత్రంబు ఆయెనే ॥ఉ॥ ఆకాశతత్వమిదె॥ఉ॥ రెండవభాగంబు ॥ఉ॥ వ్యానవాయువుజేరి ॥ఉ॥ త్వక్కుయేర్పాటాయే ॥ఉ॥ ఇదివాయుతత్వంబె ॥ఉ॥ మూడవభాగంబు ॥ఉ॥ రసంబునూ జేరి ॥ఉ॥ జిహ్వాయేర్పాటాయె ॥ఉ॥ ఇది జలాతత్వంబె ॥ఉ॥ నాలుగవ భాగంబు ॥ఉ॥

గుదమునందు జేరి ॥ఉ॥ ఘ్రాణమేర్పాటాయె ॥ఉ॥ ఇది పృథివితత్వంబె ॥ఉ॥ శ్రోత్రంబు త్వక్కునూ ॥ఉ॥ చక్షుజింహాఘ్రాణంబు ॥ఉ॥ ఈ అయిదు తత్వాదులు ॥ఉ॥ జ్ఞానేంద్రియాదులే ॥ఉ॥

7. రసమందునొక భాగం ॥ఉ॥ నాల్గు భాగంబులాయె ॥ఉ॥ అందు మొదటి భాగం ॥ఉ॥ జ్ఞానంబునూ జేరి ॥ఉ॥ శబ్దంబు ఆయెనే ॥ఉ॥ ఆకాశతత్వమిదె ॥ఉ॥ రెండవభాగంబు ॥ఉ॥ వ్యానవాయువుజేరి ॥ఉ॥ స్పర్శంబు ఆయెనే ॥ఉ॥ వాయుతత్వంబిదె ॥ఉ॥ మూడవభాగంబు ॥ఉ॥ చక్షువందున జేరి ॥ఉ॥ రూపంబు ఆయెనే ॥ఉ॥ అగ్నితత్వంబిదె ॥ఉ॥ నాల్గవభాగంబు ॥ఉ॥ గుదమునందున జేరి ॥ఉ॥ గంధంబు ఆయెనే ॥ఉ॥ పృథివి తత్వంబిదె ॥ఉ॥ శబ్దంబు స్పర్శంబు ॥ఉ॥ రూపరస గంధములు ॥ఉ॥ ఈ అయిదు తత్వాలు ॥ఉ॥ విషయేంద్రియాదులే ॥ఉ॥

8. గుదమందు నొకభాగం ॥ఉ॥ నాల్గు భాగములాయె ॥ఉ॥ అందుమొదటి భాగం ॥ఉ॥ జ్ఞానంబునూ జేరి ॥ఉ॥ వాగింద్రియామాయె ॥ఉ॥ ఆకాశ తత్వంబిదె ॥ఉ॥ రెండవ భాగంబు ॥ఉ॥ వ్యానవాయువు జేరి ॥ఉ॥ పాణింద్రియామాయె ॥ఉ॥ వాయుతత్వంబిదె ॥ఉ॥ మూడవ భాగంబు ॥ఉ॥ చక్షువునూజేరి ॥ఉ॥ పాదేంద్రియామాయె ॥ఉ॥ అగ్నితత్వంబిదె ॥ఉ॥ నాల్గవ భాగంబు ॥ఉ॥ రసేంద్రియము జేరి ॥ఉ॥ గుహ్యంబు ఆయెనే ॥ఉ॥ జలతత్వంబిదె ॥ఉ॥ వాక్కుపాణిపాదం ॥ఉ॥ గుహ్యంబు గుదమును ॥ఉ॥ ఈఅయిదు తత్వాదులు ॥ఉ॥ కర్మేంద్రియాదులే ॥ఉ॥

9. దరయందు గొల్లగూడ ॥ఉ॥ పురనివాసులమ్మ ॥ఉ॥ జన్మకర్మములేని ॥ఉ॥ మర్మమెరిగిన వారు ॥ఉ॥ దయానంద దేవునికి ॥ఉ॥ దర్మపత్నియగు ॥ఉ॥ లావాణ్యగుణశాలి ॥ఉ॥ లక్ష్మీదేవమ్మనే ॥ఉ॥ భక్తకోటి కొరకు ॥ఉ॥ బావించినడిగెనే ॥ఉ॥ వెరువక పల్కెనే ॥ఉ॥ వెంకటేశ గురుడు ॥ఉ॥ ప్రపంచ ఉత్పత్తి ॥ఉ॥ పరగదెల్పెనమ్మ ॥ఉ॥ ఇది గొల్లగూడెంలో ॥ఉ॥ వినిపించే భక్తులకు ॥ఉ॥ సాంఖ్యంబు వినివారు ॥ఉ॥ సంతసించిరమ్మ ॥ఉ॥ సాష్టాంగ దండములు ॥ఉ॥ స్వామితల్లికి జేసిరి ॥ఉ॥ సృష్టికి పూర్వంబు ఉయ్యాలో...

జైసద్గురు ప్రభుమహారాజుకు జై

ఓం

శ్రీగురుభ్యోనమః

శ్రీ దయానంద నాగుల వెంకటేశం గారిని గౌరవించి సాంప్రదాయపెద్దలు కవిపండితులు వ్రాసిన కవితలు ప్రశంసలు-పద్యరత్నములు

ది: 21-3-1985 **శ్రీనిత్యనిర్గుణానంద కొండోజు**

**బ్రహ్మానందార్యులవారి గురుచరణదాసుడు**

**జి. వెంకటేశ్వర బాగవతార్**

-చీరాల, ప్రకాశం జిల్లా.

గీ॥ ధరణి నాగుల వంశోద్ధారకుండు
రామలింగాఖ్య గురుపదసేవకుండు
సచ్చిదానంద సద్గురు సాయనార్య
గొల్లగూడెము భక్తులు గొల్చినారు ॥

కం॥ క్రోధనవత్సర ఫాల్గుణ ద్వాదశి వార్షిక పూజ దశమిని జరిగెన్
మోదముతో సాయనగురు పాదములకు పూజజరిగె భక్తులు బొగడన్

సీ॥ సమరసానందుండు శ్రీమోతె క్రిష్ణయ
స్వాగతంబును ముందుజేసినారు
వరదయానందుండు వెంకటేశంబును
గురుదేవునకు మాలగూర్చినారు
గురుపుత్రుడగుటంగుటూరి నారాయణ
గురుభజనతోడుత గదలినారు
మహిళామతల్లులు అహమును విడనాడి
గురుమూర్తి పాదములు గడిగినారు
సన్నాయి మేళముతో జెండానుజేపట్టి
విఠలయ్య గృహముకు వెడలినారు ॥

గీ॥ బ్రహ్మానందార్యుచే జండా పూజనంబు

నెమ్మిగావించి గురుపూజ నెరపినారు
భక్ష్యభోజనములు ప్రేమ బెట్టినారు
భళిర మీకీర్తి జగమున వెలయుగాత ॥

సీ॥ తంగడిపల్లి బస్సు తరలివచ్చితిమయ్య
కమ్మెట మార్గంబుకాలిబాట
గొల్లగూడెంబన్న ఎల్లరి కెరుకేను
మూర్తిచిన్నదెగాని కీర్తిగొప్ప
మృణ్మయంబుదెగాని చిన్మయంబులు మీరు
గురువాక్యమును గుర్తునిలపినారు
పలుప్రాంతములనుండి భక్తుల బిలిపించి
అచలబోధను వ్యాప్తిజేసినారు ॥

గీ॥ దేహిదేహముగాకను అహమువిడచు
త్యాగమూర్తుల దర్శింప ధన్యమయ్యె
అమ్మలార వినుడి ఓ అయ్యలార
అందుకొనుడయ్య ద్వాదశి వందనములు
వాసిగల గొల్లగూడ వాస్తవ్యులార ॥

గీ॥ బండలేదోచె నిచ్చోటమెండుగాను
గుండెజూచిన మెత్తనై గోచరించె
విమల భావంబు మీయందు విస్తరించె
భవ్యగుణులార గొల్లగూడ వాస్తవ్యులార ॥

తే॥ గీ॥ నాగుల చన్‌బసప్పను నారి రుక్కమ్మ పుణ్యదంపతులకున్
జనియించిన వరపుత్రుడు దయానంద వెంకటేశమార్యుల్
సాయనగురు వార్షికంబు సలుపగ మేమున్ వచ్చితిమి
వైభవముగ వర గోపాలపురము వరుసగయిపుడున్ ॥

ది: 1-11-1987 అచలానంద పోటేలు రామచంద్రారావు గారు, చిట్టివలస.

సీ॥ వందనమిదె దయానంద నాగుల వెంక
టేశ నామదియందు నెపుడు మిమ్ము
దలచెదనిరతము ధర్మమూర్తి వటంచు
జ్ఞాననిరతుడంచు గాంచినాను
గొల్లగూడెమునందు గురుమూర్తికిని కీర్తి
ప్రఖ్యాతిదెచ్చిన పరమపురుష
భక్తజనులు మిమ్ము ప్రస్తుతించిన యెడ
ఆనందమును జెంద వాత్మలోన

తే॥గీ॥ శుద్ధసాత్విక గుణుడవు సుగుణవంత
ఆదిమద్యాంతరహిత శ్రీ అప్రమేయ
నాదుబిందు కళాతీత నవ్యచరిత
యెల్లవేళల గురుని నీ యుల్లమందు
దలచుచుందువు భక్తితో ధన్యచరిత
విను దయానంద నాగుల వెంకటేశ ॥

కం॥ నరజన్మమెత్తినందుకు
పురుషుడవై బ్రహ్మవిద్య బొందిననీవున్
ధరలో నీజన్మధన్యము
గురుదీవెనలున్న నీకు కొదువయుగలదే ॥

తే॥ సత్యగుణములు గలిగిన సద్గుణుడవు
శాంతశమదమములు గల్గు సమరసుడవు
గురుజనములను సేవించు గుణవిభుడవు
వినుతగుణ సత్యజనపోష వెంకటేశ ॥

మ॥ దయదాక్షిణ్యములున్నవాడవు సుమీ ధర్మంబు శాంతంబుతో
నియమున్ లేకనుయున్నవాడవుసుమీ నీధ్యానజ్ఞానంబుతో
జయమున్ బొందియుయున్నవాడవు సుమీ సద్బోధ మర్మంబుతో
భయమేమాత్రము లేకయుందువు సుమీ భద్రంబుసద్గోష్ఠితో ॥

చం॥ చదివితి నీదువుత్తరము చక్కనిపల్కులు భావమంతయున్
మదినిగ్రహించి మీపయిని పద్యమువ్రాయగ బూనినాడ ఈ
సుదినముగల్గినందుకు మహోన్నతమయ్యెను నాదుమానసం
బిది ఒకపర్వమంచనియు నెంచెద నాగుల వెంకటేశ్వరా ॥

**ది: 6-11-1989 తగరపువలస- ప్రేమానంద పరిమి ఆదినారాయణ**

ఉ॥ నాగులవెంకటేశ గురు నాయనగారికి నానమస్తుతుల్
శ్రీగురుదేవదీవెనలు క్షేమమొసంగును గాక యీపయిన్
రాగలమేలు కీడులును రాగముద్వేషములేక జూచుచున్
శ్రీగురువర్పణంబనుచు జేసుకపోవుటే క్షేమదాయకం ॥

కం॥ అందమగు రాజమార్గమునందున చరియించి బోధ నార్చుచుమిగులన్ పొందుగ పరమెరుకలనెరిగెందున యెరుకేమిలేదా ॥ద॥ నెరిగించినారూ బింధుత్రయము చేధించినారూ అందాముగాదయా నంద వెంకటేశ పొందూగ మనసందూ పూజాజేయుచునుందు

॥మి॥ బంధరహితా నింద్యనిర్గుణ వందితా నిర్ధేహివిదయానందస్వామి భజింతునే నిర్ద్వంధకా స్తుతింతు మిమ్మిక నెరిగించినారూ బింధుత్రయము చేధించినారూ ॥

కం॥ అయ్యా కృతిమీమీదనూ జెయ్యాలని
వూహబొడమి జేసితిదీనం
దుయ్యాలలూపి వ్రాతును అయ్యా
మీకృతినిమతిని నతిహర్షముతోన్

సీ॥ చాటిచెప్పిరికదా సకలదేశములందు
సర్వకాలముల శాశ్వితపదమ్ము
వుద్ధరిస్తిరికదా వద్దకువచ్చిన
శిష్యప్రశిష్యుల చేరదీసి
రద్దుచేస్తిరికదా రాకపోకలురెండు
కాల్చిరిమాజన్మకర్మచయము

అందజేస్తిరికదా అమృతపదమైన
మాకిల మోక్షసామ్రాజ్యలక్ష్మి

గీ॥ గొల్లగూడెంబునందున కొల్వుయుండి
అచలపరిపూర్ణ శ్రీదయానందులగుచు
శిష్యజనులను బ్రోవంగ శ్రేష్టముగను
యలరుచున్నారు వేంకటయార్యులగుచు ॥

చం॥ తదితరపెద్దలందరిని దైవసమానులటంచు దల్చినా
మదిగలవిన్నపంబులను మానితమొప్ప వ్రాయుచుంటివి
పదుగురు బోధజెందిభవ భందములొందక నుండగాదగున్
కుదురుగ గుర్తునిల్పి మనగూడదు కూడిన జన్మహేతువే దయానంద॥

ఉ॥ఆదివిరాట్టు యీశ్వరుడు యాదిగవిష్ణుని సాంప్రదాయకుల్
సాధులు సద్విచారకులు స్వాములు శ్రీశివరామదీక్షితుల్
యాదిగవంశజాన్వయులు యార్యులు శ్రీలయినప్పలార్యులన్
మోదముతోడదల్తుమును ముందుగనామది దయానందులన్ ॥

ఉ॥తెల్పెగురుండు ద్వాదశిని తేటగనంతటగల్లటంచునూ
మల్పెగురుండు షోడశిని మయయటంచును లేనిదెంతయున్
నిల్పెగురుండు పంచదశి నెంతయుకర్పూరదీపమున్గొనిన్
తల్పుగురుండు యాదిపర తంత్రుడు యీశ్వరుడెంచిచూడ
యీదయానందుల్ ॥

చం॥ అరయగనేనులేననుచు యాంతరమందునదల్చుచుండుమీ
తెరవికలేదునిల్చుటకు తేటగనేటితో తీరిపోయెరా
గురుడెరిగించె ధీనినిక గూడకయుండుటె నీకుమోక్షమం
చెరుగుము విత్తులేనపుడు చెట్టెటులుండును చూడగాధరన్ ॥

ఉ॥ పొల్లుగజూడమీయెరుక పొందుగనెచ్చట నిల్వబోదునీ
యుల్లమునందు జూడుమిక యొప్పుగనంతనేకమైన దాన్
తెల్లముజేయుగాగ గురుతెల్లనుదీయునుగాగ నీవుయున్
మల్లికరావుజన్మముకు మద్గురు శ్రీదయానంద మాయారహిత ॥

చం॥ యెరుకనువీడు వానిగతి యేవిధినుండునొ యెంచిచూడగన్
గురుతును లేకనుండు తనకున్నది తిన్నది అన్నదిన్నదిన్
మరుపునులేక నేననెడి మానముబూనడు హేయమంచుదాన్
నిరసనజేసిలేననెడి నిశ్చయమొంది చరించుచుండుదాన్ శ్రీదయానందా

ఉ॥ లేకనెవున్నదానిగని లోకులనేకులు భ్రాంతిలోబడిన్
రాకడపోకడల్బడి నిరతము బాధలనొందుచుందురున్
రాకనుపోకలేకనొక రీతిగనున్నది జూపుసద్గురున్ జోకతోజేరి
గొల్చినను జూపును మీకుయదార్థమంతయున్ యీదయానందుల్॥

కం॥ ఇప్పగదిగజెప్పితినని తప్పుగభావింపవద్దు తగదెలియుడి మీ
రెప్పుడు నాచిత్తమ్మున నొప్పుచునుండుటచే జెప్పనొప్పితినయ్యా॥

## ది: 20-6-1994 - కనికి బుగ్గదాసు, సోలాపూర్

కం॥ సృష్టిలో శ్రీగురుదేవుని నిష్టతోముదమందుదలచి నేపనులైనన్
స్పష్టముగ జేయజయమగు శిష్టస్థితవెంకటేశ శ్రితజనపోషా॥

కం॥ పూర్వమున పూజ్యపురుషులు పార్వతిపరమేశులవలె ప్రత్యక్షముమీ
రిర్వుసతిపతులుయిపుడీ పూర్విలోజన్మించినట్లు వూహకుదోచెన్॥

కం॥ తలిదండ్రిగురుడువీరలె కలియుగమున దేవులనుచు గనినమ్మికతో
గలిగుండువరకు సేవయుసలిపినయిక మీవారితోటి సాటెవ్వరిలన్॥

## ది: 26-3-2003 - వలుకుల వెంకటసుబ్బారావు, నీలకంఠపురం, చీరాల

1. ఆంధ్రరాష్ట్రమ్మున అలరారుచున్న రం
గారెడ్డి జిల్లాను గాంచు మదిగో
అలరుచేవెళ్ళ మండలమయ్యదియె అదే
కమ్మెట గ్రామముగాంచుమదిగో
గొల్లగూడెమనంగ నెల్లరు నుతియింప
ఖ్యాతివహించిన గ్రామమదిగో
ఆ"సమరసానంద" ఆ మోతెక్రిష్ణయ్య

ఆవాస మదిగో అయ్యదిగో వారి
శిష్యుడౌ సద్గురుశ్రీ "దయానంద" నా
గుల వెంకటేశము గురు గృహమ్ము
ఆ ప్రక్కనున్నది అచలర్షి సాందీప
పరిపూర్ణ గురుమూర్తి ప్రాంగణమ్ము
అందునేటేట చైత్రమ్మునందు శుద్ధ
పంచమికి భక్తులెల్లరు భక్తిశ్రద్ధ
రాగ, గురుపూజ నిష్ఠతో రాత్రిపగలు
చేయుదువు "దయానంద" సచ్ఛిష్యవర్య!

2. గురుశిష్యవాసమై గొల్లగూడెమువాసి
గాంచెను భక్తుల కాంక్ష దీర్చ
అశరీరులను జేయు నాకాంక్షగలదియై
భ్రాంతిరహిత బోధ పండితాళి
మెచ్చజేయుచునుండె మించిన వేడ్కతో
అచలపతాక మాకసమునెగుర
చైత్రమాసమ్మున చను శుద్ధపంచమి
దినమున గురుపూజ దివ్యముగను
చేయుచుండ దయానంద చిద్రహితుడు
గురులు శిష్యులతోగూడి కొలువుచేయ
భ్రాంతితొలగించు సద్గురు భవ్యబోధ
వీనులకువిందుజేయంగ వినగజేయు ॥

3. అహమననెట్టిదో అసలు మరచినవాడు
భ్రాంతిరహితబోధ పలుకునాడు
అశరీరి అచలర్షి అచలసేవా సమాఖ్యకున్
సేవలందించెడు సిద్ధమూర్తి
గురువుకు ప్రఖ్యాతి గూర్చెడు శిష్యుడై
భ్రాంతిరహితపరచు పరమగురుడు
మాటలుగాదు మోమాటము వలదని

నిజగురుబోధను నేర్పుగురుడు
చావుజన్మలు తొలగించు చక్కనైన
భవ్య నిజగురుబోధను బాగనెరిగి
కర్తృరహితమ్ముగా సదా కర్మజేయు
పద్ధతెరిగించువాడైన పరమగురుడు
సాధు నాగులవెంకటేశము గురుండు ॥

4. పొట్టివాడీతడైనను గట్టివాడు
భ్రాంతిరహితులగావించు వామనుండు
చిన్నవాడుగ గనిపించు చిద్రహితుడు
ఇతడు శ్రీదక్షిణామూర్తి ఇతడు ఘనుడు ॥

5. అలరు లౌకికధన కుబేరులకు మీరు
చూడకడు బీదవారెంత చోద్యమిదియ
అచలగురుదృష్టి జూడగ ఆకుబేరు
లెంత నిరుపేదలో మీకు ఎరుక వారు ॥

6. అశరీరభావాన్ని ఆంధ్రరాష్ట్రమెగాక
రాష్ట్రేతరాల విరాజిలంగ
శ్రీధర శివరామ సిద్ధాంత సారాన్ని
గ్రామగ్రామాలలో గణుతికెక్క
బోధజేసిన ఘనుల్ బుధజనమాన్యులు
అచలర్షుల శరీరులమరవరులు
ఆవరణమున నిరావరణము జూపి
ఎరుకను విడిపించు పరమగురులు
సాధుసజ్జన మాన్యులు సద్గురువులు
చేయుచున్నారు గురుపూజ శ్రీనిమించు
అచలబోధను ఘనులచే నాలకింప
జేయుచున్నారు మీరలుచిద్రహితులు ॥

7. అచలగురుపీఠ రాజయోగాశ్రమాల
సేవజేయుసమాఖ్యకు చిన్నదైన

ఈయ దనుబంధపీఠమై ఎల్లకాల
ముందు సత్కీర్తి పొందును నిండుగాను ॥

**దీ: 23-4-2008 -శ్రీసదానంద వేముల సత్యనారాయణ**
రేగుల అవుతాపురం, వరంగల్.

కం॥ రాగలోలతగాంచిన వేగముగలిపించి
జ్ఞాన వాగ్మయమందున్
శ్రీ నాగులవెంకటేశము సాగిన
అచలప్రభోధ సోదించదగున్ ॥

కం॥ జాగొని సంసారకలను లేగని
నిత్యసత్యమచల లక్షణయుతమున్
నాగులవెంకటేశములా గని
పరోక్షముగన వలయునుదాత్రిన్ ॥

కం॥ ఈగతి సంసారభ్రమను త్యాగము
జేసితరచియు తానునుదానిన్
శ్రీనాగులవెంకటేశము వేగము
జేసితెలుపును వేదాంతంబవలన్ ॥

ఆ॥వె॥ శ్రీధరశివరామదీక్షిత దివ్యానుపదముల
వాదాతీతశృతుల వాంగ్మయమున
శ్రీదయానందనాగుల వెంకటేశాఖ్యులు
సోదాహరణంబుగ సాగించుసభన్ ॥

కం॥ బొంకుటకలవిగానిది సంకటములు లేనిది విషయాదులకున్
బింకమునబోవనిదిసద వెంకటేశం నాగులకది అంకితమాయెన్ ॥

కం॥ బోదయనగనేదొ పరిశోదననగ యెరుకమరి । శొకటి జేయన్
సాదననగయదెసుమ బాదలొదలెటిబోధ । భద్రయశమున్ ॥

కం॥ వేదాంతసభలయందున వాదంబులులేనియచల వాచాస్థితినన్
బేదంబులేని సమ్మతబోధందున బయలుగాంచె బుదశయులారా॥



ఓం
శ్రీ గురుభ్యోనమః
శ్రీ క్రిష్ణ పరబ్రహ్మణే నమః



# శ్రీ కృష్ణోద్ధవార్జున సంవాదంబను
# జ్ఞానాతీత బోధిని

గ్రంథ కర్త :
**శ్రీ పండిత లైను అప్పలాచార్య
పూర్ణానంద సరస్వతి స్వాములవారు**
**పెద్దమానపురం, విజయనగరం జిల్లా.**

గ్రంథ సేకరణ - ముద్రితులు :
**శ్రీ దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**
**సాందీపాశ్రమం, గొల్లగూడెం.**

ప్రతులు : 1000
తేది : 21-3-2010

## శ్రీ సర్వాత్మానంద మజ్జి లక్ష్మణాచార్యుల ప్రియశిష్యులు



గ్రంథ కర్త :

## శ్రీ పండిత లైను అప్పలాచార్య పూర్ణానంద సరస్వతి స్వాములవారు

# పరంపరా ధ్యానశ్లోకాలు

శ్లో॥ గురుర్బ్రహ్మాః । గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మాః । తస్మైశ్రీ గురవేన్నమః ॥

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మ విద్య సాంప్రదాయ కర్తృభ్యో ।
వంశ ఋషిభ్యో । మహద్భ్యో । నమో గురుభ్యః ॥

శ్లో॥ సర్వోప ప్లవ రహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో ।
బ్రహ్మైవాహ మస్మి । అహం పదార్థరహితః ॥

శ్లో॥ శ్రీ బ్రహ్మ విద్యా గురు విష్ణు సూర్యం శ్రీయాజ్ఞవల్క్యం జనకం శుకంచ ।
సాందీప మీశం కృష్ణంచ అర్జునం ఉద్ధవ గురున్మే గురు పాదుకాంతం ॥

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధాకారణ మవ్యయం ।
భావాతీత మహం వందే । సుఖ జ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారు జనమందారం । వందే హంత న్నిరంతరం ।
రామదుగు పంశజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితం ॥

శ్లో॥ యస్య బోధో దయాసర్వం । బ్రహ్మై వేద్య వగమ్యతే ।
శివరామే విధిఖ్యాతం । తద్దైవత ముపాస్మహే ॥

శ్లో॥ కామాధి రిపు హంతారం । రామలింగాచార్య చరణామృత ।
పానసారంగం పరమారాధ్య గురుం పరంధ్యానం వందేమద్గురుం ॥

శ్లో॥ శ్రీమద్దేశికాన్వయయాబ్ధి పూర్ణ చంద్రమనోరమం నిత్యసాంద్ర ।
కృపామృతం మతీకృతే శ్రీత్సత్ నాగనాచార్య గురుంపరం ॥

శ్లో॥ శ్రీనాగనాచార్య పాదకమలామృత పానభృంగం భావాతీతం ।
పరమగుహ్య లభ్యం బలరామాఖ్య పండితం ॥

శ్లో॥ బలరామార్య చరణ సేవాధురంధర అచలపరిపూర్ణ
కేవలాత్మ స్వరూపకం శ్రీకృష్ణమాచార్య పాదద్వంద్వం భజే ॥

శ్లో॥ శ్రీబృహద్వాశిష్ట సద్విచార సాధుమార్గవర్తనం ।

శ్రీకృష్ణమాచార్య పాదపంకజ చంచరీకం శ్రీరాజయోగ
కులవార్ధి పూర్ణస్తోమం శ్రీరొంగల వంశాబ్ధిచంద్ర
మనోరమం శ్రీసన్యసాచార్య సద్గురు చరణం భజామ్యహం ॥

శ్లో॥ క్షరాక్షర విలక్షణాభ్యాం దృగ్దృశ్యాతీత పరమబోధకం
అవాఙ్మానసగోచర మార్గవర్తనం పరిపూర్ణాచల నిరుపమాన
సన్యసార్య పాదద్వంద్వ సేవనం ఆయంవ్యర్థ బాహకోపీనాం భవతిశ్చ

శ్లో॥ భావకం శ్రీశివరామ దీక్షితార్యసిరతిశయ నిర్వికారబోధ
ప్రచురణం శ్రీమజ్జివంశ పారావారసుధాకరం
శ్రీసర్వాత్మానంద లక్ష్మణార్య స్వగురుచరణం భజామ్యహం ॥

శ్లో॥ శ్రీలక్ష్మణార్య పరతత్వబోధకం త్రికూటస్థనిరసనం
జడాజడరహితం జాగ్రతస్వప్న సుషుప్త్యాది అవస్థాహరణం
మరువు సుషుప్తిమూర్ఛ మరణసమాధి వర్జితం
ఆత్మానాత్మరహిత మచలపరిపూర్ణ పరమపరతత్వ ప్రచురణం

శ్రీలక్ష్మణాచార్య పాదద్వయ పూజనం శ్రీలైనువంశ
పారావార సుధాకరం శ్రీసర్వాత్మానంద ప్రపంచరహితం
శ్రీసద్గురు మహాప్రభో అప్పలాచార్య దీక్షానామం
శ్రీ పూర్ణానంద సరస్వతీస్వామి స్వగురుచరణం భజామ్యహం ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం । కృష్ణ సాందీప మధ్యమాం ।
శ్రీ మహావిష్ణు పర్యంతాం । వందే గురు పరం పరాం ॥

# కథా ప్రారంభము

అర్జునుడు :- ( శ్రీ కృష్ణభగవానుడు సెలవిచ్చు విధానంబుగా జ్ఞాన భక్తి వైరాగ్యమును బూని దాన ధర్మ యజ్ఞయాగాది క్రతువులను చేయుచు, జప పూజలను సలుపుచు మంత్రములనుచ్చరించుచు, నుదయ సాయంకాలములయందు సంధ్యా వందనాదులు సలుపుచు, భగవద్గీతను పారాయణము జేయుచు నొక దినంబున శిరస్నానముజేసి పట్టువస్త్రముగట్టి పట్టినామాలు దిద్ది ధౌత వస్త్రమును ఆసనముగావేసి దానిపైని పద్మాసనుడై అధిష్టించి బహునిష్ఠాగరిష్టుడై విశిష్టద్వైతపరుడై భగవద్గీతను పారాయణము జేయుచుండ...)

ఉద్ధవుడు :- (తనలో అర్జునుని క్షేమమును చాలా దినముల నుండి చూచుటలేదు, చూచివచ్చెదనని ప్రయాణంబై)

"తోహర"

ధనుంజయుని క్షేమమును జూచుటకు - ధనమిత్రుం డటువచ్చెన్
ఆ నరుడంతట నుద్ధవునింగని - యభిమానముతో నుడివెన్
ఎచ్చటనుండియు వచ్చుచుంటివో - ఇటు ఉద్ధవ రమ్మనుచున్ ముచ్చటగా
తా బల్కుచుండెను - ముదమున కిరీటి వేగన్ ॥

అర్జునుడు :- ఉద్ధవా, అదిగో ఆసనము కూర్చుండుము.

ఉద్ధవుడు :- (ఆసనముపైని అధిష్టించును)

అర్జునుడు :- (జపపూజలను జేయుచు మంత్రముల నుచ్చరిచుచు, అందుకు తగిన క్రియలను చేయుచుండ)

ఉద్ధవుడు :- పకాలున నవ్వెను. (అంతట అర్జునుడు జపపూజ క్రియలనుమాని యుద్ధవుని జూచుచు, ఖిన్నుడై చిన్నబోయి ఆహా! ఇతడెందుకు నవ్వెను. నవ్వుటకు కారణమేమి? కారణములేని నగవుండబోదని తనలో తానాలోచించుచు.)

అర్జునుడు :- ఉద్ధవా !

కం॥ ఎందుకునవ్వితి విట్టుల

సందేహముగల్గె మదికి, చక్కగ నాకున్
ముందుగ వచింపు ముద్ధవ
ఇందేమియు తప్పుగలదొ యేర్పడురీతిన్ ॥

అర్జునుడు :- ఓయి ఉద్ధవా ! ఎందుకు నవ్వితివి కారణములేని నగవుండబోదు. గాన కారణము దెల్పుము

ఉద్ధవుడు :- "తోహర"

పిచ్చివానివలె యుచ్చరించెదవు - పిచ్చిపనులు విడు ఫల్గుణా
అచ్చమునంతట పెచ్చుగనున్నది - అచ్చముగనుమా యర్జునా
నిర్గుణమెరుగక సగుణక్రియలను - నిల్పుచుంటివో ధనంజయా
నిర్గుణ నిష్క్రియ నిర్వికారము - నిత్యంబున్నది జూడుమయా ॥

అర్జునుడు :- ఆహా! యీతని మాటలు చాలా విపరీతముగ నున్నవే :

ఉద్ధవా యేమిట్లు కఠినోక్తులు బల్కుచుంటివి - నేచేయునేరమేమి నాడు నా బావమరిదియగు గోపాలుడు భగవద్గీతలలో నీతిధర్మములు బోధించు వేళలో నిట్టి క్రియలన్నియు జేయుమనుచు చెప్పెను. నే నట్లే ప్రతిదినము మరువక చేయుచుంటినన......

ఉద్ధవుడు :- అర్జునా ! అదియా కారణము వినుము తెల్పెద

కం॥ పెద్దలు జ్ఞానము జెప్పిన
వొద్దికగా గార్యవర్గ మొనరించుటకై
కుద్దుగ దెల్పిన సంగతి
వద్దుసుమీ రద్దుజేసి వర్ధిల్లవలెన్ ॥

ఓయి అర్జునా ! నీవు యుద్ధము చేయుటకిష్టములేక, విరాగమును బొందియున్న సమయములో నీ మనస్సు త్రిప్పుటకు యిట్లు మాయా కల్పితమైన జ్ఞానబోధను బోధించిరి. నీవు బావమరిది యనియు బంధువుడనియు, శ్రీకృష్ణభగవానులను చులకనగా చూచుచుంటివి. అందుచే నీవు పూర్ణబోధకర్హుడవుకావని తెల్పలేదు. శ్రీకృష్ణభగవానులను సామాన్యులుగా దలపకుము. వారు సద్గురువులు,

జ్ఞానాజ్ఞాన నిరాకరిష్ణులు, జ్ఞానాతీతులు, నిర్గుణులు, భావా భావాతీతభావులు. అట్టివారి భావమును పూర్తిగా తెలుసుకొనుము.

అర్జునుడు :- ఉద్ధవా....! భగవద్గీతలో రాజవిద్యారాజగుహ్యయోగమను తొమ్మిదవ యధ్యాయములో 26వ, 27వ శ్లోకముల భావము వింటివా?

**శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రియతాత్మన ః ॥**

తా॥ భక్తితో నాకొక ఆకైనను, పుష్పమైనను, పండైనను, జలమైనను నెవ్వడిచ్చుచున్నాడో, భక్తిపూర్వకముగా నాకు సమర్పించిన యా వస్తువును సంతోష మనస్కుడనై ఆరగించుచున్నాను. అనియు

**శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ ।**
**యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥**

తా॥ పత్ర పుష్పాదులను సమర్పించుటకు నీకు ప్రయాసముగా నుండునేని, నీవేది భుజించెదవో యే కర్మనాచరించెదవో దేనిని యాగము చేయుచున్నావో, దేనిని దానమొసర్చెదవో, దేనిని తపస్సు జేసెదవో, దానిని నాకు సమర్పింపుము. అనియు జెప్పిరిగదా!

ఉద్ధవుడు :- అర్జునా! దెల్పెద వినుము

**శ్లో॥ మోహేచ భ్రమో జీవః భ్రమ యీశ్వరభావనా ।**
**భ్రమౌచిత్యం భ్రమస్సత్వం భ్రమోహ్యానంద ఏవచ ॥**
**భ్రమో కార్యాది విజ్ఞానం భ్రమో మంత్ర జపాదికం ।**
**భ్రమ మోక్షశ్చ బంధశ్చ భ్రమ మూల మిదం హ్యాహం ॥**

తా॥ ఓయి అర్జునా! మోహమునందున్న భ్రమయే జీవుడు, భ్రమయే శివునితలంపు. భ్రమయే ఆదిక్యము, భ్రమబలము, భ్రమయే ఆనందము, భ్రమ కార్యములు చేయుటయందున్న తెలివి. భ్రమ మంత్రము జపము మొదలగునవి. భ్రమ మోక్షము బంధము, భ్రమ అహంకారమునకు మూలకారణము. అనగా నేను అనుపదము చెప్పుటకు భ్రమయే మూలము.

(పాట తిశ్రగతి. శంకరాభరణం రాగం)

ప॥ 1. పూజలేలనో ఫల్గుణ - గీజలేలనో
అజునికైన నలవిగాని - నిజగురువాక్యము గనుమా ॥పూజ॥

2. జపములేలనో అర్జున - తపము లేలనో
జపతపములు జేయుచు నిల-అపజయంబు నొంనేల ॥పూజ॥

3. నిజముదెలియలేక నీవు - గజిబిజి
వాక్యములు బల్క - నిజముగలద వో
కిరీటి నిజముగనుము - వేగజనుము ॥పూజ॥

అర్జునుడు :- ఉద్ధవా! వింటివా "సాంఖ్య యోగమను" రెండవ అధ్యాయములో 23వ శ్లోకభావము.

**శ్లో॥ నైనం చిన్దన్తి శస్త్రాని నైనం దహతి పావకః ।**
**నచైనం క్లేదయన్త్యాపో నశోషయతి మారుతః ॥**

తా॥ ఈ ఆత్మకు రూపంబు లేకుండుటచేత శస్త్రములు, భేదింపజాలవు, చెట్లకువలె దీనికి శాఖాదులులేవు గాన, నిప్పు కాల్చజాలదు, కనబడుతున్న యంగములేవియు వీనికి లేకుండుటచేత నీరు తడుపజాలదు. దీనియందు ద్రవాదులు లేకుండుటచే గాలి యెండ గొట్టదు.

ఉద్ధవుడు :- ఓయి అర్జునా! ఆత్మకు రూపంబులేకుండిన యీప్రపంచ రూపములన్నియును యెట్లేర్పాటు జేసెను. ఆత్మ శస్త్రములు చేత బెదింవబడదనియు, అగ్నిచే కాల్చబడదనియు, నీరు తడుపజాలదనియు, గాలిచే నిగరగొట్టబడదనియు శ్లోకభావము చెప్పుచున్నది. అయితే దేహములో నాత్మయుండునపుడు కాల్చబడిన కాలినది దేహమా యాత్మదేహమనెదవు. దేహమే దుఃఖపడరాదా ఆత్మయేల దుఃఖపడును? యింద్రియ గుణములే యనెదవు గాబోలు, ఆత్మలేని యింద్రియగుణములెక్కడివి? గాన, ఆత్మ, యింద్రియ, గుణములు దేహము అన్నియును గూడి కాల్చబడుచున్నవి, తడపబడుచున్నవి, గూలబడుచున్నవి, యిగరగొట్టంబడుచున్నవి, సుఖ దుఃఖములనుభవించుచున్నవి.

అర్జునుడు :- ఉద్ధవా! యీ యోగాధ్యాయములోనే 25వ శ్లోకభావము వింటివా?

**శ్లో॥ అవ్యక్తోయ మచింత్యోయ మవికార్యోయ ముచ్యతే**
**తస్మాదేవం విధిత్వైనం నానుశోచితు మర్హసి.**

తా॥ పంచేంద్రియములకు గానరానివాడు, మనస్సునకు నందరానివాడు, వికారంబులు లేనివాడు అని చెప్పంబడును. గనుక యీయాత్మ స్వభావమును చక్కగానెరింగికొని దుఃఖించుట నీకు తగదనిరి గదా!

ఉద్ధవుడు :- అర్జునా దెల్పెదను వినుము. విశ్వరూప సందర్శనయోగములో చూచితివా, ప్రపంచ చిత్రములు ఆయాత్మ లేకుండినకలవా? ఆచూచిన వన్నియు, నాత్మప్రభావములే - అవిలేకుండిన ఆత్మలేదు. ఆత్మ లేకుండిన అవియునులేవు. ఇంకను సూక్ష్మముగను దెల్పెదనువినుము. దేహమునువిడచి ఆత్మయెందున్నదో జూపుము, లేదుగదా ఆత్మను, యోగనిష్ఠచే అనగా షణ్ముఖి ముద్రయోగములచే జూచిన కోటి సూర్య ప్రకాశమానమైన భ్రూమధ్యమందు గానుపించును. అదియే ఆత్మ, అదియే చైతన్యం, అదియే జ్ఞానము, అదియే జ్ఞేయము, అదియే నాదము, దానినే ఓంకారమనియు, ప్రణవమనియు,స్వప్రకాశమనియు, సచ్చిదానందమనియు వాడుదురు. ఇదియే మాయ, ఇదియే లేనిది గాన, నిజముగనుము.

అర్జునుడు :- ఉద్ధవా, భగవద్గీతలో ఆత్మసంయమ యోగమను షష్టాధ్యాయములో 14వ శ్లోకమందుదెల్పిన భావము వింటివా.

**శ్లో॥ ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః ।**
**మనస్సంయమ్య మచ్చిత్తోయుక్త ఆసీత మత్పరః ॥**

తా॥ బ్రహ్మచర్య వ్రతము ననుష్టించువాడై భయంబులేనివాడై శాంతముగలవాడై మనస్సునుజక్కగా నిగ్రహించి నాయందు మనస్సు నుంచి నన్నే పరమార్థముగానెంచి సమాహితచిత్తుడై యుండవలయు ననియు దెల్పిరిగదా.

ఉద్ధవుడు :- ఓంయి అర్జునా! అదిఅంతయునిజమే. యెందుకనిన సద్గురునియందు అతిభయభక్తి వినయవిధేయతలుగా నుండి గురువునే సేవింపుమని దెల్పిరిగాని, పరమార్థమట్టిదికాదే తెల్పెదవినుము.

శ్లో॥ నిరంజనం నిరాధారం, నిరావరణం పరాత్పరం ।
నిర్ధేహం నిర్మలం నిత్యం నిరాభాసం సదాప్రభుః ॥

తా॥ ఓయి అర్జునా పరమార్థము దోషములేనిది, ఆధారము లేనిది ఆవరణములేనిది శ్రేష్టమైనది, శరీరంలేనిది మైలలేనిది శాశ్వత మయినది, ప్రకాశములేనిది, యెల్లప్పుడు నున్నది అదియే దేవుడు.

అర్జునుడు :- ఉద్ధవా యింకను వింటివా- విజ్ఞాన యోగమను సప్తమోధ్యాయములో 9వ శ్లోకమందు యిట్లుదెల్పిరి.

శ్లో॥ పుణ్యోగన్ధః పృధివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥

తా॥ భూమియందు పరిమళించుచున్న గంధమును, అగ్నియందు కాంతియు, సర్వభూతములందు ప్రాణాధారమైన జీవనమును, తపో ధనులందు తపస్సు నేనగుచున్నాను... అనిరి.

ఉద్ధవుడు :- అర్జునా, అదంతయు నిజమే. తానే జగత్తంతయు, జగత్తంతయు తానేగాని పరమార్థమట్టిదికాదు. ఎట్టిదనగా,

శ్లో॥ వేదవేదాంత శాస్త్రేషుసారం తత్ర వివర్జితం ।
జీవబ్రహ్మ విహీనత్వం తల్లింగం పరమప్రభుః ॥

తా॥ వేదవేదాంత శాస్త్రములయందున్న సారము చెప్పబడుచున్నది యేమనగా, జీవ బ్రహ్మలు గానిదై స్త్రీ పురుష నపుంసక లింగములు లేనిది దేవుడుగాని కృష్ణస్వాములు వారివలె భూమియందు పరిమళించుచున్న గంధమును కాదు. అగ్నియందు కాంతియును కాదు. సర్వభూతములయందు ప్రాణాధారమైన జీవనమును కాదు. తపోధనులయందున్న తపస్సునుకాదు. పరమార్ధమెన్నడు నొకదానితో సంబంధము లేకపోయే యున్నది.

అర్జునుడు :- ఉద్ధవా, యేమిది యెన్నడు నిట్టిబోధను నేను వినుటలేదే గోపాలుడుడిట్టునాకు జ్ఞానబోధన చేసెనుగాని, జ్ఞానాతీతమైన పరమార్థమును దెల్పక మరుగుంచెను. ఉద్ధవా ఈ యోగాధ్యాయము లోనే 10వ శ్లోక భావము వింటివా.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్ధ సనాతనమ్ ।

బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥

తా॥ శాశ్వతుండనగు నన్ను సమస్తభూతములకు నిత్యభీజమన్ని యెరుంగుము. ఇంతియేకాదు, బుద్ధిమంతుల నిశ్చయాత్మక బుద్ధియు తేజోవంతుల ప్రకాశమునునై యున్నాను అని దెల్పిరి గదా.

ఉద్ధవుడు :- అర్జునా, వినుము

శ్లో॥ నిర్బందం నిష్కళం, పూర్ణం నిశ్శ
బ్దం పరమ మవ్యయం నిస్సంగం సంగరహి
తం తల్లింగం పరమప్రభుః ద్రష్టసాక్షి
సదానహి దృగ్దృశ్యాఖ్యా వినుర్ముక్తం
కేవలామలామల రూపవాన్ ॥

తా॥ ఓయి అర్జునా! పరమార్ధం బందింపబడదు. కళలేనిది, వెల్తిలేనిది, ధ్వనిలేనిది, పరమైనది, నాశనములేనిది, కూడికలేనిది, కూడికకానిది, మొదటిదై యేకమైయున్నది, ఉత్కృష్టము చూచునది, చూడబడినది పేరులేనిది దైవము ఏకముగా మలినమంటక రూపము లేకయున్నది.

అర్జునా ఇంకను వినుము.

శ్రుతి॥ ఏకోదేవ స్సర్వలోకాంతరస్థః సర్వవ్యాపీ
సర్వమాయాతిరిక్తః ఏకవస్తు సదానాస్తి అన్యవార్తా
కథంభవేత్ ఇతినిశ్చిత్య యః పూర్ణోమృత జీవోన సంశయః ॥

తా॥ ఓయి అర్జునా, నీ వెంతమాత్రము సంశయించవద్దు. ఇది పూర్ణబోధ. జ్ఞానాతీతమైనబోదయొక్కటై యున్నదే దేవుడు. సమస్త లోకములయందు నతీతమై సర్వమున వ్యాపించియున్నది. సమస్తమైన మాయలకు వ్యతిరేకమైనది. ఏకం ఒక్కటైయున్నదే శాశ్వతం అదితప్ప ఇతరమైన వస్తువులేదు. ఇది నిజముసుమా వెల్తిలేనిదే చావు బ్రతుకులు లేనిది సంశయించకు.

అర్జునుడు :- ఉద్ధవా వింటివా త్రయోదశాధ్యాయమను క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగములో 13, 14, 15 శ్లోకముల భావము.

శ్లో॥ జ్ఞేయం యత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృత మశ్నుతే ।
అనాది మత్పరం బ్రహ్మ న సత్తాన్నా సదుచ్యతే ॥

తా॥ ఇక జ్ఞేయస్వరూపమును చక్కగా జెప్పెదను వినుము. దానినెరిగింతివేని అమృతరూపమగు మోక్షలాభంబును బొందుదువు. అదియే బ్రహ్మమని చెప్పబడును. అది మొదలులేనిది సర్వోత్కృష్ట మైనది, సత్తుగానిది అసత్తుగానిది, రెండింటికి విలక్షణమైనది అనియు ఇంకను

**శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోక్షి శిరోముఖమ్ ।**
**సర్వత శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥**

తా॥ అది ఎల్లదిక్కులయందును కాళ్ళు చేతులు కలిగి అంతట కనులు ముఖము చెవులతో గూడినదియై సమస్తము నావరించి నిలచియున్నది. ఇంకను దెల్పెదను వినుము

**శ్లో॥ సర్వేన్ద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితం ।**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణ భోక్తృచ ॥**

తా॥ సకల ఇంద్రియ గుణంబులందుండు నట్లుండినను సర్వేంద్రియములచే విడువబడినది. యెందును నంటక నిలిచియుండునది. అయినను సమస్తమనుభవించునది. సత్వరజస్తమంబులను గుణంబులు లేనిది అయినను, ఆ గుణముల ననుభవించినట్లు తోచునది అనియు కృష్ణమూర్తి జెప్పిరి గదా ఇందేమి లోటుగలదు.

## "తొహర"

లోటనిబల్కిత్రిమాటి మాటికిని - లోటే ఇందులలోటే
సూటిగ దెల్పెద వినుమో యర్జున - సుఖతర పరమది బాటే
కోటిమాటలును బల్కినవన్నియు - కోటియెంచినను లోటే
కోటికినొక్కటిదెల్పెద గనుమా - కోర్కెతోవిను నామాటే
సూటిగ నీమదినాటినట్లుగను - సూచించెద నీ బాటే
నాటిన నీమది బూనును బోధను - నానావిధముల చాటే ॥

ఓయి అర్జునా వినుము దెల్పెద :-

**శ్లో॥ ద్వైతాద్వైత రాహిత్యంచ శ్యూన్యాశూన్య వివర్జితమ్ ।**
**జ్ఞానాజ్ఞాయాదికం నాస్తి తల్లింగ మచలం ప్రభుః ॥**

తా॥ ద్వైతాద్వైతములు కానిది శూన్యాశూన్యములు కానిది జ్ఞానా జ్ఞేయములు గానిది మొదటిదై యేకమై కదలిక లేనిదే దేవుడు.

శ్లో॥ భూతభవ్య భవిష్యశ్చ సర్వమిధ్యేతి
నిశ్చయం పాదభావే గతిర్నాస్తి వక్త్ర
భావే వచోనహి ముఖాభావే శిరోనాస్తి
లక్ష్యాభావే దృశంనహి శ్రోత్రాభావే
ధ్వనిర్నాస్తి హస్తాభావే క్రియానహి
చిత్తాభావే జగం నహి జ్ఞానాభావేహ్యా
హంనహి త్రిమూర్తించ త్రిదేహశ్చ
త్రయాత్మ త్రిపుటన్యధా త్రిలోకశ్చ
త్రిమోహశ్చ జన్మాభావే మృతంనహి ॥

తా॥ గడచినది కానున్నది కాగలది, సర్వమునులేనిది, నిర్ణయమైనది, పాదములులేవు గనుక నడువ గతిలేనిది. నోరులేదు గనుక మాటలాడదు, ముఖములేదు గాన శిరస్సులేదు, నేత్రములులేవు గాన చూచుటలేదు. చెవులులేవు గనుక వినుటలేదు, హస్తములు లేవు గనుక పనులు చేయుటలేదు, చిత్తములేదు గనుక, జగములేదు, జ్ఞానము లేదు గనుక, అహములేదు. బ్రహ్మవిష్ణు మహేశ్వరులుకాదు, స్థూలసూక్ష్మ కారణ శరీరములు కానిది, ఆత్మజీవాత్మ పరమాత్మలు కానిది, స్వయంభువు కానిది, స్వర్గమర్త్య పాతాళములు కానిది, కామక్రోదలోబాదులు కానిది, పుట్టుటలేదు గనుక చావులేనిది.

శ్లో॥ ఏకం సత్యం ద్వయం నాస్తి నహేతో
నక్రియాచ నజ్ఞాతం పరమం పదం ॥

తా॥ ఒకటైయున్నది, నిజమైనది, రెండులేనిది, ధ్యానింపబడనిది, పనిచేయనిది, తెలియబడనిది, ఉన్నత పదవియందున్నది.

అర్జునుడు :- ఉద్ధవా, అక్షర పరబ్రహ్మయోగమను అష్టమోధ్యాయములో 9వ శ్లోకభావము వింటివా

శ్లో॥ కవిం పురాణమనుశాసితార మణోరణీయాంసమనుస్మ రేద్యః

సర్వస్య ధాతారమచింత్య రూప మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ॥

తా॥ అట్టి పరమపురుషుడెట్టివాడని యంటివేని వినుము, అతడు సర్వజ్ఞుడు, పురాణ పురుషుడు, సర్వప్రపంచమును శిక్షించువాడు, సూక్ష్మమునకన్న సూక్ష్మమైనవాడు. సమస్తప్రాణుల కర్మలకు దగినటుల ఫలముల నొసంగువాడు చింతించుటకు వీలులేని రూపము గలవాడు, సూర్యతేజస్సు వలె నిత్య స్వయంప్రకాశముగలవాడు, మాయాంధ కారమున కవ్వలివాడు అనియు శ్రీకృష్ణమూర్తి యిట్లు చెప్పిరి.

ఉద్ధవుడు :- ఓయి అర్జునా! నేను దానికి మీరిన చక్కనగు బోధను తెల్పెదను వినుము.

శ్లో॥ క్షరాక్షరద్వయం నహి లక్షణాలక్షణం నాస్తి
దేశాదేశ సర్వవ్యాప్తి పరమపురుషం సదా ॥

తా॥ దేహము ఆత్మ రెండును లేనిది. గుణాగుణముగానిది దేశా దేశములనంతట సర్వము వ్యాపించియున్నది. ఉత్కృష్టమైన గురుసంజ్ఞ యెల్లప్పుడున్నది.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞ వర్జితం దృక్కు దర్శన
రహితం జ్ఞానాజ్ఞాన విహీనంచ జ్ఞానాంత మచలం ప్రభుః ॥

తా॥ శరీరం జీవుడు లేనిది, చూచినది చూడబడినది లేనిది జ్ఞానము అజ్ఞానము కానిది జ్ఞానమునకు అతీతమైనది. కదలికలేనిది దేవుడు.

శ్లో॥ పురుష స్త్రీ వివర్జితం రక్షారక్ష విరాహిత్యం
శిక్షాశిక్షాద్వయం నహి సూక్ష్మసూక్ష్మ తరంనాస్తి
ఫలాఫలాది రహితం రూపనామక్రియ నహి
తేజోంధకార రాహిత్యం పరంపద అచలం
శాశ్వతం సనాతనం ప్రభుః ॥

తా॥ స్త్రీ పురుషులు గానిది, రక్షారక్షణములు లేనిది, శిక్షాశిక్షలు రెండును చేయనిది, సూక్ష్మాసూక్ష్మములు గానిది, ఫలాఫలములు లేనిది, రూపనామ క్రియలులేనిది, తేజస్సు అంధకారములు గానిది, స్వయం ప్రకాశం కానిది,

మోహమోహములు లేనిది, కామక్రోదాదులు లేనిది, ఉన్నత పదమైనది, కదలిక లేనిది, స్థిరమైనది, శాశ్వతముగా నున్నది దేవుడు.

శ్లో॥ యస్యంతర్నాది మధ్యం నహి కరచరణం ననా
మగోత్రం నసూత్రం నోజాతి ర్నైవర్ణం నభవతి
పురుషో నా నపుంసోనచ స్త్రీ నాకారం నహి
జనన మరణం నాస్తి పుణ్యం న పాపం నోతత్వం
తత్వమేకం సహజ సమరసం తత్పరం ॥

తా॥ ఆదిమధ్యాంతములు లేనిది, కాలుచేతులు లేనిది, పేరు వంశములేనిది, ఏర్పాటుచేయనిది, జాతిలేనిది, రూపములేనిది, శివుడు కానిది, పురుషుడు నపుంసకుడు స్త్రీయును గానిది, ఆకారము లేనిది, పుట్టువు చావులేనిది, పుణ్యము కానిది, పాపము గానిది శరీరములేనిది, తత్వమున కతీతమై యొకటైయున్న స్వభావము కలది, బేధములేనిది అదియే దైవమై యున్నది.

అర్జునుడు :- (తనలో) ఆహా! చాలా అద్భుతమైన బోధ. నేనెన్నడును విని కనియుండలేదు. అనుచు తనలో తానను కొని ఆలోచించుచుండ....

ఉద్ధవుడు :- అర్జునా యేమది ఆలోచించు చుంటివి?

అర్జునుడు :- ఉద్ధవా ఆత్మయనియు, చైతన్యమనియు శుద్ధాత్మయనియు, నిశ్చలాత్మయనియు, నిర్మలాత్మయనియు నందురు. అదియే యదార్థమందురు. నిజమేనా ?

ఉద్ధవుడు :- అర్జునా !

*(పాట-ఏకతాళం కాంభోజి రాగం)*

ప॥ అదేనటోయి నీ భావం - ఆత్మకాదు యధార్థం అర్జునా దెల్పెద వినుమా ॥అదే॥

అ॥ప॥ అదరక చెదరక కదలక మెదలకనున్నది పూర్ణం ॥అదే॥

1. ॥ ఆత్మచేత ఆకాశము ఆకాశముచేత గాలి గాలివల్ల అగ్నిబుట్టె
అగ్నిచేత జలముగల్గె జలమువల్ల పృద్వి బుట్టె ॥అదే॥

2. పంచభూతముల వల్లను పంచ పంచ వింశతియును ఎంచిఎంచి
చూడుమయ్య ఎంచగాను లోకమెల్లగాంచు ఆత్మచేతగల్గె ॥అదే॥

3. సకల చరాచరములెల్ల ఆత్మచేతనేగల్గెను నిఖరముగా వస్తువులో
నిమిడియున్న దాత్మ యెపుడు ఒకటె ఆత్మ వస్తువన్న ॥అదే॥

4. ఆత్మలేకదేహమెట్లుండు దెల్పుమయ్య నీవు ఆత్మయెందునుండు
నయ్య దేహముతాలేకయున్న ఆత్మదేహ మొకటెమిధ్య ॥అదే॥

ఉద్ధవుడు :- నవ్వుచూ, ఓయి అర్జునా! దెల్పెద వినుము.

శ్లో॥ సర్వత్ర వ్యాప్త రూపాత్మ సర్వత్రాత్మా దశేషకః
నిశ్చలాత్మ నిర్మలాత్మ శుద్ధాత్మ సర్వవర్జితం
సర్వత్ర సంస్థ సదసద్వీహీన మజ్ఞాత మవ్యక్తమగోచరంచ
నిశ్చలం నిర్మలం శుద్ధం నిర్ద్వంద్వం నిరుపాదికం
నిర్బీజం నిరవయం నిత్యం నిస్తేజశ్చామృతం శివం ॥

తా॥ అంతటా వ్యాపించు రూపములుగల ఆత్మ సర్వ వస్తువుల యందు ఆత్మస్వరూపమై పదివిధములు కోరదగినది. చలనములేని ఆత్మ మలినములేని యాత్మ పరిశుద్ధమైన ఆత్మ, యీసర్వమునులేనివే అంతట కనబడుచున్నది. ఉండి యుండడములు, రెండులేనిది, తెలివిలేనిది, తెలియరాక యుండునది, చూపులకందనిది కదలనిది, మయిలలేనిది, పరిశుద్ధమైనది, రెండుగానిది, కారణములేనిది, అంగములేనిది, విత్తు లేనిది ఎల్లప్పుడు ప్రకాశములేనిది, చావులేనిది, శుభమైనది, ఓయి అర్జునా! యిదియేలాగు లభించునంటే-

శ్లో॥ గురూక్త్యా స్వానుభూత్యాచ లభ్యతే పరమామృతం
పరత్పర పరం వ్యోమ లింగవిత్యుచ్యతే బుధై ॥
సర్వకారణ రాహిత్యం లింగం సర్వాత్మకం సదా
అంగహీనం సంగహీనం భంగహీనం భవావహం
సర్వహీనశ్చ పుణ్యాత్మా స ఏకో నిష్కళో విభుః ॥

తా॥ గురుముఖస్థమై, స్వానుభూతముగా లభించును. పరము, చావులేనిది. అన్నింటికీ పరమైయున్నది. ఆకాశమునకు అతీతమైనది, పరిపూర్ణము, బుధులచేత యీప్రకారం నిర్ణయింపబడినది. యేకారణము కానిది,

సర్వముతానైనది, ఎల్లప్పుడు శరీరంలేనిది, కూడికకానిది భంగములేనిది పుట్టువులేనిది, అహంకానిది, ప్రకాశములేనిది, దేవుడు, ఓయి అర్జునా, యీలాగున ఉపనిష ద్వాక్యార్థములు మథించిన అమృత స్వరూపమైన అచలబోధసారంబును దెల్పితిని. యింకను

ఓయి అర్జునా! అతి జాగ్రత్తగా వినుము.

సీ॥ ఓంకారమని యన్న హంకారమని యన్న
చైతన్యమని యన్న శాంతమన్న
సత్తన్న చిత్తన్న సగుణ నిర్గుణ మన్న
సాకారమని యన్న సాక్షియన్న
లక్షణంబనిన విలక్షణంబని యన్న
రక్షకుండని యన్న సారంబుయన్న
జ్ఞానదేహంబన్న జడ మజడంబన్న
జ్ఞప్తిస్ఫురణ యన్న జ్ఞానమన్న

గీ॥ మాయకే యిన్ని నామముల్ మరియుగల్గె
మాయ విడిపించు వీరుండు మద్గురుండు
దేశికస్వామి భావంబు దెలెయు మొండు
పదములేదని చెప్పిన ఫల్గునుండు ॥

అర్జునుడు :- ఓయి ఉద్ధవా, యీ మాయనే జ్ఞానమని, జ్ఞానమే యదార్థమని, నమ్మించి యిట్లుచెప్పిరి. నేను రేపటి ఉదయముననే ప్రయాణంబై, ద్వారకకు వెళ్ళి కృష్ణస్వాముల వారిని దర్శించి, యీపూర్ణ భావమంతయు, నీవుదెల్పినట్లే, పూర్తిగా తెలునుకొనియెదనని, జ్ఞానభక్తిని అధికముగా అవలంబించి, మహా సంతోషభరితుడై యిట్లుబలుక.

ఉద్ధవుడు :- ఓయి అర్జునా, కృష్ణస్వాముల వారిని బావమరదియని, బంధువులని, యింతకు ముందువలె, చులకనగా జూడక, జ్ఞాన భయ భక్తి, వినయ విధేయతలతో నటించి, మనోవాక్కాయములను, నొకటిగాజేసి పెత్తనము విడిచి, చిన్నతనము నవలంబింపవలయు.

ఓయి అర్జునా వినుము :-

(పాట-ఏకతాళం-సింధూర రాగం)

ప॥ జన్మమూ సున్న జేయుటకూ సద్గురుని సన్నిధిని జేరీ ॥జన్మ॥
తను మన ధనములను గురునకూ వినయమున నొసగీ ॥జన్మ॥

1. పరమ పవిత్రముగా ధరణిపై సరిగ లలాటంబున్ బరువడిగ సరి
సాష్టాంగములనూ చరణములపైబడి మ్రొక్కవలెన్ ॥జన్మ॥

2. నాల్గు సేవలతో సాధుగురు కీలుదెలియవలెన్, తెలిసినా
తెలివి గురువరునే తెమ్మనక దక్షణ నొసగవలెన్ ॥జన్మ॥

3. అనిశమూ నాత్మలోపలనే ఆగురుని స్మరియింపగ వలయున్
వినయమున చేతులనుగట్టీ వివిధముల్ వేడుకొనవలయున్ ॥జన్మ॥

4. విన్న ధర్మములన్ విడువకే మన్నింపగ వలయున్ యెన్నగా
సేవలనుజేసీ గురుని కనుసన్న నెరుగవలెన్ ॥జన్మ॥

తా॥ ఓయి అర్జునా! పెత్తనముచేత యేనుగు చెత్తను తినును చీమ చిన్నతనముచే చక్కెరతినును. అందుచేత చిన్నతనమే మేలు. మనమేకాదు శ్రీకృష్ణస్వాములువారు కూడా అష్టాంగయోగములు జేసి కష్టములపాలై స్పష్టముగా దెలియలేక చిన్నతనము వహించి, సాందీప మహర్షులవారి దరిజేరి, బహునిష్ఠా గరిష్టులై, భయభక్తి వినయ విధేయతలతో చరించి తనుమన ధనములు ధారబోసి, భృత్యుని వలె నాల్గుసేవలుజేసి చరణధూళిని శిరమున ధరించి సాష్టాంగ దండ ప్రణామంబులు జేసి, యీపూర్ణ భావమంతయు తెలిసికొనెను. నేను కూడా అట్లే కృష్ణస్వాములవారి వద్ద తెలుసుకొంటినని జెప్ప-

అర్జునుడు :- ఉద్ధవా, నేను కూడా అట్లే తెలుసుకొని వచ్చెదనని భీష్మించెను, అంతట.

ఉద్ధవుడు :- ఓయి అర్జునా, నేను నా గృహమున కేగెదననిజెప్పి, వెడలి పోయెను తదుపరి.

అర్జునుడు :- (అంతఃపురంబున కేగి, వస్త్రాలంకారంబులను మార్చి, హంస తూలికా తల్పంబున బవళించి, ఆలోచించుచుండ సుభద్ర భర్తనుజూచి,

ఆహా! ఏమిది ఎన్నడును ఇట్లు ఈ వేళలో హంసతూలికా తల్పంబున బవ్వళించి, చింతించుట లేదని, ఈతడేమి విచారించు చుండెనోయని, సుభద్రభర్త దరినిజేరి, నాథా మీరిట్లు చింతించుటకు కారణమేమని యడుగ కిరీటి సుభద్రనుజూచి, యేమియులేదని బదులుజెప్పి, మిన్న కుండెను. మరునాడుదయముననే, ద్వారకాపురము వెళ్ళుటకు, అర్జునుడు ప్రయాణంబై సుభద్రా! ద్వారకాపురమువెళ్ళి వచ్చెదనని, చెప్పుచుండ సుభద్ర నాథా!

**గీ॥ అన్నగార్లకు దండంబు లనియు జెపుము**
**వదినెగార్లకుగూడ నే వందనములు**
**జేసితి నటంచు వేర్వేర జెప్పవలయు**
**ననుచు భర్తకు తా వందనమునుజేసె ॥**

అర్జునుడు :- అచ్చటనుండి జ్యేష్ఠుడగు అన్నయ్య సెలవు బొందుటకు ధర్మజుని వద్దకు వచ్చి.

**"తోహర"**

ద్వారకనగరము వెళ్ళి వచ్చెదను - త్వరగ సెలవొసగుమన్నయ్యా
పరమార్థంబును కనులనిండ నే-బాగుగ గాంచెదనన్నయ్యా
జ్ఞానముమాయయె యదార్థమనుచును-జ్ఞానముదెల్పెను అన్నయ్యా
జ్ఞానమె పుట్టుచు చచ్చుచునున్నది-జ్ఞానము నిజమా యన్నయ్యా ॥

ధర్మరాజు :- తమ్ముడా అర్జునా యేమిట్లు బలుకుచుంటివి పొరపాటు తత్తరపడకుము. శ్రీకృష్ణుడు, సాంఖ్యయోగమను 2వ యధ్యాయములో జెప్పిన పందొమ్మిది ఇరువది శ్లోకముల భావము జ్ఞాపకమున్నవా?

**శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్ ।**
**ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి న హన్యతే ॥**

తా॥ ఎవడు ఎవనిని జంపువాడని యెంచునో యెవనిచే జచ్చెదనని, యెవడెంచునో వారిరువురును తెలిసినవారలు కారు. యీ ఆత్మను జంపువాడును లేడు, ఇది చచ్చునదియు కాదు.

**శ్లో॥ నజాయతే మ్రియతేవా కదా చిన్నయం భూత్వా భవితా వానభూయః**
**అజోనిత్యః శాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే ॥**

తా॥ అర్జునా! యీ యాత్మ యెుకప్పుడును, బుట్టినదికాదు చచ్చునదియు కాదు యీ దేహంబులువలె బుట్టియుండునది గాదు - పుట్టగలదియుకాదు - పుట్టుచున్నదియు కాదు. అనగా, త్రికాలంబు నందును, సత్యమైనది యీ యాత్మ పుట్టుకలేని వాడు యెల్లప్పుడు వొక్కటేతీరున నుండువాడు-పురాణుడు-దేహములు నశించుచుండగా వీడు చంపబడడు.

అర్జునుడు :- అన్నయా! అదియా మీ యుద్దేశము...! ఈ యోగములోనే యీ అధ్యాయములోనే 26వ శ్లోకం 27వ శ్లోకముల భావములు జ్ఞాపకమున్నవా?

**శ్లో॥ అథచైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్ ।**
**తదాపిత్వం మహాబాహో నైవం శోచితుమర్హసి ॥**

తా॥ ఓ మహాబాహుడవగు నర్జునా, ఒకవేళ నీవీ యాత్మను నిత్యమును బుట్టుచు, జచ్చుచు నుండెడు వానిగా దలంచి నప్పటికిని నీవు వానికొరకును, శోకింపదగదనియు దెల్పిరిగదా! యిందులో ఎంత సందేహమున్నదో మీరే ఆలోచించండి.

ధర్మరాజు :- తమ్ముడా అర్జునా, కృష్ణుని ఉద్దేశమదికాదు, నీవాత్మను చచ్చునది, పుట్టునదియుగా తలంచినను, దానిగురించి విచారించవద్దననెను.

అర్జునుడు :- అన్నయ్య! ఆయన యుద్ధేశము అదిగాదు. తననే అడిగి పూర్తిగా తెలుసుకొనుటమంచిది అన్నయ్యా!

యీ శ్లోకభావము వినండి :-

**శ్లో॥ జాతస్యహి ధృవో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ ।**
**తస్మాదపరిహైర్యేర్థే న త్వం శోచితు మర్హసి ॥**

తా॥ ఎందుకంటివేని, అర్జునా! పుట్టినవానికన్నిటికిని, మరణము నిశ్చయము, అటులనే, చచ్చినవానికిని పుట్టుక నిజము, అది పరిహరింపనలవి కాదని, అట్టిదానివిషయమై నీవు శోకింపదగదనియు నాకు జెప్పిరి గదా! అన్నయ్యా యిందులో భావం పూర్తిగా విచారణ చేయుదము, పుట్టునది

చచ్చుననియు, చచ్చునది పుట్టుననియు జెప్పిరిగదా! అయితే, పుట్టునది దేహము, చచ్చినది దేహము, మరల పుట్టునది దేహమేనా?

ధర్మరాజు :- అర్జునా, అదికాదు ఉద్దేశ్యము ఆత్మ శరీరమునందవ తరించుచున్న దనియు, అందుచే ఆత్మ శాశ్వతమనియు, శరీరము పుట్టిచచ్చుచున్నది. అశాశ్వతమనియు ఉద్దేశము.

అర్జునుడు :- అన్నయ్యా అది తప్పు ఉద్దేశము, నిజమైన ఉద్దేశము కాదు. అయితే పుట్టినదిశరీరము, చచ్చినది శరీరము, మరల పుట్టినది చచ్చినశరీరము పుట్టునా? పుట్టుటలేదే! ఆత్మ శరీరేంద్రియ గుణములను తయారు చేసుకొని, సుఖ దుఃఖములు అనుభవించుచు, చచ్చుచు పుట్టుచున్నది. గాని, శరీరము చచ్చిపుట్టుట లేదు. ఆత్మతో గూడుటచేతనే, శరీరము పుట్టి చచ్చినదిగాని, చచ్చినతరువాత, మరల శరీరము పుట్టుటలేదు.

అన్నయ్యా యీ విచారణ బాగున్నదా !

ధర్మరాజు :- తమ్ముడా అర్జునా బాగున్నదిగాని, నీమనస్సు నెవరిట్లు త్రిప్పిరి దెల్పుము?

అర్జునుడు :- అన్నయ్యా, నేను పూర్వవిధానముగానే, నిన్నఉదయము జపపూజలు చేయుచు, భగవద్గీతను పారాయణము చేయుచుండగా, నుద్ధవుడు నా వద్దకు వచ్చెను. రాగా నేను ఆయనను గౌరవించి ఆసనమున కూర్చుండమని జెప్పి జపపూజలు చేయుచుంటిని. ఉద్ధవుడు నన్నుచూచి నవ్వెను. నేను చిన్నబోయి, కారణములేనిదే యెందుకునవ్వితివని, గట్టిగా నిరోధించి అడిగితిని. అంతట నుద్ధవుడు అర్జునా నీవు చేయు క్రియలు, పిచ్చివాని పనులవలె నామదికి దోచుటచే నేనునవ్వితినని బలికెను. నేనందుకుదగిన శ్రుతులు చెప్పగా, వాటి నుద్ధవుడు ఖండించి, యదార్థబోధనంతయు దెల్పెను. నేనాబోధను వినగా, నా మనస్సంతయు మారిపోయినదని చెప్పి అన్నకు నమస్కారముచేసి, నాకు సెలవీయుడని వేడగా, అట్లే వెళ్ళి రమ్మని, ధర్మజుడు తమ్మునకాజ్ఞాపించెను.

అర్జునుడు :- అన్నయాజ్ఞను గైకొని ప్రయాణంబై, ద్వారకానగరమునకు
పోవుచుండెను. మార్గమధ్యమున అర్జునుడు -

సీ॥ దేవదేవా! నన్ను నీవ గావుమువేగ
భావమందున నిన్ను భజనజేతు
బావమఅదివంచు పలుకుచు నీరీతి
చులకన జూచితి సూరిభూష
ఆట పాటలయందు హాస్యమాడుటయందు
సరిసమంబుగ మిమ్ము నరసినాడ
బాల్య యవ్వనముల బల్కితి చనువుచే
భావము మనమందు బట్టుకొనక

గీ॥ తప్పులన్నియు మన్నించు దాతవీ వె
దిక్కు మీకన్న మరిలేదు దీనరక్ష :
మ్రొక్కి వేడుచునుంటిని మక్కువగను
గ్రక్కునన్ గాచి బ్రోవుము గడువులిడక ॥

గీ॥ అనుచు నీరీతిబల్కుచు నర్జునుండు
బోవుచుండెను ద్వారకా పురమునకును
మరువకుండగ దలచుచు మనమునందు
నింక బలుకుచునుండె తా నివ్విధమున ॥

సీ॥ కరి నీకు నలనాడు కానుకలేమిచ్చె
ద్రౌపదేమిప్పుడు ద్రవ్యమిచ్చె
ప్రహ్లాదుడే పాటి పసిడి కానుకలిచ్చె
నారదుండేపాటి నగలనిచ్చె
ఆ యహల్య యవెన్నియగ్ర హారము లిచ్చె
జూడంగ శబరేమి సొమ్ములిచ్చె
సుగ్రీవుడేపాటి శుభ్రవస్తువులిచ్చె
విందు లేమొసగె విభీషణుండు ॥

గీ॥ అందరిని గాచి బ్రోచిన సుందరాంగ
మందుడను నన్నుబ్రోవుము మదనజనక

అందరికి నేను తక్కువా యధికమనక
పొందుగా నన్ను జూడుము మందరధర ॥

(పాట-దాపు తాళము)

ప॥ రారా రాక్షస సంహారా నేరమేమిర
నాదు భారామంతయు నీదేరా ॥రారా॥
చ॥ కోరివేడీతి సారెసారెకు నేరమెంచక రారా బ్రోవర హరిహరీ
ఓ పరమపురుషా మరుగునుంచక పరముదెల్పరా ॥రారా॥
ప॥ సందేహమేలనురా యిందిరనాధా మందుడననుగావరా ॥రారా॥
మందరాద్రిధరుండ సుందర నందనందన గోపబాలా ॥రారా॥

(పాట-జుల్వా తాళము)

1. ప॥ నీలవర్ణ నిన్నెచాల నమ్మినానురా బాలగోపాల బ్రోవ జాలమేలరా ॥నీల॥
2. నేరమేమి భారమంత నీదనంటిరా శరణుశరణు
నీరజాక్ష పరము దెల్పరా ॥నీల॥
3. పరమ పురుష తిరముదెల్పె దొరవునీవేరా అరమరేల
కరువులేని పరముదెల్పరా ॥నీల॥
4. సంతతంబు నంతటున్న శాంతిదెల్పరా పంతమేల
శాంతమూర్తి చింతబాపరా ॥నీల॥

"తోహర"

హరిసంస్మరణము చేయుచు నర్జును-డ త్యామోదముతోడన్
ద్వారకనగరం బేగియు నచ్చట-ద్వారపాలకుల గాంచెన్
పాండవమధ్యము డరుగుదెంచెనని-పాండురంగనితో మీరు
నిండువేడుకతో జెప్పుడనుచు-నిందుండి పొండనగ వాడు
ఆవలి కావలివారలు నిరువురు-నంతపురమున కేగన్
నేవికలంతట ద్వారపాలకుల-జేరిటవచ్చితి రేలయనన్ ॥

ద్వారపాలురు :-

కం॥ ఎందుకు వచ్చితిమంటిర
యిందిరనాధునికి బావ యిప్పుడు వచ్చెన్

ముందుగ జెప్పగ వార్త త
డందేయుండంగ వచ్చి యలరితి మనినన్ ॥

అంతఃపురములో :-

సీ॥ అర్ధాంగియైనట్టి యారుక్మిణీదేవి
భక్తితోపాదముల్ బట్టుచుండె
సత్యభామయుగూడ నత్యంతభక్తితో
వింజామరంబును వీచుచుండె
రాదయుప్రేమతో రంజిల్లు మనసుతో
నింపుగా తాంబూల మిచ్చుచుండె
కాంతలందరు నిట్లు కలకలలాడుచు
సేవలన్నియు జేసి చెలగుచుండ

గీ॥ నచటి కిద్దరుదాసీలు నరుగుదెంచి
వందనంబులు జేయుచు వనిత లిట్లు
చెప్పబూనిరి వార్తను శీఘ్రముగను
నరుగుదెంచియు పార్థుడు నచటనుండె ॥

గోవిందుడు :-

గీ॥ అంతపార్థుడు వచ్చినాడనుచు వినుచు
మంతనంబున సంతోష మగ్నుడగుచు
నెచటనుండెనో అర్జునుం డిప్పుడనుచు
వడిగ నడుచుచు ద్వారంబు వద్దకేగ ॥

అర్జునుడు ద్వారముకడ :- (పాట-ఏకతాళము)

ప॥ కరుణజూడరాదా కంసారి ॥కరుణ॥

1. కరుణజూచి నను బిరాన బ్రోవుము పరమపురుష యో
మహానుభావ ॥కరుణ॥

2. అరమరయేలను నిరతము నమ్మితి మరుగుంచక సరి
పరమును దెల్పుము ॥కరుణ॥

3. మందరగిరిధర సుందరనాయక యిందిరనాథా



పొందుగ నేలుము ॥కరుణ॥

(పాట-రూపక తాళము)

ప॥ వేడెదరా వెన్నదొంగ వేడెద నిన్గూడెద నీవాడర
కాపాడర నిన్వేడెదరా వెన్నదొంగ ॥వేడెదరా॥

ప॥ నీలవర్ణ జాలమేల బాలగోపబాల యేల ॥వేడెదరా॥

మి॥మేలు బోధదెల్పక యాకీలుదాచుకొంటివిగద మేలా నీకిది
వీలా కాళియమర్ధన వినుమ ॥వేడెదరా॥

ప॥ పాలముంచు నీటముంచు చాల నిన్నునమ్మినాను ॥వేడెదరా॥

మి॥కలకాలముగలదానిని చులకనగాజూపి బ్రోవు చలమేలను
కృపజూడుము యిలలో నినునేనమ్మితి ॥వేడెదరా॥

శ్రీకృష్ణస్వాములవారి వెనువెంటను రుక్మిణి రాధా సత్యభామలు వచ్చుచు ద్వారముకడ నిలువంబడ.....

అర్జునుడు :- వారినిజూచి, శ్రీకృష్ణ స్వాములవారి చరణములపై సాష్టాంగపడి దండ ప్రణామంబులు జేయ....

శ్రీకృష్ణస్వాములువారు :-

చిరునగవుతో నర్జునుని దీవించుచు, తనలో నేమిది, యెన్నడు లేనిది అర్జునుడిట్లా చరణచేయుటకు కారణమేమని యాలోచించుచు అర్జునుని లేవదీసి, అర్జునా! అంతఃపురమునకు పోవుదము. రమ్మనుచు వెడలిరి. అంత తగినయాసనంబులు వేయ, కృష్ణార్జునులు కూర్చుండ...!

రుక్మిణి :- అన్నా అర్జునా! పెద్దన్నయ్య, పెద్ద వదినె, వదినె సుభద్ర యింకా నున్నవారందరు క్షేమమా

అర్జునుడు :- అమ్మా రుక్మిణీ అందరు క్షేమముగానే యున్నారు. రాధా సత్యభామలు, అట్లే క్షేమమడుగ అర్జునుడు వారికిగూడా నట్లే క్షేమమెరిగించెను.

ఉద్ధవుడు :- (తనలో) అర్జునుడీవేళ తప్పక గురు సాన్నిధ్యమునకు వచ్చును. నేనుకూడా, వెళ్ళెదనని ప్రయాణంబై....

(పాట-ఏకతాళము)

ప॥ గురుని భజించవలెన్ ధరగురునికన్న అధికంబేమియులేదని మది ॥గురు॥

1. గురుడు బ్రహ్మగురుడువిష్ణు, గురుడీశ్వరుడే పరబ్రహ్మమని ॥గురు॥

2. గురుడు నరుడనుచు దలచిన నరునకుదప్పదు నరకముభువిలో॥గురు॥

3. గురునిజేరి పరమెరిగినవారికి మరణజననములు మదియిలగలుగవు ॥గురు॥

(పాట-ఏకతాళము)

ప॥ 1. గురుడు గురుడు గురుడంటే హరుడే గుణరహితుండే గురుడయ్యా పరమునెరింగియు యెరుకను విడచిన పరమపురుషుడే పరుడయ్యా ॥గురు॥

2. గురుచరణంబులు మరవకనెప్పుడు స్మరియింపగవలె వినరయ్యా గురుడే తల్లియు, దండ్రియు దొరయని మరువక భజియించెదనయ్యా ॥గురు॥

3. తను మన ధనములు గురునిసొమ్మనుచు, ఘనముగ నొసగగ వలెనయ్యా, మనమున గురుస్మరణంబును మరువక అనయము జేయగవలెనయ్యా ॥గురు॥

4. శిరము నురమును కరములు ధరపై పరగ పాదములు మ్రొక్కవలె నాయ్యు, గురుమూర్తియు పరమార్థము జూపును కనులనిండ గనవలెనయ్యా ॥గురు॥

(ఉద్ధవుడిట్లు గురుసన్నిధికి వచ్చుచుండెను)

ఇచ్చట శ్రీకృష్ణస్వాములువారు అర్జునా, నీరాకకేమి హేతువో యెరిగింపుము?

అర్జునుడు :- స్వామీ! తమరు గీతలో జ్ఞానబోధను దెల్పినదంతయు, మాయయే, మాయజ్ఞానమునే యదార్థమని దెల్పిరి, నేను విచారణచేయక, మిమ్మలనునమ్మి, మీరు దెల్పినబోధయే నిజమని యిప్పటివరకును,

తదేకధ్యానముతో, గీతలో దెల్పిన విధానంబుగా జరుపుచుంటిని.

శ్రీకృష్ణస్వాములువారు :- అర్జునా! నే దెల్పినదంతయు సత్యమేగాని, అసత్యము కాదు.

అర్జునుడు :- దేవ దేవా పంౘ్రెండవ యద్యాయమను భక్తియోగమందు 3,4వ శ్లోకములు భావమిట్లు దెల్పిరి గదా!

**శ్లో॥ యత్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।**
**సర్వత్ర గమచిన్త్యఞ్చ కూటస్థమచలం ధ్రువం ॥**

తా॥ నాశనరహితంబును నిర్దేశింప గూడనిదియు, రూపాదులు లేనిదియు, నంతటవ్యాపించునదియు ధ్యానింప గూడనిదియు, ప్రకృతి నందుండునదియు, చలింపనిదియు, ధృవంబునైన బ్రహ్మము నెవ్వరు ఉపాసనజేయుదురో - అనియు యింకను,

**శ్లో॥ సన్నియమేన్ద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః**
**తేప్రాప్నువన్తి యామేవ సర్వభూతహితేరతాః ॥**

తా॥ ఇంద్రియ సమూహమును, లెస్సగా నిగ్రహించి సమస్త కాలములందును, సమబుద్ధిగలిగి, సర్వభూతహితంబునందు నాసక్తులైనవారెవరో, వారును నన్ను, బొందుచున్నారనియు, సెలవిచ్చిరి గదా! ఐతే, ఆత్మనాశనము గానిదనియు, నిర్దేశింపగూడదనియు, రూపాదులు లేనిదనియు, అంతట వ్యాపించిన దనియు, ప్రకృతియందు వుండునదియు, చలించనిదనియు, వాక్కాణించిరి గాని, ఆత్మ నాశన మగుచున్నది. రూపమున్నది అంతట వ్యాపించుటలేదు. ప్రకృతి యందుండుట నిజమే! చలించుచున్నది.

శ్రీకృష్ణస్వాములవారు :- అర్జునా, వినుము దెల్పెద. ఆత్మ శరీరమును విడచి, శరీరమునందవతరించుచున్నది. నాశనమెట్లు? శరీరములో నుండి పోగా, యేరూపమైపోయినది? అందుచే రూపము లేనిదనియు పిపీలికాది చతుర్ముఖ బ్రహ్మపర్యంతము, వుండుటచేత, అంతట నున్నదియు, శరీరములో నున్నప్పుడింద్రియ గుణములే చలించుచున్నవిగాని ఆత్మచలించుటలేదే.

అర్జునుడు :- మహా ప్రభూ! ఆత్మచలించుట లేదనిరిగదా! శరీరమును విడిచి,

మరియొక శరీరమును ఆశ్రయించుట, చలించుటకాదా? ఆత్మ ఆవరణములో యున్నదిగాని, ఆవరణమును విడచి, బైట అంతట లేదుగదా, ఆత్మకు రూపము లేదంటిరి గదా! యెందుకు లేదు? ... ఆరవ అధ్యాయమును ఆత్మసంయమ యోగములో 19వ శ్లోకభావమిట్లు దెల్పిరి.

**శ్లో॥ యధా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమాస్మృతా ।**
**యోగినోయతచిత్తస్య యుఙ్జతో యోగమాత్మనః ॥**

తా॥ గాలిలేని తావునందుంచబడిన దీపము చలింపక యుండునటుల నిరోధభూమియందు, అసంప్రజ్ఞాత. సమాధి యోగమును సాధించువాని మనస్సు రజస్త మనస్సులు లేక సత్త్వమయమగుటచేత చలింపనిదై, ఆత్మ స్వరూపమును ప్రత్యక్షంబున గావించును. సంప్రజ్ఞాత అసంప్రజ్ఞాత సమాధుల, సామాన్యలక్షణములనియు, సెలవిచ్చిరి గదా! ఐతే ఆత్మ గాలి లేనిచోట దీపముంచినట్లు యోగములో గానుపించునంటిరిగదా! పరిశేషన్యాయమున యోగముచేయని సమయమున గాలిలో నుంచబడిన దీపమువలె నాత్మ యెల్లప్పుడు చలించుచున్నట్లు అర్థంబగుచున్నది. అదియునుగాక ఆత్మయోగములో కోటిసూర్య ప్రకాశమానమై, గానుపించుచున్నది గదా! ఆత్మ కెట్లు రూపములేదు? యిదంతయు మాయా బోధయే గాన, మహాప్రభూ! యధార్థబోధను యెరిగింపుడని, అర్జునుడు శ్రీకృష్ణస్వాములవారిని వేడగా-

శ్రీకృష్ణస్వాములవారు :- ఓయి అర్జునా! నీకీమతిప్రకాశ మెట్లుగలిగెను, నీ మనస్సు నెవరిట్లు త్రిప్పిరి?

అర్జునుడు :- దేవ దేవా! దెల్పెదను వినుడు. తమరు గీతలో వచించువిధంబున, జ్ఞానభక్తి వైరాగ్యమును బూని, దాన ధర్మ యజ్ఞ యాగాది క్రతువులు చేయుచు, జపపూజలను సలుపుచు ఉదయ సాయంకాలముల యందు సంధ్యావందనాదులు సలుపుచు అనుదినము భగవద్గీతను పారాయణ చేయుచుంటిని. ఒక దినంబున ఉద్ధవుడు నా దరి కరుదేరగా, ఆయనకు తగిన గౌరవమర్యాదలుచేసి ఆసనముజూపితిని, అందుపై నుద్ధవుడధిష్టించి యుండగా నేను యధాప్రకారముగా జప పూజలను జరుపుచుంటిని. అంతలో, నన్ను ఉద్ధవుడు చూచి హేలనగా

నవ్వెను. నేను చిన్నబోయి నవ్వుటకు కారణమేమని గట్టిగా నడిగితిని. అందులకు ఉద్ధవుడోయి అర్జునా! నీ క్రియలు పిచ్చివానివలె నా కనులకు దోచుటచేత నేను నవ్వితినని బలుక నేనలిగి నే జేయు క్రియలకు తగిన శ్రుతులు యెన్నో యిచ్చితిని. వాటి నన్నింటి నుద్ధవుడు తృణప్రాయంబుగా జూచి, ఖండించి పూర్ణభావమంతయు చక్కగా నాకు బోధించెను. అని చెప్పుచున్నంతలో నుద్ధవుడు ప్రవేశించగా.....

శ్రీకృష్ణస్వాములవారు :- (ఉద్ధవునిచూచి) ఇదిగో మంచి సమయంలో నుద్ధవుడు వచ్చుచున్నాడు.

ఉద్ధవుడు :- శ్రీకృష్ణ గురుస్వాములవారికి సాష్టాంగ దండప్రణామంబులాచరించి, పాదములొత్తుచుండ శ్రీకృష్ణస్వాములవారుద్ధవుని దీవించి, లేవదీసి అదిగో నచ్చట కూర్చుండమన, నుద్ధవుడు రుక్మిణమ్మవారికికూడ నమస్కారము లాచరించి కూర్చుండెను.

అర్జునుడు :- ఉద్ధవా! వచ్చితివా?

ఉద్ధవుడు :- అర్జునా! వచ్చితిని.

అర్జునుడు :- ఉద్ధవా నీ విషయమయి స్వాములవారితో మాట్లాడుచుంటిని.

ఉద్ధవుడు :- అర్జునా అవునవును.

కృష్ణస్వాములువారు :- ఉద్ధవా! అర్జునుడు అచల పరిపూర్ణ భావము దెల్పుమనుచున్నాడు. తెల్పుటకు తగియుండునా?

ఉద్ధవుడు :- మహాదేవదేవా, అర్జునుడు అచల పరిపూర్ణ భావమును తెలుసుకొనుటకు తగినవాడే, ఎందుకంటిరా బాల్యమునుండియు మిమ్ములనే నమ్మి తమ ఆజ్ఞప్రకారంబున ప్రవర్తించుచున్నవాడు, తమ మహిమ తెలుసుకొనలేక, బంధువులని, బావమరదులని, చనువుచేత అనేకవిధములుగా ప్రవర్తించెను. వాటినన్నింటిని పాటించక యిప్పటి పరిస్థితినిబట్టి పూర్ణభావమున కర్హుడే. మహాప్రభూ తప్పక అర్జుననకు పూర్ణభావమెరిగింపుమనియే నా ప్రార్థన.

కృష్ణస్వాములవారు :- దేవీ రుక్మిణి, నీకును సమ్మతమేనా?

రుక్మిణి :- ప్రాణేశ్వరా! తమకు తెలియని యంశములులేవు. యెవరెవరెట్టి గుణవిశేషములతో ప్రవర్తించెదరో అంతయు తమకు విశదమే !

సీ॥ ముక్కంటి నోడించి మక్కువతో గని
పాశుపతాస్త్రంబు బట్టినాడు
బ్రహ్మాదులకునైన బడయని పంతంబు
భంగించి గయుని కాపాడినాడు
గంధర్వులేవచ్చి ఘన సుయోధనుబట్టి
గట్టి గొంపోవ తా గాచినాడు
వీరుడగు కర్ణుని బేధించి వసుధలో
పరమ ప్రతిష్టతో ప్రబలినాడు

గీ॥ అట్టి మహానీయవీరుడా యర్జునుండు
పాధములు రెండు భక్తితో పట్టుకొనుచు
మ్రొక్కి వేడుచునుండెను మక్కువగను
సందియంబేల జెప్పుడు పొందుగూర్చి ॥

మహాదేవదేవా, తమకు తగిన ప్రియశిష్యులు ఉద్ధవార్జునులే మీకీర్తి ప్రతిష్టా పరంపరల నిలుపువారు. గాన అర్జునునకు పరిపూర్ణభావము పూర్తిగా దెల్పవచ్చును.

అర్జునుడు :- దేవాదిదేవా

కం॥ పరమును దెల్పెదరని నే
సరగున నరుదెంచినాడ సమ్ముఖమునకే
మరువక యనయము దలచెద
స్థిరముగ నున్నటిదేదో స్థిరపరచుమయా ॥

అర్జునుడిట్లుదీనుడై బలుక కృష్ణస్వాములువారు కరుణాకటాక్ష లక్షణముచే, పరమును దెల్పుటకు మనస్సునుద్దేశించగా, రుక్మిణి ఉద్ధవులు పూజా విధానమునకు తగిన వస్తు సామాగ్రులన్నింటిని పూర్తిగా సమకూర్చుకొని, కృష్ణస్వాములువారిని రత్నపీఠంబున నిలువంబెట్టి, సువర్ణ కలశంబులతో శుద్ధోదకముదీసి, సద్గురుచరణములపై వేయుచు, పాదములుకడిగి, నీటిని

శిరముపై జల్లుకొని, కొంత పాదజలంబును తీర్థప్రసాదంబుగా స్వీకరించి, శిరమును నురమును గరములును ధరణిపైమోపి, సాష్టాంగ నమస్కారంబు లాచరించి, రుక్మిణి ఉద్ధవులు ఆచరణధర్మంబులు జేయ సద్గురు స్వాములువారు వారిని దీవించి, లేవదీసిరి, అంతట నర్జునుడు ఆ ఆచరణ విధివిధానంబులన్నింటిని జూచి, అదే ప్రకారంబుగా సద్గురుస్వాముల వారికి చేయుచుండ గురుస్వాములు వారర్జునున కిట్లాశీర్వచనము చేయుచున్నారు.

**శ్లో॥ అజ్ఞానమూల హరణం జన్మ కర్మ నివారణం**
**జ్ఞానవైరాగ్య సిధ్యార్థం గురుపాదోదకం పిబేత్ ॥**

అనియు సద్గురుస్వాములువారు అర్జునుదీవించి లేవదీసిరి. అంతట సద్గురుస్వాములువారిని అనేక మణిమయ రత్నఖచిత సువర్ణ సింహాసనంబున అధిష్ఠింపజేసి, పాదయుగ లాంగుష్టములకు సుగంధ హరిద్ర కుంకుమముల బూసి, యక్షత పుష్పములచేత పూజించి, అర్జునుడు ఆచరణ ధర్మంబులు చేయుచు అర్ఘ్యమును సమర్పింప సద్గురుస్వాములు వారాచమనము జేసిరి. తదుపరి స్వాములువారికి పంచామృతము సమర్పించి శుద్ధోదకస్నానము చేయించి, పట్టువస్త్రమును గట్టించి, యజ్ఞోపవీతంబును ధరింపజేయించి సర్వాభరణముల నలంకరింపచేసి, సుగంధ కర్పూరాధ్యనేక పరిమళ పుష్పహారములను కంఠంబున ధరింపజేసి, పన్నీటిని మేనుపైని చిలుకుచు సద్గురుస్వాములువారిని మహానంద పరవశునిగాజేసి, నుదుటను సుగంధమును చంద్రాకారంబున తిలకము నిడి గంధాక్షత పుష్పంబులచే బూజించి, సువర్ణపుష్పంబును సమర్పించుచు, అథాంగపూజను పూర్తిగాజేసి, పత్రపూజను జేసి అష్టోత్తర శతనామావళిని జపించుచు పూజించి నానావిధ పరిమళ పత్రపుష్పములు సమ ర్పించుచు, ధూపదీప శాల్యాన్న షడ్రసోప పంచభక్ష్యాది సంయుత నైవేధ్యమును సమర్పించి, యుదక పానీయము సమర్పించుచూ, సుపక్వాద్యనేక రంబాత్రమ ఖర్జూర నారంగ ద్రాక్ష కదళీ నారికేళ ఫలహార నూవేద్యంబు సమర్పించి పాదతీర్థమును అర్జునుడు పుచ్చుకొని, తాంబూలమును నర్పించుచు, సువర్ణపుష్పము దక్షిణ సమర్పించి, దివ్య సువర్ణ మంత్రపుష్పంబు నర్పించి, ఆత్మ ప్రదక్షణ నమస్కారము సమర్పించిన సద్గురుస్వాములువారు ప్రసాదమును స్వీకరించి గురుప్రసాదమును రుక్మిణీయుద్ధవార్జునుల కిచ్చి యిట్లుదీవించిరి.

శ్లో॥ గురో రుచ్ఛిష్ట ప్రసాదం భుక్త్వా త్రిపుటనాశనం ।
సర్వద్వంద్వ వినాశంచ విద్యతే న పునర్భవం ॥

గురుస్వాములవారు యిట్లు దీవించుచు అర్జునా! పరిపూర్ణ భావమంతయు చక్కగా జెప్పెదను వినుము.

"తొహర"

పరిపూర్ణంబును జూపుచు యెరుకను-పైగా దెల్పెద వినుము
ఎరుక పుట్టువును దెల్పియు సరిగా-యెరుకను దీసెదగనుము
పరిపూర్ణంబను పల్కులేనిదే-పరమైయున్నది గనుము
ఎరుకన ఎరిగేదంతయు నీవును - యెరుకన నేనును వినుము
యెరుకే మూలములేకయె వచ్చెను-ఎరుక సమూలము వినుము
ఎరుకను కలలో వచ్చినవన్నియు-ఏమగు మేల్కలో గనుము ॥

ఓయి అర్జునా! ముందుగా పరిపూర్ణమును దెల్పి, యెరుకను వివరించి, యెరుక పుట్టువును దెల్పి, యెరుకను లేకుండజేసెదను. అతి జాగ్రత్తగా వినుము....

శ్లో॥ అతిశ్శివయేవ సనాతనం బ్రహ్మ భగవాన్
నచలమేష సత్యం నిరంజనం నిర్వికల్పం
నీరంధ్రం పరాత్పరం బాహ్యముపైతి విద్వాన్
అస్యజ్ఞానం నాస్తిజన్మ ప్రవృద్ధినా స్తిజ్ఞప్తి సర్వదా
సత్యవాక్యం భక్తిజ్ఞానే కర్మశక్తీచ రహితం
సర్వవ్యాప్తం సచ్చిదానంద రహితం ॥

తా॥ ఓయి అర్జునా! అమిత శుభముగలదియై శాశ్వతముగా నున్నది. భ్రమయనేదే భగవంతుడు, చలనములేనిదే నిజమైనది. దోషములేనిది వికల్పములేనిది సందులేనిది, శ్రేష్టులకందరికి శ్రేష్ఠమైనది వెలుపలిది పైది విద్యకానిది తాననే జ్ఞానము కానిది పుట్టుట పెరుగుట లేనిది, జ్ఞప్తిలేనిది, ఎల్లప్పుడున్నది యిదే నిజమైన మాట. భక్తి, జ్ఞానము, కర్మము సామర్థ్యము లేనిది అంతట వ్యాపించి యున్నది. లేక కలిగిన జ్ఞానము సంతోషము లేనిది.

శ్లో॥ బ్రహ్మాండం వ్యాపితం బాహ్యం బాహ్యం
సర్వత్ర వ్యాపితం అంతర్బహిశ్చ తద్బాహ్యం
మన్యం నా స్తీతి నిశ్చితం ఇతి నిశ్చయ్య యో
విద్వాన్ నచల యేవ నసంశయః ॥

ధరణియంతటను వ్యాపించియున్నది పైనిలోపల అంతట వ్యాపించి యున్నది మీదను లోపలయున్నది. యితరమేమి లేకయున్నది యిదే నిజము సుమా! యిట్లు నిశ్చయము పొందినవారే విద్వాంసులు, చలనములేనిది, శాశ్వతముగా యున్నది, సంశయము వద్దు.

శ్లో॥ సద్రూపం నాస్తి సర్వత్ర చిద్రూపం నాస్తి ।
సర్వదా ఆనందరూపగుం నాస్తి అచలంచాస్తి సర్వదా ॥

తా॥ సాకార రూపములేనిది, అంతట జ్ఞానరూపములేనిది, ఎల్లప్పుడు సంతోష రూపమైనది లేనిది, చలనము లేనిది, శాశ్వతము ఎల్లప్పుడు వున్నది.

శ్లో॥ సర్వానంద విహీనశ్చ అచలోయం సనాతనం
ఆనంద రహిత మచలం కర్తృ కార్య వివర్జితం
బంధా బంధాది రహిత మమృతం చాస్తి సర్వదా
సూక్ష్మాత్సూక్ష్మతరం నాస్తి మహితోన్ మహిత వర్జితం ॥

తా॥ ఆనందము బొందుచున్న పిపీలికాది చతుర్ముఖ బ్రహ్మ పర్యంతము లేనిది, చలనములేనిది, ఎల్లప్పుడువున్నది, ఆనందము లేనిది, చలనములేనిది, చావులేనిది, అంతట నిండియున్నది, అణుస్వరూపమై కనబడి కనబడనిది, లేనిది మహత్తు చేయుచు చేయకయుండుట లేనిది.

శ్లో॥ అవేద్య మసంగ మబాధ్య మబోధ్య మలక్ష్య
మకర్మ మప్రమేయ మద్వయ మనిష్క్రియ పరమా
కాశ మచలం సర్వదా భాతిపూర్ణం నిష్కలం
నిష్క్రియం పూర్ణం నిరవంద్యం నిరామయం
నిర్దేహ రహితం నిత్యం బాహ్యా బ్రహ్మేతి నిశ్చితం
మాయత్వంభవేద్రుద్రష్ట స్తపరం పరమ శివం

**సర్వ పరిపూర్ణగుం సత్యం శివాదన్యం నకించన ॥**

తా॥ తెలివిలేనిది కూడికకానిది అడ్డు లేనిది బాధలేనిది చూపులేనిది విదాయక కృత్యములు లేనిది సాటిలేనిది రెండుకానిది యే పని చేయనిది ఉత్కృష్టమైనది అవకాశము కదలికలేనిది ఎల్లప్పుడు ఒక విధముగానున్నది, వెల్తిలేనిది, కళలేనిది పనిచేయనిది పరిపూర్ణమై వున్నది ఆక్షేపణ లేనిది రోగములేనిది శరీర మేమియులేనిది ఏమియుకానిది శాశ్వతమైనది వెలుపలది వేదాతీతమై నిశ్చయింపబడినది. విద్యకు అన్యము కాగల స్వభావముకలది చూడదగినది ఉత్కృష్టమైనది సర్వము నిండి వెల్తిలేనిది నిజమైనది మహాయోగ్యమైనది ఇతరం బించుకైన లేనిది.

**శ్లో॥ జాగ్రతస్వప్న సుషుప్త్యాది అవస్తా పంచకం నహి,**
**షడ్మూరి రహితో దేవ షడంగై వర్జితః శివః ॥**

తా॥ జాగ్రతయు స్వప్నము సుషుప్తియాది ఐదు అవస్థలు లేనిది ఆకలి-దప్పిక, పుట్టుక-చావు, సుఖము-దుఃఖములు లేనిది, కామక్రోధ లోభ మోహమద మత్సరంబులు లేనిది, శుభమైనది.

**శ్లో॥ సర్వకాలే సదావ్యాప్తం సర్వదేశేషు వ్యాపితం**
**నిష్కామం నిర్మలం శుద్ధ మచలం శబ్దవర్జితం ॥**

తా॥ సర్వకాలములయందు వ్యాపించియున్నది సర్వదేశములయందు నిండి నిబిడీకృతమైయున్నది. కోరికలేనిది మలినమంటక పరిశుభ్రముగా కదిలిక లేక ధ్వనిలేనిదై యున్నది.

**శ్లో॥ తేజోంధకార రాహిత్యం బాహ్యాబ్రహ్మా నసంశయః**

**సచ్ఛిధానంద రూపత్వం మాయా యిత్యబిదీయతే ॥**

తా॥ వెలుగు చీకటిలేనిది వెలుపలిది నేదాతీతమైయున్నది. సంశయించ వద్దు, లేని జ్ఞానము ఆనంద రూపములన్నియు, యింద్రజాలము పరిత్యజించవలెను. ధీరతతో సుమా!

**శ్లో॥ సర్వవ్యాప్తం సచ్ఛిదానంద రహితం సర్వాతీతం**
**సర్వలోక ప్రశస్తం శర్వబాధ్య సర్వదేశ స్వవ్యాప్తం**

సర్వాద్యేకం కర్తృ కార్య సహీనం ॥

తా॥ సర్వమంతతట వ్యాపించియున్నది, లేనిజ్ఞానము ఆనందములు లేనిది, సర్వప్రపంచమున కతీతమైనది, సర్వలోకములకు ప్రశస్తమైనది, సర్వమునకు యేబాధ్యతలు లేనిది, సర్వ దేశములయందు వ్యాపించియున్నది, సర్వము యేకమైనది, కర్తృత్వ కార్యములు లేనిది.

**శ్లో॥ దేశాదేశ వినిర్ముక్తం కోశాతీత సుసంస్థితం:**
**నిర్ద్వంద్వ నిత్యసంపూర్ణం వస్తుమద్రహితం నమః ॥**

తా॥ దేశాదేశముల అంతట చావు పుట్టువులు లేక అన్నమయ ప్రాణమయ మనోమయే విజ్ఞానమయ ఆనందమయము లనియెడు పంచకోశములకు అతీతమై లెస్సగా స్థిరమైయున్నది. రెండుగాక శాశ్వతము పరిపూర్ణముగా వస్తువుగా యున్నది.

**శ్లో॥ నిరాఖ్యాతం నిరాభాసం నిస్తేజో నిర్మలం సదా ।**
**నిర్మయత్వం నిరాశత్వం తల్లింగం పరమ ప్రభు ః ॥**

తా॥ కీర్తిలేనిది జాలిలేనిది ప్రకాశములేనిది మయిలలేనిది ఎల్లప్పుడున్నది శరీరములేనిది మొదట తత్వము ఉత్తమమైనది. ఉత్కృష్టమైనది దేవుడు.

**శ్లో॥ ఆద్యంత రహిత మమలం పరిపూర్ణం పూర్ణం**
**పరాత్పర మసంగ మవేద్యమానం భావైకగమ్య**
**మచలం మహిమాది శూన్య మగ్రాహ్య**
**మనంత మనింద్య మానం ॥**

తా॥ ఆదియంతములు లేనిది నిర్మలమైనది వెల్తిలేనిది నిండినదై శ్రేష్ఠుల కందరకు శ్రేష్ఠమైనది, కూడికలేనిది, అడ్డులేనిది, తెలివిలేనిది, బావమునకు యేకమై పొందదగినది, కదలనిది, మహిమలులేనిది, గ్రహించనది, అంతములేనిది, కొలతలేనిది.

**శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో నిర్వికల్పో నిరంజనం ।**
**నిర్వికారో నిరాకారో నిత్యముక్తోహ్మి నిర్మల ః ॥**

తా॥ గుణములేనిది పనిచేయనిది శాశ్వతమున్నది వికల్పము లేనిది దోషములులేనిది వికారములేనిది ఆకారములేనిది శాశ్వతము చావు పుట్టువులు లేనిది మయిలలేనిది.

అర్జునుడు :- మహా ప్రభూ! తమరు బోధించు పూర్ణబోధ నాకు చాలా అద్భుతముగా యున్నది. నా మనస్సుకు బోధపడినట్లు చక్కగా దెల్పుడు.

శ్రీ సద్గురుస్వాములువారు :- అర్జునా! యింకను దెల్పెదను వినుము.

**శ్లో॥ శుద్ధపూర్ణం నిరాధారం పూర్ణాత్పూర్ణం పరాత్పరం ।**
**అప్రమాన మసంగత్వం తల్లింగ మచలం భవేత్ ॥**

తా॥ పరిశుద్ధమైనది, నిండినది, ఆధారములేనిది, నిండి పరిపూర్ణమైనది, శ్రేష్ఠులందరకు శ్రేష్ఠమైనది, మేరలేనిది, కూడికలేనిది, మొదటి తత్వము, కదలికలేని స్వభావముకలది.

**శ్లో॥ నిశ్చలం నిర్మలం శుద్ధం అచలం సర్వదా పూర్ణం ।**
**సర్వప్రపంచ శక్తిహీనం సర్వదా శాశ్వత ః ॥**

తా॥ కదలనిది మయిలలేనిది పరిశుద్ధమైనది, కదలిక లేనిది, ఎల్లప్పుడు నిండినది సర్వప్రపంచమునకు గల సామర్థ్యము లేనిది. శాశ్వతముగా నున్నది.

**శ్లో॥ సర్వకారణహీనోహి స యేవ పరమ శ్శివః ।**
**ప్రజ్ఞానవాక్యహీనాత్మా అహం బ్రహ్మ వర్జితం ॥**

తా॥ సమస్తయాతనములు లేనిది నీచముగానిది, ఉత్కృష్టమైనది, శుభమైనది, ప్రజ్ఞాన బ్రహ్మంబనే వాక్యముగానిది, ఆత్మయను బ్రాహ్మము అన్నది లేనిది.

**శ్లో॥ తత్వమస్యాది హీనాత్మా ఆయమాత్మేతి వర్జితం ।**
**ప్రణవార్థ విహీనాత్మా లక్ష్య వాచ్య వివర్జిత ః ॥**

తా॥ తత్వమసిపదంబులు గాక అయమాత్మ బ్రహ్మమనేది లేక, ఓంకారమనేది లేక, ఆత్మలేనిది చూపులేనిది మాటలేనిది.

**శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞ వర్జితం జీవబ్రహ్మైక్యం నహి ।**

త్రికూటస్త నిరసనం సత్తా సత్తాద్వయం నహి ॥

తా॥ శరీరాత్మలు గానిది, జీవబ్రహ్మాలు కూడికలేనిది, భ్రూమధ్యమందున్నాత్మ లేనిది, శక్తాశక్తులు రెండు లేనిది.

**శ్లో॥ శుద్ధచైతన్య హీనాత్మ సర్వాభావ వివర్జితం ।**
**ద్వైతాద్వైత విహీనాత్మా క్షేత్ర క్షేత్రజ్ఞ వర్జితం ద్వయదోష వివర్జితం ॥**

తా॥ పరిశుభ్రమైన గురుతెరిగే చైతన్యంలేనిది, ఆత్మచేత స్వభావములు పొందుటలేనిది ద్వైతా ద్వైతములు లేనిది, ఆత్మలేనిది, శరీరము జ్ఞానములేనిది రెండింటితో కూడినదోషములన్నియు లేనిది.

**శ్లో॥ దృశ్యా దృశ్య విహీనాత్మా ద్రష్టా దృక్ వివర్జితం ।**
**ఖండాఖండ విహీనాత్మా క్షేత్ర క్షేత్రజ్ఞ వర్జితం**
**బ్రహ్మార్ధవాచ్య హీనాత్మ ఆత్మ శబ్దార్ధ వర్జితం**
**సర్వప్రపూర్ణ రూపాత్మ సర్వత్రాత్మా విశిష్యతే ॥**

తా॥ కంటికగుపడి అగుపడనిది లేనిది, ఆత్మచూచేది చూడబడేది లేనిది, ఖండింపబడి ఖండింపబడనిది లేనిది, శరీరాత్మలు లేనిది వేదాధ్యయనమను మాటలేనిది, ఆత్మచేగలిగిన భావార్ధము లేనిది, అంతట మొదటిది వెల్తిలేనిది, రూపాత్మకమై అంతటనున్న ఆత్మలేనిది.

**శ్లో॥ దృశ్యం నశ్యతి సత్యంచతథాశూన్యం తదానహి ।**
**ద్వంద్వహీనం సదా బాహ్యం సాక్షి హీనంచ సర్వదా ॥**

తా॥ అగుపడినది నాశనమగును, నిజము సుమా! అవిధమువనే లేకపోయినది, అట్లేలేనిది, ప్రకృతి పురుషులు కానిది, ఎల్లప్పుడు వెలుపలిది కర్తృత్వము లేనిది ఎల్లప్పుడున్నది.

**శ్లో॥ తమః శూన్యం ప్రభాశూన్యం ఆత్మశూన్య మనామయం ః**
**నిర్దేహం నిర్మలం పూర్ణం తల్లింగమచలం భవేత్ ॥**

తా॥ అందకారములేనిది, వెలుగులేనిది, ఆత్మలేనిది, రోగము లేనిది, మయిలలేనిది, వెల్తిలేనిది, మొదటితత్వం, కదలిక లేనిదగుచున్నది.

**శ్లో॥ నిశాదివౌ పూర్ణమేకం సత్యం నిశ్చలమేవచ ః**

పరం నిర్దేహ మమలం నిస్సంగం నిర్మలం సదా ॥

తా॥ రాత్రింబవళ్ళు పూర్ణముగాను, యేకముగా నున్నటువంటిది, కదలకుండ నున్నటువంటి అన్నింటికంటె పైనున్నది శరీరము లేనిది, మయిలలేనిది, కలయిక లేనిది, ఎల్లప్పుడును పరిశుద్ధమైనది.



## "తోహర"

అర్జునుడు :- వింతలులేని భావము దెలియక - యెంతవారికిని వశమే

ఎంతదెల్పినను మంతినమున - సుంతైనను నాటదు నిజమే

స్పష్టముగాను చెప్పిచూడుమా - కష్టములేకయె దేవా

అష్టమదంబుల నణచిపెట్టి మీ - యిష్టతనుండెద దేవా

ఉన్నది చూపుచు లేనిదిలేదని - నున్నజేయకు మహాప్రభూ కన్నతండ్రివని

నిన్నునమ్మితిని - ఘనతను దెల్పుమ మహా ప్రభూ తల్లివి తండ్రివి

దొరవుదాతవని - దలచుచు మిమ్ముమది నమ్మితినే చల్లని కృపచే

పూర్ణము జూపుము- చలనములేనిది గాంచెదనే ॥

గురుస్వాములువారు :- ఓయి అర్జునా! చక్కగను దెల్పెదను వినుము.

సీ॥ పుట్టదు గిట్టదు పుట్టించగాబోదు
బట్టబైలైయున్న పరమపదము
యుగ యగంబులుగాక జగముపుట్టగ గిట్ట
జగమునే మనబోక చట్టువలెను
మెట్టుపల్లములేక గట్టిమెత్తన గాక
అట్టిట్టి దనరాక నంతవెలసె
ఖండ ఖండముగాక ఖండంబు గనబోక
పండువెన్నెలగాక పట్టుపడక ॥



గీ॥ నిండి నిబిడీకృతం బౌచు నుండెనదిగొ
కట్టుకట్టిన పట్టున కట్టువడక
యున్నదంతట కనుగొను మున్నతముగ
నున్న దెన్నిన సున్నగు నన్నయెరుక ॥

కం॥ అందిందనక మరెందును
ముందును వెన్కయునుగాక ముఖ్యముగానే
క్రిందగనున్నది యంతట
బంధములేనట్టి దదియె పరమును గనుమా ॥

అర్జునుడు :- ఆశ్చర్యపడుచు, నలువంకలు జూచుచు, విభ్రాంతుడై యుండగా.....

సద్గురుస్వాములు వారు :- అర్జునా! పరమును చక్కగా జూపెదను చూడుము.

కం॥ పరమెరుగుము స్థిరమదియే
నిరతము నొకరీతినుండె నిశ్చలమై తా
మరుగింతె బయలు జూడుము
అరమర లేకుండనుండె నంతటనదిగో ॥

అర్జునుడు :- కలవరపడుచు.....ఆహా! యేమి యెంతజెప్పినను బోధపడుట లేదే (యనుచు తనలోనానాలోచించుచు......... విచారణ చేయుచుండెను.)

సద్గురుస్వాములు వారు :- అర్జునా చక్కగా విని కనుము

***శ్లో॥ అంతఃపూర్ణో బహిఃపూర్ణో పూర్ణకుంభ మివార్ణవె ।***
***అంతర్భహిరపి వ్యాప్తం శివం సర్వగతం శృణు ॥***

తా॥ ఓయి అర్జునా! విను పరిపూర్ణ మెట్టిదనగా సముద్ర జలమందు కుండను ముంచిన ఆకుండకు మీదను ప్రక్కల క్రిందను లోపల నంతటను, వ్యాపించి, నీరెట్లున్నదో తత్ప్రకారము నీవు పరిపూర్ణమాలాగునే యున్నది.

అర్జునుడు :- నిట్టూర్పులూర్చుచు, ఆశ్చర్యముతో జూచుచుండెను.

అంతట గురుస్వాములువారు :- (చిరునగవుతో) అర్జునా! యీసారి చక్కగా పరిపూర్ణమును జూపెదను జూడుము.

కం॥ సాగరమందున మీనము
యేగతిగా నుండునోయి ఏర్పడ వినుమా
బాగుగ పరిపూర్ణములో
నాగతిగా నున్నవాడ వర్జున గనుమా ॥

***శ్లో॥ తధా బాహ్యాశ్చ లోకశ్చ తధాజాయతి నశ్యతి ।
సముద్రే మత్స్య కూర్మాధ్యాః యధా చరతి జంతవః ॥***

తా॥ ఓయి అర్జునా! యీ పద్య శ్లోకములకు చక్కగా భావము జెప్పెదను. జాగ్రత్తగా గ్రహించి, చూడుము, సముద్రములో చేప తాబేలు మొదలైన జలచరములెట్లు పుట్టి చచ్చుచున్నవో, ఆవిధముగానే పరిపూర్ణములో నరమృగ జంతుజాలములు, సకల చరాచరములు పుట్టి చచ్చుచున్నవి. చేప, తాబేలు, మొదలైన వాటికి సముద్రము యేలాగు మీదను, క్రిందను, ప్రక్కల యందు సందులందు నిండియున్నదో, అలాగుననే అచలపరిపూర్ణ పరబ్రహ్మము నర మృగ సకల చరాచర జంతు జాలములకు మీదను క్రిందను ప్రక్కల సందుగొందుల, ముందు వెనుకల నిండి నిబిడీకృతంబై ఆవరించియున్నది. యిదిగో చూడుమని కనుసంజ్ఞ చేయుచు ఈ వుత్తబట్టబయులే అచల పరిపూర్ణబ్రహ్మము, చూడుమని చేతితో శ్రీసద్గురుస్వాములువారు చూపించిరి.అంతట అర్జునుడు, కలవరపడుచు విభ్రాంతి నొందుచు, తనకు ముందును, వెనుకను ప్రక్కల మీదను జూచుచు, గజగజ వణుకుచు, కదలుచున్న యధరముతో అచల పరిపూర్ణ పరబ్రహ్మంబగు బట్టబయలును గాంచి, సద్గురు స్వాములవారికి సాష్టాంగ నమస్కారములు జేయుచు, మహాప్రభూ! దైవమును కనులనిండ గాంచితిని. ఇవియే మీకు నా అనంతకోటి నమస్కారములని బల్కుచు, సద్గురు చరణములు శిరముపైని మోపుకొనుచు, లేవకున్న అర్జునుని శ్రీసద్గురుస్వాములు వారు.......

శ్లో॥ జాతం నాస్తి మృతం నాస్తి నాస్తి జ్ఞానం కదాచన ।
ప్రపంచం నాస్తి సర్వత్రనాస్తి సత్కారణం సదా ॥

తా॥ పుట్టువులేదు చావులేదు జ్ఞానములేదు నిజము సుమా! ప్రపంచము లేదు సర్వమేమియులేదు కారణములేదు ఎల్లప్పుడు నున్నదే యున్నది.

శ్లో॥ పునః పునః ప్రవక్ష్యామి సాక్షి నాస్తీతి నిశ్చితం ।
బాహ్యం బ్రహ్మేతి నిశ్చిత్య యితి వేదాంత డిండిమం ॥

తా॥ మరల మరల ప్రవాహమువలె వచ్చిపోవుచు, వినిగాని కనిగాని, తెలిసినది లేనిది, నిశ్చయింపబడినది వెలుపలది, బ్రహ్మమే నిజమైనది, యిది వేదాంతమున కతీతమైన ఢంకా. యిట్లు గురుస్వాములవారు అర్జునుని దీవించి బోధించి, లేవదీసి కూర్చుండ నియమించెను.

"తోహర"

అర్జనుడు :- అంతటనుండిన పరమునుగాంచియు - అర్జను
డామోదముతోడన్
మంతనమున నుప్పొంగుచు - యెంతో మరి మరి బల్కుచునెండెన్
మహాప్రభూ ఈ మర్మము గనుటకు - మానవులకు శక్యంబగునే
మహాదేవ మీ కరుణచేతనే - మరుగునుగంటి నిజంబేన్
అందున దిరుగుచు దానినిదెలియక - అందునె వెదకును మందమతీ
ముందుగ సద్గురు కరుణవడసిన - పొందిక గాంచు నమందమతీ ॥

(పాట-చతురశ్రగతి)

ప॥ చూపించిరి పరిపూర్ణ భావము చూపించగ నేజూచితిని
అపోజ్యోతికి నావలనున్నది యాపరమార్థం జూచితిని ॥చూపి॥

2. ఎన్నో జన్మములెత్తియెత్తి మరికన్నులజూచితి పరిపూర్ణం
కన్నులజూచిన ఎరుకేనున్నది ఎన్నగనున్నది పరిపూర్ణం ॥చూపి॥

3. నిన్నును నన్నును ఎన్నినవెరుకే సున్నగు నున్నది పరిపూర్ణం

నేను నీవునేనన్నది యున్నదియన్నది లేనిది పరిపూర్ణం ॥చూపి॥

4. ఖండా ఖండములు గాకయె పరమై మెండుగనున్నది పరిపూర్ణం
ఎండవానలకుసొలయక నంతట దండిగ నున్నది పరిపూర్ణం ॥చూపి॥

5. చలికిని వణకక గాలికి గూలక నిలకడనున్నది పరిపూర్ణం
చలనములేక ఏ మలినమునంటక నిలువరించినదె పరమార్థం ॥చూపి॥

అర్జునుడు :- దేవా, సద్గురు మహాప్రభూ! సద్గురువుల కరుణాకటాక్షమును బొందలేక, మందమతులై అష్టమదములకు షడ్గుణములకు ఈషణత్రయములకు మానవులుచిక్కి, కన్నుగానక పెద్దలను దూషించుచు మాయా సంసారమునేనమ్మి, చావుపుట్టువులకు వశులై ఎడలేని సుఖదుఃఖముల ననుభవించుచు పశుపక్ష్యాదులవలెననేక యోనులందుపుట్టి చచ్చి చచ్చిపుట్టి జ్ఞానములేక, నరకముననుభవించు చున్నారు. దేవాదేవా, అచల పరిపూర్ణ బ్రహ్మమును ప్రత్యక్షముగా జూపించిరి గాని, భగవంతుడు భగవంతుడనుచు, జనులందరు బలుకుచుందురు. భగవంతుడనగ అర్థమేమో పూర్తిగా దెల్పుడు.

గురుస్వాములువారు :- అర్జునా, తెల్పెదను వినుము

కం॥ భగమనగాయోనే విను, భగవంతుడు యోనియందు ప్రభవించునయా,
భగవంతుడేను మేనులు, భగవంతుడు జగమునంతా వ్యాపించు
సుమ్మా, భగములోపుట్టి చచ్చుచుండు సుమ్మా, భగవంతుడేపుట్టి చచ్చి
పుట్టుచునుండు భగవంతుడే యిట్టితిప్పాల బడుచుండు ॥

మిత్ర ॥ యుగయుగములకు ముందునున్నది జగము భగవంతుడును గానిది
బాగుగాను బట్టబయలై జగము నంతట నిండియుండుచు వ్యాపించు
సుమ్మా, భగములోపుట్టి చచ్చుచుండు సుమ్మా,

ఓయి అర్జునా, భగవంతుడనగా, శరీరాత్మలు గలదే. అట్టి శరీరాత్మలు గలిగిన ప్రపంచమంతయు భగవంతుడని, అర్థముజెల్లును. అట్టి భగవంతుడనే ఆత్మ తనంతటతాను కలిగి మూడు గుణములుగా పరిణమించినది. మూడు గుణములనగా సత్వగుణము, తమోగుణము, రజోగుణము. సత్వగుణముచే

శుద్ధమాయ, తమోగుణముచే మలినమాయ, రజోగుణముచే మిశ్రమమాయ, శుద్ధమాయ దేవత్వము, మలినమాయ జడత్వము, మిశ్రమమాయ జీవత్వముగా బరిణమించినది. యెట్లనగా శుద్ధమాయ సత్వగుణప్రధానమై బ్రహ్మ విష్ణు రుద్రుడు ఈశ్వరుడు సదాశివుడు యిచ్ఛాశక్తి క్రియాశక్తి జ్ఞానశక్తి ఆదిశక్తి స్వర్గము వైకుంఠము కైలాసము పరమపదవి ముక్తిమోక్షము. లక్ష్మి సరస్వతి లింగస్వరూపము. జ్యోతి స్వరూపము మంగళ స్వరూపము నిర్గుణబ్రహ్మ యింకా అనేక పర్యాయనామములచేత పరిణమించినది. మలినమాయ తమోగుణప్రధానమై ఆకాశము వాయువు అగ్ని జలము పృధ్వి ప్రకృతి అవిద్య అనాత్మ జడము అమంగళము దృశ్యరూపముగా పరిణమించినది. శుద్ధమాయ మలినమాయ కలిసి మిశ్రమమాయయై రజోగుణముచే ద్వంద్వ స్వరూపమైన ప్రపంచమయ్యెను, యెట్లనగా ఆత్మానాత్మ ప్రకృతి పురుషుడు, క్షరము అక్షరము, సత్తుచిత్తులు, జడా జడములు జీవేశులు, నేనుమేనులు, దేహిదేహములు, జ్ఞానాజ్ఞానములు, సత్యాసత్యములు పాపపుణ్యములు శుక్లశోణితములు, నీరాన్నములు, జననమరణములు ఆదిగా గలిగిన మానవులు మృగములు, పక్షులు, జలచరములు, క్రిమికీటకాది జంతుజాలములు నామరూప కులగోత్ర వర్ణాశ్రమ ధర్మములను, అభిమానములుగల ప్రపంచమయ్యెను.

**శ్లో॥ భ్రమేనాహం భ్రమత్వంచా భ్రమేనో పాసకోజనః ।**
**భ్రమే నీశ్వరభావత్వం భ్రమమూల మిదం జగత్ ॥**

అనుప్రమాణము ననుసరించి, భ్రమచేతనే సర్వము గలుగుచున్నవి. గాన భ్రమను విడువుము. ఓయి అర్జునా! ఆత్మమొదలుగా నీ మాయా ప్రపంచమునకును అచల పరిపూర్ణ బ్రహ్మమునకు యించుకైన సంబంధములేకయే యున్నది.

అర్జునుడు :- అయితే మహాదేవదేవా! అచల పరిపూర్ణ పరబ్రహ్మమునకును, ఆత్మ ప్రపంచమునకును యించుకైన సంబంధము లేనియెడల ఆత్మయేలాగు పుట్టినది?

సద్గురుస్వాములు వారు :- నవ్వుచు, ఓయి అర్జునా! దెల్పెద వినుము, ఆత్మ

మూలములేకయే గలిగినది, అందుచేత స్వయంభువు స్వప్రకాశము, ఓంకారము, నాదము, చైతన్యము, కళ, బిందువు, అనియు ననేకనామములుగల దయ్యెను. అర్జునా దెల్పెదవినుము.

సీ॥ పరిపూర్ణముగనున్న బట్టబయలును గని
మరియేమి లేదని మసలవలయు
మూలమేమియులేక ముందుగా గుర్తించు
తనువేమి లేదని తలపవలయు
కలలోన నేనుగు కనబడి తెలివిరా
లేనివిధిన్ మేను లేనిదనియు
మూడు మంత్రంబులు ముదముతోడుత నీవు
తలచుచుండు మేను తరలువరకు

గీ॥ తనువు నెరుకలు రెండును తరలిపోవ
మరలజన్మంబు కలుగదు ధరణియందు
సత్యముగ నమ్ము మర్జున సత్యమిదియె
చక్కగను దెల్పితీని యింక శంకయేల ॥

ఇట్లు మూడుమంత్రములను స్పష్టముగా నెరిగించి, మంత్ర మూలములను, మంత్రార్ధములను, అంగన్యాస కరన్యాసములను, మంత్రసారములను, తేటతెల్లమిగా దెలుప అర్జునుడన్నింటిని చక్కగా నెరిగి మహాప్రభూ! దన్యుడనైతిని, మర్మమంతయు చక్కగా దెల్సికొంటిని, యెరుకను నిరసనజేసి, యెరుకను పూర్తిగా లేకుండజేయుడని ప్రార్థించగా-

గురుస్వాములువారు :- ఓయి అర్జునా! తెల్పెద వినుము

అర్జునుడు :- (కరద్వయమును జోడించి, వందనమాచరించుచు, నమ్రుడై వినుచుండెను)

సద్గురుస్వాములువారు :-

శృతి॥ పుణ్యాపాపం సుఖందుఃఖం జగజన్మ గురోఃకృపాత్

సర్వం నాస్తీతి నిశ్చిత్య మనో[బ్రహ్మణి నిక్షిపేత్ ॥

శ్లో॥ అశరీరం సర్వదాస్తి శరీరం రహితం సదా ।
అయమేవ సదాముక్తి రన్యదా భ్రమకారణం ॥

శ్లో॥ సర్వశూన్యమయం రూపం జన్మశూన్యం స్వభావతః ।
జన్మభావేన మృత్యుశ్చ పరిపూర్ణం స్వభావతః ॥

షడూర్మి రహితం శివం అనగా పంచభూతములున్ను, మాయయున్ను ఆకలిదప్పిక పుట్టువుచావు, సుఖము దుఃఖములున్ను కామక్రోధ లోభ మోహమదమత్సరములున్ను, శూన్యమై శివమనే వస్తువునిండి, సముద్రమువలె నున్నది. సంశయములేదు. త్రైలోక్య దుర్లభమైన మహాదనుభవమిది గురుకటాక్షము, భక్తివున్నకొద్ది వృద్ధి బొందగలదు. గురుసేవయున్నకొద్ది, మిక్కిలి దృఢముకాగలదు. గురుదయ వుంటే కటాక్షించితే యీ యనుభవమెప్పటికీ యే ప్రకారముగా వుండగలదు. గురుదయకు వెల్తి రాకూడదు. సర్వ అనుభవమునకు గురుకృప మూలమైయున్నది. గనుక యెరిగియున్నవారు పరమాత్మయై యున్నారు. దొరిగినదిగదాయని, మరచినవాడు మాయ కంటే, నెక్కువవాడు. అందుకు మూడు లోకాలవారికి గురు కటాక్ష మున్నకొద్ది యేమియు నెక్కువ తక్కువలుండవు ముమ్మాటికి యిది నిజం. యిదే జ్ఞాపకం. యిదే భావాతీతం, యిదే రాజయోగం, యిదే పరమగుహ్యం, ఇదే గురువాక్యం. మూలములేని గుర్తెరుగు శరీరమేమియు లేదు. యేరీతినంటె కలలోని ప్రపంచము, యెండమావులలో నుదకం తాటియందు పాము, ముచ్చిపు చిప్పలో వెండి, చీకటిలో మొద్దుమీది దొంగ, కుందేటికొమ్ము, ఆకాశ పుష్పం, గొడ్రాలి కొడుకు, ఆకాశమందు గంధర్వనగరము ఈ తొమ్మిదింటియందు, సత్యముగా తోచి విచారించిన నిజముకానట్లు యేమీలేదు. శరీరమేమియులేదు. గురుతునకు మూలములేదు. అని గురువాక్యముచేత తెలుసుకొని నమ్మి దాపడిన తనకు తానేయున్న అచలము స్వతఃసిద్ధమై యున్నది. యింక యెరుక యేలాగున లేదనిన-

శ్లో॥ కార్యమాయ ద్వయంనాస్తి భయభ్రమ సదా నహి ।

బ్రహ్మేస్సృహ భ్రమోనాస్తి వంధ్యాసూను వాపిచ ॥

తా॥ విధ్యయు అవిధ్యయు రెండును లేనివే. భయము, భ్రమయు ఎల్లప్పుడు లేనివె గొడ్డుదానికి బిడ్డ పుట్టిన చందము

శ్లో॥ మరీచికా జలం కుంభే పూర్ణేవాహి జగద్భవేత్ ।
క్షీర పావేన సర్వస్య విషం నశ్యే జ్జగద్భవేత్ ॥

తా॥ ఎండమావుల యుదకము, కుండలోనిండిన జగత్తు నిజమే, పాము పాలను పుచ్చుకొనిన దాని విషము నశించిన యెడల జగత్తు సత్యము కాగలదు.

శ్లో॥ తమః ప్రకాశమానేన భాసతే త్వస్తితే జగత్ ।
హిమం సూర్యకరేభాస్తి జగత్సత్యం భవిష్యతి ॥

తా॥ చీకటి వెల్తురుచేత నశించక ప్రకాశించిన యెడల, జగత్తు నిజమే మంచు సూర్యకిరణములకు నశించకున్న యెడల, జగత్తు సత్యము కాగలదు.

శ్లో॥ ఖరశృంగేణ మహిషోమృతశ్చె జగదస్తిచ ।
చంద్రో సూర్య ప్రకాశేన భాసతే జగదస్తిచ ॥

తా॥ గాడిదకొమ్ముచేత దున్న చచ్చిన యెడల జగత్తు నిజమే చంద్రుడు సూర్యతేజస్సునకు ప్రకాశమందకయున్న జగత్తు సత్యమే.

శ్లో॥ దినేశశి ప్రకాశేన నలినం భాసతే యది ।
తద్దైవ సత్యావద్భాతి దృగ్ దృశ్య చరాచరం ॥

తా॥ పగలు చంద్రుడు వెలుగుచు తామర పద్మమును ప్రకాశింప చేసినయెడల నిజమగు నావిధము చూచునది, చూడబడినది, కదలిక గలవి, కదలిక లేనివి.

శ్లో॥ దృష్టా ప్రపంచ మిత్యుక్తా మూఢయేవ నసంశయేః ॥
శుక్తో రజితపద్భాతి యధా రజ్జోహి సర్పవత్ ॥

తా॥ ఓయి అర్జునా! చూచువాడు జగత్తును కలదని, మూఢుడు తలంచుచున్నాడు. సంశయించవద్దు. ముచ్చెపుచిప్పను వెండి యనియు

త్రాడును పాముగాను తలంచినట్లు.......

*శ్లో॥ కుక్కుటస్యస్తనే క్షీరం జాయతే జగదస్తిచ ।*

*గగనారవింద మత్స్యేవ జగత్సత్యం భవిష్యతి ॥*

తా॥ కోడి చనులయందు పాలుపుట్టిన యెడల జగత్తు నిజమే ఆకాశమునందు గంధర్వ నగరమున్న యెడల, ప్రపంచము నిజము కాగలదు.

*శ్లో॥ మత్స్య పాదం భవే ద్దృష్టం జగద్దృష్టం భవిష్యత్ ।*

*భేదా బేదద్వయం నాస్తి ఉపదేశక సమం భవేత్ ॥*

తా॥ చేప పాదముకలిగి గనుపడిన ఈ అగుపడే ప్రపంచము నిజము కాగలదు. బేధాబేధములు రెండు లేనియెడల ఉపదేశం కాగల స్వభావము కలవాడగును.

*శ్లో॥ ఔదుంబరే పుష్పం దృష్టం జగదృష్టం భవిష్యతి ।*

*అజేగళే స్తనే క్షీరం జాయతే జగదస్తిచ ॥*

తా॥ ఓయి అర్జునా! బొడ్డచెట్టుపువ్వు కన్నులకగుపడిన యెడల నీ అగుపడుచున్న ప్రపంచమంతయును, నిజముకాగలదు మేంక మెడచనులయందు పాలు పుట్టినయెడ జగత్తు నిజమే, అనుచుదెల్పి గురుభక్తి లక్షణం నెరింగించుచున్నారు.

సీ॥ గురుస్వాములే తేర కూర్చుండగారాదు
కూర్చుండ నెడబాటు కోరరాదు
బోధజెప్పుచున్న పోవగా జనదెందు
చెప్పకుండిన బల్మిచేయరాదు
దయతోడ నిచ్చిన తడవుచేయగరాదు
తడవైన తొందర పడగరాదు
గురునాసనంబున గూర్చుండగారాదు
స్నానభుక్తులు ముందు సలుపరాదు

గీ॥ గొప్పజెప్పుచు నెదుట తా గొనగరాదు
తెలివిలేకున్న తెలుపుట తనకు తగదు
వినయమునజేరి భక్తిని విడువరాదు
గురుని భక్తుని కున్నట్టి గుణములివియె ॥

కం॥ గురుడు నరుడనుచు దలచక
గురుమంత్రము మరచిపోక గురుచరణంబుల్
మరువక హృదయంబందున
స్థిరముగ దలచిన నతండు స్థిరభక్తుడగున్ ॥

కం॥ గురుమూర్తియున్న స్థలమది
యెరుగుము కాశీయటంచు హృదయంబందున్
గురుడీశ్వరుడని మదిలో
స్థిరముగ నమ్మిన యతండె శిష్యుడుసుమ్మీ ॥

కం॥ గురుడున్న చోటు నెన్నును
మరువక భద్రాద్రియంచు మరిమరి యెంచున్
గురుడే శ్రీరాముండని
స్థిరమతితో దలచుచుండు శిష్యుండెపుడున్ ॥

కం॥ పరమెరిగి గురుతు విడచును
మరువక సద్గురుని యెపుడు మదిలో దలచున్
నిరతంబీ విధినుండిన
పరమ పవిత్రుండతండు పార్థా వినుమా!

అనుచు యిట్లు గురుభక్తి లక్షణంబెరింగించిన, శ్రీ సద్గురు నాజ్ఞ ప్రకారంబుగా మాయారహితుండై యుండె అట్టి శ్రీ కృష్ణోద్ధవార్జునుల సంవాదంబను జ్ఞానాతీతబోధిని......

## సమాప్తం.



అర్జునుడు :- "మంగళహారతి" (హరికాంభోజి-రాగం)

1. ప॥ మంగళము మంగళము మంగళము రంగా
మంగళహారతి గైకొను సోకుమూకలగొంగ ॥మం॥

2. మరుగులేక పరిపూర్ణము యెరిగించిన రంగా
నిరతము మీచరణములను మరువ వెన్నదొంగ ॥మం॥

3. గోవర్ధన పర్వతము గోళ్లతోను మీటినావు
భావ భావములులేని త్రోవ నెరిగించినావు ॥మం॥

4. ఆల మందలను గాయుచు కాళీయుని ద్రుంచినావు
కలకాలముగల దేవుని కనులనిండ జూపినావు ॥మం॥

5. పాలుత్రాగి పూతనకును ప్రాణంబులు దీసినావు
మూలమేమిలేని తనువు కీలుదెల్పి గాచినావు ॥మం॥

6. కలలోపల దోచునవి మెలకువలో లేనటువలె
యిల ఈ తనువట్టిదనుచు చులకనగా దెల్పినావు ॥మం॥

7. మూడును మంత్రంబులిట ముఖ్యముగా దెల్పినావు
యాడలేదు యెరుకయనుచు జాడనెరుక పరచినావు ॥మం॥

8. అల్ల ప్రాచిపుర నివాసి అప్పలాచార్యుడే రచించె
కలలోపలగల పదార్థములు మెలకువలో లేవని ॥మం॥

## (పాట-ఆటతాళము-భైరవి రాగం)

1. ప॥ రండోయి రండోయి నరులారా సద్గురుని జేరుదాము
నరులారా దండిగనున్నాది నరులారా పరము పండు
వెన్నెలగాదు నరులారా ॥రం॥

2. ఎండవానలకు నరులారా పరముయెండదు నానదు
నరులారా ఖండాఖండముగాక దండిగ నున్నాది
అండనుభాయక మెండుగనంతట ॥రం॥

3. గురునియెరుగరండి! నరులారా గురుడు బ్రహ్మ
విష్ణుహరుడు నరులారా ॥ గురుమూర్తి కన్నను సత్యదైవము
లేదు గురుడె పరబ్రహ్మమని గురుతు మరువకండి ॥రం॥

4. కల్ల సంసారమిది నరులారా వొల్లుమరచి తిరుగకండి
నరులారా తెల్లమిగనున్నది అల్లదిగొ పూర్ణము
చల్లగ గురుకనుసంజ్ఞను కనుగొండి ॥రం॥

5. ధనధాన్యములు నమ్మి నరులారా మీరుదగ్ధమైపో నేల
నరులారా దన ధాన్యములునెల్ల తనవెంట రాబోవు
ఘనమైన పూర్ణమును గనుగొండి రారండి ॥రం॥

6. రాజాధి రాజులో నరులారా రాజ్యముల్ విడచిపోయిరో
నరులారా బేజారులై మీరు రాజమార్గము గనక
కుజనులై యిలలోన నిజము దెలియరైరి ॥రం॥

7. దక్షిణ మూర్తులు నరులారా ప్రత్యక్షముగా దెల్పె
నరులారా క్షితిలోన సనకసనంద నాదులెరిగె దీక్షతో
శివరామ దీక్షితులు దెల్పె నిది ॥రం॥

8. విజయనగరము వాసులండోయి నరులారా మజ్జి లక్ష్మణ
ప్రభువు నరులరా సుజనులెరిగిన మరుగు నిజముగా
దెల్పెనిది నిజ గురునిజేరి మీరెరుగండి నిజమంత ॥రం॥

9. పరమగురు నెరుగండి నరులారా ధరలో లైను అప్పలాచార్య
నరులారా చరణములు హృదయమున మరువకను నిడుకొనుచు
పరిపూర్ణ బ్రహ్మమును యెరుగండి యెరుగండి ॥రం॥

బోలో శ్రీ సద్గురు ప్రభు మహారాజుకీ జే

బోలో శ్రీ శివరామదీక్షిత ప్రభు మహారాజుకీ జే ॥

# గ్రంథ ముద్రణ సహాయకులు

శ్రీ పూర్ణానంద పెద్దోళ్ళ మల్లారెడ్డి



శ్రీ ఏనుగు రామచంద్రారెడ్డి,
పి. మాణిక్యరెడ్డి గాజులగూడెం

శ్రీ దూస నర్సింహ్మార్యుల ప్రియశిష్యులు



శ్రీపూర్ణబోధానంద పాండురంగం గౌడ్-
శంకరమ్మ దంపతులు

శ్రీ చింతకింది సాయనార్యులవారి ప్రియశిష్యులు



శ్రీవింజమూరి విఠలయ్య గౌడ్ -
చంద్రకళ దంపతులు

శ్రీ నాగుల వెంకటేశమార్యుల ప్రియశిష్యులు



శ్రీ మోతె యాదగిరి గారు, టంగటూరు

## అచల పరిపూర్ణ శ్రీ వీసంశెట్టి యాదగిరి గారు

## అ॥ప॥ శ్రీ జొన్నాడ హన్మంతరావు గారు

## అ॥ప॥ శ్రీ జొన్నాడ నర్సింగ్‌రావు గారు

## శ్రీ పి. ప్రభాకర్ రెడ్డి గారు ఎస్.ఎం.టి. మాడల్ హైస్కూల్, హైదర్‌షాకోట్

## అ॥ప॥శ్రీ శేఖ్ బాబుపంతులు గాజులగూడెం